# తులసీమాహాత్మ్యము



నరసింహాచార్యకవి ప్రణీతము

# తులసీమాహాత్మ్యము



ఇది

ప్రాంధ్రీయుఁడును గౌత్స్యపసగోత్రజుఁడు

నగు

నరసింహాచర్యకిపిపురుషే

రచియింపఁబడినది.



మొదటికూర్పు

రాజమహేంద్రవరము.

శ్రీవిద్యానిలయముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

1920

వెల 0—6—0.

# ఉపోద్ఘాతము.



ఈతులసీమాహాత్మ్యమును రచియించినకవి వైష్ణవుఁడు. పేరు నరసింహాచార్యులు; తండ్రిపేరు లక్ష్మణాచార్యులు; తల్లిసీతమాంబ; వేంకటాచార్యులును కృష్ణమాచార్యులును సోదరులు. కవి కాశ్యపసగోత్రజుఁడు. తన తండ్రి సంస్కృతాంధ్రకవిత్వవిచక్షణుఁడనియు, సర్వశాస్త్రార్థవేదియనియుఁ దనయగ్రజుఁడు వేంకటాచార్యులు సమస్తశాస్త్రమర్మార్థసమర్థతాచణుఁ డనియుఁ జెప్పుకొనియుండుటచేఁ గవి పండితకుటుంబములోనివాఁడని తెలియవచ్చుచున్నది. ఈగ్రంథమున "ఘన కార్యము" అనుచోట "లావుకార్యము" అని ప్రయోగింపఁబడుటచేతను, నాకీగ్రంథము కళింకోటయందు లభియించుటచేతను గవి విశాఖపట్టణమండలవాస్తవ్యుఁడైయుండు నని తోఁచుచున్నది. కవిత్వమునుబట్టిచూడఁగా నిక్కవి యించుమించు నూఱుసంవత్సరములకు లోపలివాఁడని బోధయగుచున్నది. గ్రంథమునుబట్టి కవిచరిత్ర మింతకంటె నెక్కుడుగఁ దెలియవచ్చుటలేదు.

ఈతనికవిత్వమునం దందందుఁ బూర్వకవివిరుద్ధములగుప్రయోగములు గానవచ్చుచున్నవి. అయినను శైలి ధారాళమై ద్రాక్షాపాకవిలసితమై యొప్పారుచున్నది.

సముచితవర్ణనములతో నీచిన్నికథ యేకాశ్వాసముగ రచియింపఁబడినది. కథ సుప్రసిద్ధమయి సర్వజనవిదితమయియున్నది. ఇందుఁ గవి తులసీమాహాత్మ్యమును బ్రధానముగఁ జేసికొని రుక్మిణీసత్యభామల స్వభావవిభేదములను శ్రీకృష్ణునిమహాత్త్వమును జక్కఁగఁ బ్రదర్శించియున్నాఁడు. నీతిదాయకంబును భక్తిప్రతిపాదకంబును నగునీయుత్తమగ్రంథ మాబాలవృద్ధపఠనార్హ మైనదగుటచే నాంధ్రభాషాపతి కిదియు నొకనూతనాలంకారము కాఁగలదనునుద్దేశముతో దీనిం బ్రకటించితిని.

ప్రకాశకుఁడు.

శ్రీరామచంద్ర.

# తులసీమాహాత్మ్యము



శ్రీరామాయ నవమోహనస్మితజన ♦ శ్రేయఃప్రదాత్రే స్ఫుర
న్నీరేజాయతలోచనాయ పరభు ♦ జ్నేత్రౌఘవిధ్వంసినే
కారుణ్యాంబుధయే క్షుపాదవనితా ♦ కష్టాపనోదక్రియా
పారీణాయ నమస్సదా యనుచు లో ♦ భావించి సేవించెదన్.

చ. జనకుని యిల్లు సొచ్చి మను ♦ జత్వనుచే విలచిల్లువిష్ణువిం
దనర వరుండుగాఁ గని ము ♦ దంబునఁ దత్పతిఁబొడఁ గానకుం
జనిబహుదైత్యసంఘములఁ ♦ జంపుచులంకఁ జొచ్చి యుద్ధశా
ననుఁ బరిమార్చి లోకభయ ♦ నాశము చేసిన సీతఁ గొల్చెదన్.

సీ. ఏగుణాబ్ధిచిత్త ♦ మెవ్వేళ శ్రీరామ
పదపయోరుహభక్తిఁ ♦ బరగుచుండు
ఏకళానిధికీర్తి ♦ యెల్లదిక్కులయందు
విశ్రమించి జగంబు ♦ వెల్లఁజేసె
ఏదయాపరుశాంతి ♦ యెన్నంగ సహజశ
త్వాదిద్వంద్వములనెల్లఁ ♦ దానుకూర్చు
ఏశిష్టదర్శనం ♦ బెల్లజంతువులకుఁ
బాపసంహారంబుఁ ♦ బాటిఁదోఁచు

సనఘుఁ డాతఁడు సర్వశా ♦ స్త్రార్థవేది,
సంస్కృతాంధ్రకవిత్వవి ♦ చక్షణుండు
కాశ్యపాన్వయవార్ధిరా ♦ కామృగాంకుఁ
డనఁగ లక్ష్మణగురువర్యుఁ ♦ డలరుచుండు. 3

చ. అకరుణాంబురాశికిఁ బ్రి ♦ యంబొనఁగూర్చుచునుండుఁ బత్నియై
లోకము మెచ్చఁగా నళిక ♦ లోచను బార్వతి ధాత వాణియున్
నాకపతిం బులోమజయు ♦ నాగశయానుని నబ్ధిజాతయున్
జేకొనురీతి నజ్జగతి ♦ సీతమె సీతయె సీతమాంబనాన్. 4

గీ. అమ్మహాత్ములకాత్మజు ♦ లగుచు వేంక
టార్యుఁడనఁగను నారసిం ♦ హార్యుఁడనఁగఁ
గృష్ణమాచార్యుఁ డనఁగను ♦ కీర్తిమూర్తు
లనఁగ వెలయుదు రార్యసే ♦ వార్హు లగుచు. 5

ఉ. వారలకగ్రజుండు నిజ ♦ వంశసుధాకలశాబ్ధిచంద్రుఁడా
నారమహాత్ముఁ డీతఁ డని ♦ సూర్యులు మెచ్చ సమస్తశాస్త్రదు
ర్వారసమర్థతాచణుఁడు ♦ రామకథామృతతత్పరుండు నీ
ధారుణి వేంకటార్యుఁ డొక ♦ దైవముగాక నరుండె చూడఁగన్ 6

వ. అప్పుణ్యమూర్తి కనుజుండనై నరసింహాభిధుండ నగు నేను నారాయణ సంకల్పానుగుణప్రకాశితంబులై స్థావరజంగమాత్మకంబులైన జగంబులం దొక్కింత ప్రత్యక్షం బైన భూలోకంబున జననాదివాహేష్టానుభవప్రాసాదారోహణాలంకారధారణాదిసుఖంబులను మరణరణజ్వరాదిరోగ

దారిద్ర్యాదిదుఃఖంబులను ననుభవించువారిం జూచి యై శ్వర్యచిత్తుండనై యన్నదధిక్షీరఘృతాద్యనుభవంబున సుస్నానగంధాదులచే నజ్వలితంబై, సుఖంబులఁ గోరుచు దుఃఖంబుల నిరసించుచు శీఘ్రితరకరచరణాద్యవయవంబై చరియించుచున్న దేహంబు ప్రాణవియోగానంతరంబున దహనపాత్రం బగుటం జూచి తదాత్మవియోగం బెట్టిది యో, తదీయాత్మ యెట్టిఫలంబనుభవించునో యెఱుంగమి భయాక్రాంతచిత్తుండనై గురూపదేశంబునను భాగవతాది పురాణకథాశ్రవణంబునను దెలియ నని గురుల నాశ్రయించుచుఁ దత్పురాణంబుల వినుచు వానివలనఁ బురాణ కథాశ్రవణంబును దన్నామస్మరణంబును దదాపాదకగ్రంథపఠనంబును దత్కథాపాదకగ్రంథకరణంబును భవభీతి హరణంబు లని తెలిసి తత్క్రమంబున శ్రీరామచంద్రపా దారవిందపూజాతత్పరుండనై భగవత్కథాప్రతిపాదకంబు గాఁ దులసీమాహాత్మ్యం బను గ్రంథంబు రచియింపం బూ నితి; తత్కథాక్రమం బెట్టనినఁ; బార్వతి తన పతివలన హ రిచరితంబులు వినుచు నమ్మహాత్మున కిట్లనియె. 7

ఉ. నాథ! భవత్ప్రసాదమున • నాగశయాను ని సచ్చరిత్రముల్
మానవునామమంత్రమహి•మంబఖిలంబును విటిఁ దత్సమా
రాధనకం బ్రధాన మను • రంగులసీదళమంటి; తత్ప్రభా
వాధికతత్వముం గనుద • మయ్యెడు నాకు నెఱుంగఁ జెప్పవే. 8

చ. అనవారుఁ డిట్లు పల్కె వన ♦ జానన తత్తులసీమహాత్వ్యమే
ఘనునకుఁ జెప్పఁగా నలవి ♦ గాదయిన న్వినుఁ నాదునేర్పుటం
పునవొక పూర్వవృత్తమతి ♦ పుణ్యతమంబుముదావహంబునై
తనరెడుదానిఁ జెప్పెదము ♦ దంబునఁ దేటపడంగనంతయున్ 9

వ. తద్వృత్తాంతంబున నీవడిగిన యర్థం బంతయుఁ దేటపడుం
గావున విను మని యిట్లనియె. 10

సీ. పారిసాద వ్రజక ♦ వాట రత్నద్వార
భాసురద్వారకా ♦ పట్టణమున
నాదినారాయణుం ♦ డఖిలలోకేశ్వరుం
డపరిమేయుఁడనంతుఁ ♦ డైనకృష్ణుఁ
డఖిలవిశ్వముఁ దన ♦ యాజ్ఞచే నడపుచుఁ
బదియాఱువేలగో ♦ పవనితలకు
భర్తయై యెనమండ్రు ♦ భవ్యకాంతామణుల్
పట్టపుదేవులై ♦ పరగుచుండఁ
గనకకుండలు మకరములు ♦ కంకణాది
భూషితుం డయి బుధజనుల్ ♦ పొగడుచుండ
సారసాక్షులు లీలవిం ♦ జామరములు
వీవ మణిమందిరంబున ♦ వెలయుచుండ. 11

ఉ. ఏమియు వారో విచిత్రమిది ♦ యెన్నఁడుఁ గానము పద్మబాంధవుం
డేమిటికో మహీస్థలికి ♦ సిద్ధసమృద్ధకరప్రకాశుఁడై
ధీమణివర్యులార చను ♦ దెంచెడుఁ జూచితిరే యటంచు వా
రామని చెంది చూడఁ జతు ♦ రాననపుత్రుఁడు వచ్చె భామినీ 12

సీ. తనమేనికాంతులు ♦ తనయశఃప్రభలతోఁ
కలసి నల్దిక్కులఁ ♦ గప్పుచుండఁ
దనజటాతతిరుచుల్ ♦ దనవీణహేమశం
తిచ్ఛాయలనుగూడి ♦ తేజరిలఁగఁ
దన బాహుదండముల్ ♦ దనవీణదండంబు
పగిది దీర్ఘంబులై ♦ పరగుచుండఁ
దనకంఠవధురనా ♦ దంబును దనవీణ
నాదంబు నేకమై ♦ మోదమొసఁగ
దేహమున నూర్ధ్వపుండ్రముల్ ♦ తేజరిల్లఁగఁ
దులసిసరులును గొప్పలా ♦ నలినబీజ
మాలికలు దాల్చి హరిభక్తి ♦ మగ్నుఁడగుచు
నలినలోచనుకడ నిల్చె ♦ నారదుండు. 13

చ. అచ్చెరుపాటుఁ జెంది వన ♦ జాక్షుఁడు దిగ్గున లేచి వానికిం
జెచ్చెర వందనం బొనరఁ ♦ జేసి మహోన్నతపీఠ మిచ్చి మీ
వచ్చుటచేఁ గృతార్థత య ♦ వశ్యముగ న్గెను దీర్ఘభద్రమే
యచ్చపుఁబ్రీతిఁ దెల్పుఁడ న ♦ యంబని వేఁడ మునీంద్రుఁ డిట్లనున్.

గీ. అంతయును నీదుకుక్షినే ♦ యమరియుండు
నీవ యంతట నుండువు ♦ నిక్కముగను
నీవెఱుంగవె సర్వంబు ♦ నీరజాక్ష
తఱచి యడుగుట మాపయి ♦ దయనుగాదె. 15

చ. అనిసురమౌని పల్కఁగ జ ♦ నార్దనుఁ డో మునినాథ నీమద
ర్శనము త్రికాలమంగళక ♦ రంబును బాపహరంబు మాపయిన్

# తులసీ మాహాత్మ్యము

దనరుభవత్కృపారసము♦నన్ దయచేసితి రయ్య మీకు వం
దన మొనరింతునంచు వసు♦ధాస్థలిఁ జాగిలి మ్రొక్కి లేచినన్

వ. అమ్మునివరుండు దనకటాక్షవీక్షణంబులఁ బునరుక్తత
నుప్రభుం డైనహరిం గనకాసనంబునఁ గూర్చుండ నియమించి
నం గూర్చుండె నయ్యిరువురు నన్యోన్యసల్లాపంబుల సంతుష్టాంత
రంగులై యుండ నారదుండును నిజవల్లకీనినాదంబును దన
కంఠనాదంబును నేకీభవించి మించ హరిస్వాంతంబున కనం
తామోదంబుగాఁ జేయఁ బాడి యచ్యుతుని నమందానంద
కందళితచిత్తుం జేసి తదనుజ్ఞాతుండై చనునెడ.

ఉ. ఆడుచు నొక్కచో నిలిచి♦యచ్యుతనామసుభక్తి మీఱఁగాఁ
బాడుచుఁ దత్ప్రభావమును♦భావమునం దలపోసి మెచ్చుచున్
వేడుకవీణ మీటుచును♦వింతగఁ జూచుచు నెమ్ముదిప్పుచున్
జేడియ లేగి చెప్పుముని♦చెచ్చెర భామగృహంబు కేఁగఁగన్

ఉ. ఆమునివర్యుఁ గాంచి విన♦యంబున సంతస మంది సత్యభా
మామణి యర్ఘ్యపాద్యవిధి♦మానితరీతిఁ బూజచేసి స
ద్ధేమమహోన్నతాసనము♦త్వర నిచ్చి వినమ్రగాత్రియై
నేమముతోడ మ్రొక్కి ముని♦నేత యుదీవన లిచ్చి యిట్లనన్

ఉ. భామరొ యేమిసువ్రతత♦పంబులు చేసితొ యేమినోములన్
నీమముతోడఁ జేసితివొ♦నీసిరి సంపద యెట్టిదానికిన్
నేమఱిఁ జూడలేదెచట♦నిక్కము నేఁ జొరరాని లోకముల్
సామజయాన లేకునికి♦సర్వము నారసి యెంచి చూచితిన్.

చ. అభినవరూపయౌవనము ♦ లంగనకుం గలవే? జాల దు
ర్లభములు రత్నహేమమణి ♦ రాజితభూషణముల్ లభించినన్
విభుఁడు మనోజ్ఞరూపగుణ ♦ విత్తకళాప్రవీణుఁడౌ దుర్లభం
బిభవరూపయుక్తులును ♦ నేమివిధేయుఁడుగాక యున్నెడన్
గీ. ఇన్నియును నీకుఁ గల్గె నీ ♦ వింతదాన
వనుచుఁ బొగడంగవలెనె ♦ యంబుజాక్షి
రుక్మిణికిఁ గల్గెనే నీవ ♦ రుండు నీకు
చాయ నెనఁబాయకుండు వి ♦ ధేయుఁ డగునె. 22

సీ. భాసురమణిరత్న ♦ బద్ధసౌధంబులు,
మణిహేమచిత్రిత ♦ మంటపములు
పద్మరాగచ్ఛాయఁ ♦ బరగువేదికలును,
వజ్రకవాటముల్ ♦ వసుగృహములు
పవడంపుగడపలు ♦ బహుభూషణంబులు,
రత్నాసనంబులు ♦ రాజ్యములును
బట్టుపుట్టంబులు ♦ బంధుజనంబులు,
దాసీజనంబులు ♦ ధాన్యములును
గనకవసనములాదిగాఁ ♦ గలసమస్త
వస్తుజాలంబులును గల్గి ♦ వశ్యుఁడైన
భర్తయును గల్గె నీతోడఁ ♦ బసఁ జెలంగ
సాటి యెవ్వరు గలరమ్మ ♦ సారసాక్షి. 23

వ. అనుచు నమ్ముని బహూకరింప సంతుష్టాంతరంగిణి యై
సత్యభామ యిట్లనియె. 24

చ. అనఘ భవత్కటాక్షమున • నన్నియుఁ గల్గెను నాకు సత్ప్రబో
ధనుఁడవు సర్వశాస్త్రపర • తత్త్వవిదుండవు గాన నీ వెఱుం
గనివియు లేవు సవ్రతము • గౌరవమొప్పఁగఁ జేయుబుద్ధినా
మానసమునఁ బుట్టెఁ దెల్పుమను • మానసముగా నొనరింతు వేడ్కతోన్

ఆ. వె. అనిన మౌని పల్కె • నమ్మానవతితోడ
వ్రతము లెందు దొడ్డ • వ్రతము గలదు
దాని నీవు సేయఁ • దగుదువు సేయుమీ
యదియె సిరుల కెల్ల • నాకరంబు. 26

వ. అది యెట్లంటేని. 27

సీ. తనపతి • తిభక్తిఁ • దల యంటి నుదుటను
దిలకంబు దిద్ది మౌ • క్తికకిరీట
ముఖబహుభూషణ • భూషితుఁగాఁ జేసి
పొంబట్టుపుట్టముల్ • పొసఁగఁ గట్టి
తాను స్నానము చేసి • తగినభూషణములు
ధరియించి పతికి వం • దనము చేసి
దోసిలి నిండఁగాఁ • బోసి రత్నంబులు
మూఁడుప్రదక్షిణ • ములను జేసి
పూజ్యుఁడైనట్టి యొకపుణ్య • భూసురునకు
దక్షిణ యొసంగి భర్తను • దానమిచ్చి
మరలి పతి యెత్తు ధన మిచ్చి • మగని గొనిన
నవని నిది యిష్టపతిసిద్ధి • యనువ్రతంబు. 28

వ. అనిన నద్దేవమునికి సత్యభామ యిట్లనియె. 29

క. శ్రోత్రియుఁడవు పరిజితష
ట్ఛాత్రవవైభవుఁడ వమల ♦ చారిత్రుఁడ వి
ద్ధాత్రిని నీదానమునకుఁ
బాత్రులు నీకన్నఁ గలరె ♦ భవ్యచరిత్రా. 30

గీ. కాన మీరు మమ్ముఁ ♦ గరుణించి యిద్దాన
మును ననుగ్రహించి ♦ కొనఁగవలయు
ననుచుఁ దరుణి వేఁడ ♦ నౌఁ గాక తెమ్మని
మునివరుండు పలుక ♦ మోదమునను. 31

సీ. అందెలు పాదంబు ♦ లందు మ్రోయఁగ హేమ
కాంచీమణులకాంతి ♦ కటిని మెఱయఁ
గమనీయరత్నకం ♦ కణములు మ్రోయుంగఁ
దడఁబడి జడముద్ద ♦ ముడి వడంగఁ
దనుమధ్య మొక్కింక ♦ తఱి బెణకుచు నుండఁ
జక్కనిహారముల్ ♦ చిక్కువడఁగఁ
దనమృదుపదములు ♦ తడఁబడుచుండంగఁ
బయ్యెద జారసం ♦ భ్రమముతోడ
ముఖమునను స్వేదబిందువుల్ ♦ మౌక్తికముల
పగిదిఁ దళుకొత్తఁ గన్నుల ♦ నగవు దోఁప
వనజనాభునికడ కేగి ♦ వారిజాక్షి
వినయమున మ్రొక్కి నిలుచున్న ♦ విభుఁడు చూచి. 32

గీ. ఇందువదనరో మేనెల్లఁ ♦ గందుచుండ
నిచటి కేతెంచుటకుఁ గత ♦ మేమి లావు
కార్య మొక్కటి తలఁచిన ♦ కరణిఁ దోఁచు
చున్న యది తెల్పు మన భామ ♦ యనుచు వచించె. 33

గీ. నాథ! మీచెట్టఁ బట్టిన ♦ నాఁటనుండి
కోరికలు నాకు సమకూరెఁ ♦ గోరినట్లు
మనవి యొక్కటి గలదయ్య ♦ మాన్యచరిత
చిత్తమున నుంచి యది విన్న ♦ సింపవలయు. 34

చ. సురమునివచ్చి ప్రేమనొక ♦ సువ్రతమానతియిచ్చె నాకు భా
సురముగ నావ్రతంబు నను ♦ సూదన సత్ఫలబుద్ధి గల్గె నా
దరమున నావ్రతంబు సఫ ♦ లంబుగ సాంగముగాఁగఁ జేయ వే
తరుణి తలంపుఁ దీర్పఁగవి ♦ ధాయక మాఁగద భర్త కెన్నిటన్ 35

వ. అనిన సత్యభామపలుకులకుఁ గృష్ణుం డిట్లనియె నార
దుండు సర్వశాస్త్రతత్త్వజ్ఞుండును త్రికాలవేదియుం గావున
నమ్మహాత్ముం డానతియిచ్చినవ్రతంబు నీకవశ్యకర్తవ్యంబు
దానికి లోపం బెద్దియుఁ గల్గింప దెల్పు మది సమకూర్చెద
ననిన సత్యభామ యిట్లనియె. 36

క. చతురాననాంగ సంభవుఁ
డతిమానముతోడఁ జెప్పె ♦ నార్తశరణ్య
పతిదానం బిమ్మని స
మ్మతిపడి దానికిని మీరు ♦ మన్నింపవలెన్. 37

సీ. అన విని హరి పల్కు ♦ నమ్మానవతితోడ
దానము నన్నియుఁ ♦ దలఁచినావె
చారువిలాసినీ ♦ సరససల్లాపసం
సక్తచిత్తుండను ♦ సకియ నేను
స్నానసంధ్యాద్యను ♦ ష్ఠానోపవాసంబు
లను జితేంద్రియుఁడైన ♦ ఘనుఁడతండు
పెద్దనామంబులఁ ♦ బెట్టించునో లేక
మెడనిండఁ బూసలఁ ♦ దొడుగు నేమొ
స్నానములు మాటిమాటికిఁ ♦ జేప్పమనునొ
ముక్కు బిగఁబట్టి ప్రాణాయా ♦ ముసేకుమండ
జపములను బెక్కువిధముల ♦ జరుపుమనునొ
దివ్యదేశంబులం జెల్లఁ ♦ దిరుగు మనునొ. 38

వ. అయినను నీతలంచిన కార్యంబు నిర్విఘ్నంబు గావున నియ్యకొంటి నీతలంపుఁ దీర్చెదమ్మని హరి సన్నద్ధుండైన సత్యభామ యిట్లనియె. 39

చ. అనఘచరిత్ర మీకరుణ ♦ నంతము లేనిధనంబు గల్గె నా
ఘనుఁడు సుదాముని ప్రితికి ♦ గన్మి సుదక్షిణమేను గొందునా
తనకి భవన్నమానముగ ♦ ద్రవ్యమొసంగి కృపాలలామనీ
మనమునన్నుండది యనుచు ♦ మానుము నమ్ముమురమ్మనె
[మిన్నతోన్. 40

ఆ. వె. అనుచు సత్యభామ ♦ హరితోడఁ జెప్పి య
భ్యంజనం బొనర్చి ♦ భాసురముగఁ

గనకభూషణాది ♦ కలితఁ జేసి
యున్నతాసనమున ♦ నుండఁజేసి. 41

క. తానును శుచియై మణిమయ
నానాభరణములఁ దాల్చి ♦ నవ్వుచు మదిలో
దానంబిచ్చెద రమ్మని
మౌనికి రత్నాసనంబు ♦ మగువ యొసంగెన్. 42

వ. అయ్యవసరంబున నయ్యిరువురు నన్యోన్యాభిముఖంబుగఁ గూర్చుండి హిమవదింద్రదనీలభూధరంబులకరణిం బ్రకాశించిరి. సత్యభామయుఁ దనవిభునిదోసిట రత్నంబులు వోసి ప్రదక్షిణత్రయం బాచరించి పుత్తడిపళ్లెరంబునఁ గనకకలశోదకంబుల నారదుపాదంబులఁ గడిగి బహుకనకరత్నమాణిక్యంబులు దక్షిణలొసంగి విభునిహస్తంబు నారదునిహస్తంబునం దునిచి జలంబులు విడిచినం బరిగ్రహించి నారదుండు సంతుష్టుండై నవ్వుచు నిట్లనియె. 43

ఆ. వె. నవతులింద బుండ ♦ నాస్యకేదక్షిణ
భాగ్యరాశియైన ♦ పరమపురుషు
వేదవిదులకైన ♦ విజ్ఞానులకునైన
నందరానివేల్పు ♦ నందఁగంటి. 44

క. పతిదానం బిమ్మట నీ
పతులిసనత్కీర్తిఁ బడయు ♦ పతివరో యిఁక నా

కలికాలం బాయును నా
మతి వచ్చినపగిదిఁ బోదు ♦ మాఘవ్రతోడన్. 45

చ. అనిమునిపల్కి యేమిదను ♦ జాంగలకపోదములెమ్మఁటన్న న
న్వనరుహలోచనుండు ముని ♦ వర్యునితోఁ జనుదేర నత్తపో
ధనుఁడును నైజపీఠ నగ ♦ ధారిభుజంబునుంచి యొక్కపీ
ఠినిజముదెంచె మాధవుసు ♦ ధీమణి సమ్మోదమం బుఁబల్కుచున్ 46

సీ. భామామనోజ్ఞమా ♦ డానుశేఁ గొనరమ్మ
రత్నభూషలొసంగి ♦ రమణులార
అనురూపరూపనా ♦ యకమణిఁ గొనరమ్మ
కనకరాసు లొసంగి ♦ కాంతలార
దానసంతానచిం ♦ తామణిఁ గొనరమ్మ
విబుధసామ్రాజ్యలొసంగి ♦ వెలఁదులార
వరగోపగోపికా ♦ వ్రజమణిఁ గొనరమ్మ
సిలువెత్తుధన మిచ్చి ♦ నెలఁతలార
సుందరుఁడు శుభసంపన్న ♦ మందిరుండు
దుర్లభుండయ్యు సులభుఁడై ♦ తోఁచినాఁడు
శ్రీనివాసు నాత్మీయుఁగాఁ ♦ జేసికొనఁగ
ధనము గలవారు రారమ్మ ♦ తరుణులార. 47

క. ధీరునిఁ గమనీయశుభా
కారునిలోకైకసౌఖ్య ♦ కారుని జగధా

ధారుని దరుణీజనశ్రేణిం
గారుని సరిధనము లిచ్చు ♦ కామిని కిత్తున్. 48

శా. కృష్ణుండీతఁడు వీనిఁ గొన్నసతి స ♦ త్కీర్తిం గనున్ లోకవ
ర్తిష్ణుం డీతఁడు వీనిఁ గొన్నసతి సు ♦ శ్రేయస్థితిం జెందు భ్రా
జిష్ణుం డీతఁడు వీనిఁ గొన్నసతి భా ♦ సిల్లుం గళాధామయై
విష్ణుం జిష్ణుని గృష్ణునిత్తు సరిగా ♦ విత్తంబు నాకిచ్చినన్. 49

క. హారిగలచోటున విడువక
సిరి యుండు నటంచు బుధులు ♦ చెప్పఁగ వినరే
హారిమధ్యలార మీరీ
హరియెత్తుధనం బొసంగి ♦ హరినిం గొనరే. 50

గీ. అనుచు నింటింటఁ దిరుగంగ ♦ హరియుఁ దాను
దిరుగు మునివెంట భక్తి వి ♦ ధేయుఁ డగుట
దానమిచ్చిన సద్మనఁ ♦ దగుకొనంచు
బద్ధుఁడయ్యెను గృష్ణుండు ♦ పద్మనయన. 51

ఉ. అప్పుడె గాంతలెల్లరుమ ♦ హాయతసౌధము లెక్కి నారదుం
డెప్పుడు వచ్చె నీవ్రతము ♦ నేటికిఁ జెప్పెను సత్యభామయే
చొప్పునఁ జెచ్చె మౌనినధు ♦ సూదనునమ్మెదనంచుఁ ద్రిప్పగా
జొప్పడ నేల కృష్ణుఁ డిది ♦ చోద్యమటంచును జూచిరయ్యెడన్. 52

వ. అయ్యవసరంబున సత్యభామ నిజసఖీజనంబులవలన నార
దునిం బిలిపించి యిట్లనియె. 53

ఉ. చాలుయతీంద్రమౌళిభుని ♦ సాటిలతాంగలునవ్వుచుండనీ
లీలను వీథివీథులఁ జ ♦ రింపుచు నమ్మెద నంచుఁ ద్రిప్పగా
మేలె ధనంబునాకడను ♦ మిక్కిలిమూల్గుటమీ రెఱుంగరే
తాలిమిమాలివాఖ్యటుల ♦ తండటఁ బెట్టుటమీకు న్యాయమే 54

క. నతిత మానుచుఁ దలిపి నను స
మ్మతిపడఁగాఁ జేసి కపట ♦ మార్గమునను నా
పతిదానముఁ గొని తుదకీ
గతి నన్నవమానపఱుపఁ ♦ దగునె మునీంద్రా. 55

ఆ. వె. తపసివయ్యు నాత ♦ తాయివై యవరోధ
జనము రచ్చఁ బెట్టఁ ♦ జనునటయ్య
వేడుకకును బిల్చి ♦ వెక్కిరించుట నీకుఁ
దగునటయ్య పెద్ద ♦ తన మటయ్య. 56

చ. వరసతి నైననాకు సరి ♦ వారలలోఁ దలవంపు లయ్యె నీ
చరితమెఱింగి నీపలుకు ♦ సత్యమటంచును నమ్మి చాలఁ దాం
దరపడి ప్రాణనాథునిటు ♦ తెప్పఁ దలఁపక ధారవోసితిన్
హరిహరి! మేఁక వన్నె పులి ♦ వైతెపి దేమిటికయ్య నారదా 57

ఆ. వె. అసిన మాసి వల్కు ♦ నలుక నీకేటికి
విభుఁడు వలసెనేని ♦ వీఁ డొత్తు
ధన మొసంగి నాకుఁ ♦ దరుణికో కొనుమమ్మ
నీకె యిచ్చువాఁడ ♦ నిక్కముగను. 58

కం. అని యిట్లు మాని పల్కఁగ
ఘనతరుఁ దెప్పించి యొక్క ◆ కడఁ దనవిభునిం
గనకములు మణులు రత్నము
లును దూఁపనొక దెసను జోసి ◆ లోపం బైనన్. 59

కం. తన మందిరమునఁ దనరెడు
ధన మెల్లను దెచ్చి వైవ ◆ దానికి సరిగాఁ
దనవిభుఁడు తూఁగకున్నను
విను హాసమున సత్యభామ ◆ విస్మయపడియెన్. 60

శా. సత్రాజిత్తనయామతల్లి కాఖ్యమునశి ప్రా ◆ జాంబూనదస్వర్ణమున్
గాత్రశ్రీ ప్రేమ పొసంగ రాజానదియుం ◆ భోజాక్షి తెప్పించి యా
పత్రార్థంబును వైచె వైచినను దా ◆ పెచ్చైనయుం డుండ నీ
చిత్రంబౌ మనసత్యభామమది రోఁ ◆ జింతించి శోకించఁగన్. 61

మ. పతితో నిందిరపురంబు నారదుఁ జనినం ◆ బాగారిసద్భక్తిం దం
పతులం జూడఁగ నాయమ ప్పిరన్నమునశి హిం ◆ మనస్తోషమున్నించి యిక్
సతికిన్ శ్రీ తిరుపొసంగె యిమ్మహాహరి ◆ సర్వంబుఁ దెప్పించి యా
సతి వైవన్ సరి తూఁగకుండె నగజా ◆ సంపూర్ణచంద్రాననా

మత్తకోకిల.

ధర్మసూనుఁడు రాజసూయము ◆ దారబుద్ధిని జల్పు నట్
ధర్మమూర్తిగఁ గృష్ణమూర్తికి ◆ దలిచి యిచ్చె ననంతమౌ
ధర్మరాశిని గృష్ణుఁ డంతయు ◆ భామకిచ్చెను ప్రేమ నా
ధర్మ మంతయు వైచినం బతి ◆ భారమైకొనుపట్టినన్. 63

గంధసూత్రైకశ్లేషమై ♦ కరము లెత్తి
మొక్కి రుక్మిణి దీవించి ♦ ముదితఁ గోడ. 72

శా. ఏరా నిన్నడఁబాసి కృష్ణుఁ డెటకే ♦ నేతెంచెనో నీపయిం
బ్రేమం జూపక యుండెనో నిజమనో ♦ భీష్మంబులం దీర్పఁడో
భామా భూషణరిక్తవేషవయసం ♦ భ్రాంతిం బ్రచింతింపఁగా
నేమో చెప్పుమటన్న నిట్లనియెఁ ♦ యయ్యోషాక్షి దీనాస్యయై.

ఉ. అక్కరో వచ్చి చెప్పెఁ జతు♦రాననపుత్రుఁడు నేను వేఁడగా
నొక్కమహావ్రతం బిది మ♦హోన్నతభూషకరంబటంచు నే
మక్కువ నావ్రతంబు సుర♦మౌనికతంబునఁ జేయుచుండఁగా
నొక్కకొ అంత వృద్ధుఁ గరు ♦ ణోదధి నీవదితీర్పఁగాంవలెన్

వ. అది యెట్లన్నఁ దనవిభుని సర్వభూషణభూషితుం
జేసి భూసురునకు దాన మిచ్చి మగుడ నవ్విభు నెత్తుధనం
బొసంగి తనవిభునిం గొనవలయు నీవ్రతంబు సేసినసతి సక
లసామ్రాజ్యలక్ష్మీవిధవైశ్వర్యంబులు గలిగి రూపయౌ
వనసంపత్పూర్ణయై విధేయుం డగుభర్తతో సుఖం
బుండు నని యానతిచ్చిన నట్ల సేయుదు నని మనకంద
ఱకు నాఫలంబు సిద్ధింపఁ గోరి నారదునకు మనవిభుని దాన
మిడి వానియెత్తుధనం బిచ్చుటకు నాధనంబున నున్న
ధనంబంతయు వైచి చాలకున్న నాయాభరణంబులు వైచి
నం జాలకపోయె. ఎల్లవారిధనంబులు దెప్పించి వైచినం
జాలదయ్యెం గావున నీవు పట్టంపుదేవివియు నగ్రమహిషి
వియు మాకందఱకుఁ బూజ్యవుం గావున నీధనంబు తృణం

దైన నందుఁ గలసినఁ దూఁగి మనవిభుండు మఱకు సిద్ధిం
చు నని సత్యభామ చెప్పిన రుక్మిణి యిట్లనియె.

ఉ. వింటిరె కాంత లెల్లరిది ♦ వింతగ నున్నది సత్యభామ కే
గంటికిఁ గానరాను సరె ♦ కాంచెనె యాతనితల్లిదండ్రులన్
గంటికి ఱెప్పమాడ్కి బహు ♦ కౌతుక మొప్పఁగఁ బెంచు (వారి; మా
వంటి చెలుల్ మనోహరుఁడు ♦ వశ్యుఁడటంచును దానమిచ్చినన్
మింటనుమంట మేఁనుచు ♦ మెత్తురె దీనివచించి చెప్పరే. 76

చ. తగుదురుదానమీయఁదలి ♦ దండ్రులుఁ, బట్టపుదేవియైనఁదాఁ
దగుదునటంచు భామ సరి ♦ దానమొసంగెను, దేవమౌనియే
పగిదిని బట్టె శాస్త్రములు ♦ పారఁగఁ జూచినవాఁడనంచు నీ
జగములనెల్లఁ జెప్పఁదన ♦ శాస్త్రము లేమొకొ నేఁడు తప్పినన్. 77

ఆ. వె. తనకు భామపైని ♦ దరగని మోహంబు
గలిగెనేని దనకుఁ ♦ గలధనంబు
లీయరాదొ దాన ♦ మిచ్చినదానికిఁ
దగుదు ననఁగ హరికిఁ ♦ దగునె చెపుమా! 78

క. సురముని వ్రతములు సెప్పినఁ
దురతురఁదా దానమీయ ♦ దొరికె నటంచున్
త్వర ముని దానము పట్టుట
హరి తగుదు ననుటయు వినిన ♦ నార్యులు నగరే. 79

క. అనురాగంబున వలచిన
వనితలు తన్నొకరికీయ ♦ వల్లే యనరే

కనికరమునఁ జెప్పరుగా
కనుదినమొకయూరఁ గట్టె ♦ లమ్ముఁగురారే. 80

చ. విభుఁడెటనేని నున్నఁ బది ♦ వేలదిమాకును, నేఁటిదాఁక భా
మభవనవాసుఁడయ్యెఁ గ ♦ మానిమరంబు ననుంచుగాక యీ
రభసము లేల మాకు ధన ♦ రాసులు లేవని తానెఱుంగు మే
లుభళి మనోహరున్ మునివ ♦ రున్ గొనిపొమ్మనుఁ డిచ్చ
(నంతసిల్లన్ 81

ఆ. వె. పెండ్లినాఁడు మేనఁ ♦ బెట్టినసొమ్ముల
కంటె నొక్కపిన్న ♦ కాసుగాని
యెవరిసొమ్ము లేము ♦ యెఱుఁగను నారమం
డెఱుఁగఁడేమి భామ ♦ యెఱుఁగకున్న. 82

ఆ. వె. ఐన నాకుఁ గలుగు ♦ నంత దెచ్చెద నీవు
చనుము వెనుక ననుచుఁ ♦ జనవు మీఱఁ
బలుక భామ మాఱు ♦ వలుకక చనుదెంచె
జవము మీఱ నాత్మ ♦ భవనమునకు. 83

ఉ. అంతట నప్పుడర్భవసు ♦ ధాధిపనందన స్నాన మాడి య
త్యంతమనోజ్ఞభూషణము ♦ లందముగా ధరియించి మోమునన్
వింతఁగ బొట్టుదిద్దియొక ♦ వింతదుకూలముఁ గట్టి మందిరా
భ్యంతరవాటికన్ దులసి ♦ పజ్జకునేగి సమగ్రభక్తితోన్. 84

ఆ. వె. తరువులెల్ల వెంటఁ ♦ దగిలి తిరుగఁగఁ బ్ర
దక్షిణత్రయంబుఁ ♦ దనరఁజేసి

పరిణతిఁ జేసి చాలఁ ♦ బ్రార్థించి విభునకుఁ
దగునటంచు నొక్క ♦ దళముఁ గోసె. 85

క. ఆదళము పళ్లెరంబున
సాదరమున నునిచికొని వి ♦ శాలాక్షులతో
వేదండయాన చనియె ర
ష్ట్రాదేవి యనఁగ భామ ♦ మందిరమునకున్. 86

క. ఆమందిరమున నొక్కెడ
సోమోపలరచిత చిత్ర ♦ శోభిత మగున
ద్దేవ మహామణిమంటప
సీమకు నతిభక్తితోడఁ ♦ జేరఁగ నరిగెన్. 87

చ. చనియటఁ గాంచి యారమణి ♦ సారసలోచన శత్రుమోచనుఁ
ఘనుఁడగు నారదున్ గలహ ♦ కర్మవిశారదు భక్తితోడ వం
దన మొనరించినం గడుము ♦ దంబున దీవనలిచ్చి దేవతా
మునివరుఁ డిట్లు పల్కెఁ దన ♦ మోమున హాసము దోఁచు
(చుండఁగన్ 88

సీ. వినవమ్మ రుక్మిణి ♦ విభుని దానమొసంగె
సాహసంబున నాకు ♦ సత్యభామ
తిరుగ నాతనితోడ ♦ సరిధనం బిచ్చి త
ద్విభుఁ గొన నాత్మమం ♦ దిరమునఁ గల
ధనమెల్లఁ జాలక ♦ తనబంధుమిత్రాది
ధనము లెల్లను వైచి ♦ తగకయున్నఁ

దనయింట నెప్పుడుఁ ♦ దనరుభూషణములు
వైచి పెంచుక ♦ వాసితగ్గఁ
గాన నీధన మించుక ♦ కలిసెనేని
వనజలోచనుతో సరి ♦ వచ్చునునుఁ
దలఁచియున్నది కృష్ణుండు ♦ వలసెనేని
తరుణి కొనవమ్ము భామ మ ♦ దంబు నొంద. 89

చ. అననిటువల్కి రుక్మిణి మ ♦ హాత్మకమా కుధనంబు లెట్లు గ
ల్గెను వనజాక్షుఁడెప్పుడును ♦ కించుక భామకుఁదక్కనన్యభా
మినికి నొసంగనే ధనస ♦ మృద్ధులు గల్గినవారు దీర్ఘనో
పనపనిదీర్ఘమానసుల ♦ భంబగు లెట్లుము నీంద్ర తెల్పవే. 90

ఆ. వె. విభుఁడు విడుపరాని ♦ విత్తంబు దలపోయ
విభుఁడు సవతు లేని ♦ విలువనొమ్మ
భక్తి గాక ప్రాణ ♦ భర్తను గొనుపాటి
వస్తువేది కలదు ♦ వసుధలోన. 91

ఆ. వె. విభుని వేఁడునోము ♦ విభవవిస్తారంబు
మగనితోడినోము ♦ మంగళంబు
భర్త నెనసి యుంట ♦ భామకు భాగ్యంబు
హృదయనాథు నిచ్చు ♦ టేటివ్రతము? 92

ఆ. వె. అన దివ్యమౌని ♦ యామ్రానవతిఁ జూచి
భామ నాకొసంగెఁ ♦ బరమపురుషు
బలిమి గొనఁగ లేము ♦ పలుకులఁ బనిలేదు
విభుఁడు వలసెనేని ♦ విత్త మిమ్ము. 93

వ. అనుటయు సురమునిం జూచి రుక్మిణీదేవి యిట్లనియె. 94

చ. మునివర యేమినేరరతి ♦ ముగ్ధతనుండ మమ్ము మాయచేసిమున్
విననివ్రతంబుఁ దెల్పి పృథ్వి ♦ పతిఁ దోడ్కొని పోదునంచు నీ
మనమున నెంచితే మొయిఁక ♦ మామొగుడంగొనసాగ దయ్య [యీ
వనజదళాక్షుతోఁడు మికు ♦ వచ్చెడు వస్తువుఁ దెచ్చితి జూమీ. 95

వ. అని కృష్ణమూర్తికిఁ బ్రదక్షిణత్రయం బాచరించి ప్రణామిల్లి సాంజలియై దేవా పురాణపురుషోత్తమా, వేదాంతవేద్యా, దీనజనావనచణా, అఖిలజగదాధారా, అఖిలాండకోటిబ్రహ్మాండనాయకా నీప్రభావం బెఱిఁగి తెలియ నశక్యంబు నీవు జగత్కారణుండవు చరాచరజగన్మాత్మకంబు లై లోకంబులు సత్త్వరజస్తమోరూపుండ వైననీవలనం బుట్టి పెంపుమిగిలి విలయంబు నొందు. భవదీయమాయామోహితు లైన చేతనులు నిన్నుం గానలేక యహంమమతాభిమానంబులకు లోనై యుండుదురు. నీవు నిర్వికారుండవు నిర్గుణుండవు నిష్కళంకుండవు నిస్సంగుండవు నిరంజనుండవు. భవదీయపాదారవిందాసక్తభక్తిం దేలినమహాత్ములు యుష్మదనుగ్రహసంపాదిత జ్ఞానచంద్రికానిరస్తసమస్తభవాంధతమస్కు లగుచు నిన్నుం గాంతురు. బ్రహ్మాదిచరాచరసాగరగిరినదీవనయుక్తసమస్త లోకంబులుం గుక్షినిక్షిప్తంబు లై యున్ననీకు నశ్వరస్వరూపంబు

లైనకాంచనమణిరత్నాదిహేయపదార్థంబులు సమానంబు
లగునే. నీకటాక్షంబు గలిగెనేని దృఢంబైన మహామే
రువున కగ్గలంబగుం గావున మమ్ముం గృపసేయు మని
ప్రార్థించి యతులాగతం బైనద్రవ్యం బంతయుం దీసివైచి
పతిం దలంచుచుం బుత్తడిపళ్ళెరంబుతోడి నవ్యతులసీదళం
బును దులయం దుంచిన దానితో నయ్యనంతుండు సమం
బుగాఁ దూఁగినం జూచి యానందించి నారదుండు మహా
ప్రసాదం బని యతులసీదళంబుం బరిగ్రహించి నేత్రం
బుల కద్దుకొని శిరంబున ధరించుకొని భక్తిపారవశ్యంబునఁ
దన్నామంబులం బాడుచు నటనంబులు సలుపుచు ధన్యుం
డనైతి నని యుల్లసిల్లె. 96

చ. ధనమతివి స్త్రీగఁబుగము ♦ దంబున భామయొసంగ గౌరవం
బునఁ గనుపట్టె; రుక్మిణివి ♦ భుండుకృష్ణమునుం జూచి గౌరవిం
చిన నిదె చాలునంచుఁ దుల ♦ సీదళ మొక్కటివైవ లాఘవం
బునఁ గనుపట్టె శౌరి; ధన ♦ మూలము లాగురుతాలఘుత్వముల్

ఉ. మెట్టులరీతి ద్రవ్యమున ♦ మిక్కిలి భామ యొసంగ దానికిన్
ఱెట్టిగ వ్రేలఁగల్గినయ ♦ గిందము నిన్ దులసీదళంబుతో
మట్టముగాఁగఁ జేసితివి ♦ మానిని శౌరిమనంబు నీవయిం
బట్టెనుగాని యన్యులకుఁ ♦ బట్టెనె యంతటిభాగ్య మిందిరా.

వ. అని మఱియు సత్యభామ గనుంగొని నాయనుమతి మహా
వ్రతంబు సలిపితివి. నీపుణ్యవశంబున నది సాంగం బయ్యెఁ

గావున నీవును, రుక్మిణియు సకలసౌభాగ్యసమృద్ధిం గాం తురుగాక యని యాశీర్వదించిన సత్యభామ యవనతవద నయై ప్రాణేశ్వరునకు నమస్కరించి రుక్మిణిం గౌఁగిలించు కొని యిట్లనియె. 99

క. పరమేశ్వరుండు పతిగాఁ
బరమేశ్వరి సవతినైన ♦ భాగ్యముఁ గనియుం
గరువంబుఁ జెంది యీగతి
పరిహాసంబులకుఁ బాలు ♦ పడితిని దుదకున్. 100

ఉ. అక్కరొ నేనె నీసవతు ♦ లందఱిలోనఁ బ్రధానమంచుఁ బెం
పెక్కిన దానసంచు భ్రమి ♦ యుంటిఁ గన్నులఁ గాననైతి నీ
చక్కనిశీలమున్ సుగుణ ♦ సంపదయున్; నను నాదరించి నా
తక్కినచేఁతలన్ హృదిఁ ♦ దప్పు క్షమింపఁగదమ్మ మ్రొక్కెదన్

గీ. ఎవఁడు సర్వప్రదాతయౌ ♦ నీశ్వరుఁడొ
తలఁప కాదివ్యమూర్తినే ♦ ధ్యానవిడిచి
యభిమతార్థంబులను జెంద ♦ నాసపడితి
నిట్టు లగునంచు నెంచాఁక ♦ నెఱుఁగనైతి. 102

గీ. అనిన రుక్మిణి యాభామ ♦ ననునయించి
పతి లభించెను సువ్రత ♦ ఫలము దక్కె
దివ్యమౌనీంద్రు నానతిఁ ♦ దీర్చుటయ్యెఁ
జెల్లెలా యింకనీవు చిం ♦ తిల్లనేల? 103

గీ. సాధురక్షణదీక్షాస • నాథుని నిఁక
దరుణి నా నాథుఁ డనుకొంట • దప్పుగాదు
సర్వసముఁడైనయీయదు • చంద్రమూర్తి
నాకసంగ నేమిటికి జగ • న్నాథుఁ డమ్మ 104

వ. అని సత్యం దేర్చి తోడ్కొనిపోయి భగవానుం డగువిభు
నకుఁ బ్రదక్షిణనమస్కారంబులం గావించి నిలుచుటయు
నారదుం డానందపులకాంకితవిగ్రహుండై రుక్మిణీసత్యల
స్వభావపరిశీలనముం గావించుటకై శ్రీకృష్ణుం డొనరించిన
యుపాయంబునకు మెచ్చుకొనుచు నాదేవదేవుని పరమా
ద్భుతదివ్యలీలల మనంబున భావించుచు భక్తిపారవశ్యం
బున నిట్లని స్తుతియింపం దొడంగె. 105

దండకము—శ్రీమన్మహేంద్రాదిబృందారకానందసంధాయకా
శత్రుదైత్యార్తి సంధాయకా భక్తరక్షానుసంధాయకా
మానిరాణ్మనసాంభోజవాసా యహో శ్రీనివాసా లసత్పీత
వాసా త్రిలోకీవికాసా కృతస్వాశ్రితాపన్నిరాసా జగ
ద్వాస పద్మామనోల్లాసకృద్దివ్యవేషా సదాసత్యభాషా
యహో లోకరక్షావనీషా సువేషా విదోషా సదాశేష
లక్ష్మీముఖాంభోజలోలా సమద్భక్తపాలాపరిక్లిన్నభూతాను
కంపావిశాలా నవల్లోకపాలా శరచ్చంద్రఫాలా సురా
రాతికాలా యహో నందగోపాలబాలా రమామానసాం
భోజభృంగా గరుత్మత్తురంగా హృతారాతిజీవా యహో
కృష్ణదేవా కృపం జూడు మున్ బ్రహ్మదేవుండు మీయాజ్ఞ

వేదంబులం బట్టియన్నింటిఁ బుట్టించుచో సోమకాఖ్యాసురుం
డుగ్రతన్ వేదముల్ దెచ్చి వే నీటిలో మాటుగా నుండఁ
గా మత్స్యరూపంబునన్ వాని గిలించి వేదంబులన్ వేధ
కర్పించి మోదంబు నొందించి తీవే గదా సుందరాకార
బృందారకుల్ మందులై మందరాగంబుచే నంబుధిన్ దరి
చ్చుచోఁ దన్నగేంద్రంబు నంభోధిలో మున్గఁగాఁ గూర్మ
రూపంబునన్ మూపునం దాల్చి పైఁ దేల్చి వారిం గృపం
జూచి రక్షించి తీవే గదా మున్ హిరణ్యాక్షుఁ డీభూమిఁ
జుట్టగాఁ జుట్టి కొంపోవ నా జెట్టిపై బిట్టు గోపంబునం బోత్రివై
ముట్టితోఁ గొట్టి లోకంబులం బ్రోచి తీవే గదా సామి
యుష్మత్పదాంభోజచింతాపరుం డైన ప్రహ్లాదునిం దండ్రి
నిందించి విష్ణునిం జూపు మంచుగ్రుఁడై స్తంభమున్
గాలితోఁ దన్నఁగా నారసింహస్వరూపంబునన్ వానికుక్షిన్
నఖాగ్రంబులం జీరి రక్తంబు పైఁ జల్లుచుం బ్రేవులం గ్రొ
వ్వుగా వైచి ప్రహ్లాదునాహ్లాదునిం జేసి తీవే గదా స్వర్గలో
కాధిపత్యాప్తికై యజ్ఞముల్ ప్రాజ్ఞతం జేయుచోఁ జిత్ర
మౌ ఛత్రముం దాల్చి తీరైన నర్ఘాంకరం బొప్పఁగాఁ బట్టి
యుజ్ఞానదం బైన యజ్ఞోపవీతంబునుం దాల్చి మున్వామనా
కారివై శిక్ష కర్హుండు గాఁడంచు భిక్షుండవై యాబలిం
బట్టి శిక్షించి దేవేంద్రు రక్షించి తీవే గదా కార్తవీర్యార్జునుం
డార్జవం బేమియున్ లేక ధర్మంబు వర్జించి పాపంబు లా

ర్జించుచున్ దుర్జనుండై సురానీకముం బట్టి తర్జించుచున్
బాహుసాహసప్రసంరంభణోజ్జృంభమాణప్రతాపంబునన్
సాధులన్ బాధ నొందింపఁగా వజ్రధారాకఠోరోగ్రదివ్య
త్కుఠారంబునన్ వాని బాహాసహస్రంబు ఖండించి నిర్జి
వునిం జేసి పల్మాలు నతనిప్రశాసమ్ముగా నీక్షితిం జేసి తీవే
గదా పంక్తికంఠుండు దుస్స్వాంతుఁడై తాఁ దపోనిష్ఠచే నా
సురజ్యేష్ఠు మెప్పించి భద్రాకరంబౌ వరానీక మార్జించి
ధర్మంబు వర్జించి పాపం బుపార్జించుచున్ దేవతాకాంతలం
బట్టి బంధించుచున్ మానులం దిట్టుచున్ సిద్ధులన్ బద్ధులన్
జేయుచున్ యక్షులం గొట్టి శిక్షించుచున్ సాధులం బట్టి
బాధించుచున్ యజ్ఞముల్ భగ్నముల్ సేయుచున్ హో
మకుండంబులన్ జెప్పుచున్ దుర్జయుండై చరింపంగ ము
ల్లోకముల్ చాలఁగా లోలతం దల్లడిల్లంగ నల్లోకరక్షార్థమై
నాఁడయోధ్యాపురిం బ్రీతిఁ గౌసల్యకుం బుత్రరత్నంబవై
కౌశికుం జేరి నీపాదసంస్పర్శచే ఱాతిని న్నాతిగాఁ జేసి
యాతాటకం గీటణంగించి మోదంబునన్ భర్గచాపంబు
భగ్నంబు గావించి భూపుత్రిఁ జేపట్టి పిత్రాజ్ఞను లక్ష్మణ్రా
స్వామి వెన్వెంటరా సీతతో దండకారణ్యసంవాసివై యం
దు వర్తించుచున్ దుష్టులౌ దైత్యులం జంపి మాయావియై
పంక్తికంఠుండు సీతామహాదేవిఁ గా లంకకుం జేర్పఁగాఁ
బుత్రమిత్రాదివర్గంబుతో వాని నిర్జించి వైదేహిం దెచ్చి

పట్టాభిషిక్తుండ వైనట్టి శ్రీరామచంద్రుండ వీవేగదా యివ్వ
ీక రంస సుప్రక్రియా కీర్ణయె పూర్ణ ఘోషంబుతో బ్రహ్మవజ్రాద్యాది
దేవాళితో నీమహిం జేసి యాక్షీరవారాశినిం జేరి ప్రార్థిం
పంగా మున్నుబం గొట్టి సద్ధర్మసంస్థాపనార్థంబుగా రోహిణే
యుండునా రోహిణీపుత్రరత్నంబవై కృష్ణదేవుండునా దే
వకీపుత్రరత్నంబవై కంసహంసాదిదుర్మార్గులం జంపి యీ
రీతిగా నస్మదాదిప్రపంచంబు రక్షించుచున్నట్టి యాశ్రీని
వాసుండ వీవేగదా నీపరిభావంబువర్ణింప నేనెంత యల్ప
జ్ఞుండన్ దేవదేవా నమో రుక్మిణీప్రాణనాథా నమస్తే
నమస్తే నమస్తే నమః 106

వ. అని యిట్లు కృష్ణుని బ్రశంసించి నారదుండు వియన్మార్గం
బునం జనియె నిట్లనంతంబులైన మణికాంచనాదిపదార్థం
బులకుం దూఁగక సకలబరిహాసంశంబులు రక్షింగలకృష్ణు
నితో సమానంబుగాఁ దూఁగుటం జేసి యీతులసీమాహా
త్మ్యంబు నీమనంబున నెఱుంగుమని చెప్పి శివుండు పార్వ
తికి మఱియు నిట్లనియె. 107

క. తులసీకానన మెచ్చట
విలసితమై యుండునచట♦విలసన్మఖుఁడై
జలధిరమాసహచరుఁడై
విలసిల్లుచునుండు శౌరి♦వేల్పులు గొల్వన్. 108

క. విను మెవనిమందిరాంగణ
మునఁ దులసీకాననంబు♦పూజితమగు నా

ఘనునిలయంబున నెప్పుడు
వనజాక్షుఁడు లక్ష్మితోడ ♦ వసియించుఁజుమీ 109

మ. తులసీకానన మంబుపూరముగఁ జా ♦ తుర్యంబుచే దోహదం
బుల భాసిల్లఁగఁజేసి యాదరమునం ♦ బూజించు నారాయణా
ఖ్యుల నెవ్వండతఁడన్ వచింపఁగను నా ♦ కుం జెల్లదప్పాఖ్యునిం
దలఁపం జూడ ముదంబు నొందిరఘనుల్ ♦ తథ్యంబుగా
(ముక్తులే. 110

క. హరివాసరమునఁ దులసికి
నరయుఁగ నొకకలశజలము ♦ లర్పించిన యా
నరునకుఁ బరమపదం బనఁ
గరగత మగునట్టిసిమ్మ ♦ కాదుయె కాదే. 111

క. అనుదినము నెవరు తులసీ
వనము నిరీక్షింతు రట్టి ♦ వారల నెపుడున్
గన నాశించును పఘములు
విను ముజ్జ్వలదగ్నిమశక ♦ వితతులభంగిన్. 112

క. తులసీకానన మేసతి
విలసితముగఁ జేసి దినము ♦ విశ్వాసమునన్
జల మొక్కకలశ మిడినను
దులదూఁగుచు నుండు సంత ♦ తుల విభవములన్. 113

సీ. లలన! కార్తికపుశు ♦ క్లద్వాదశిని రాత్రి
స్వార్హకృత్యము లెల్లఁ ♦ జలిపి తులసి

బృందముచుట్టు నం ♦ ప్రీతితో నలికి స
రంగవల్లులచే న ♦ లంకరించి
దీపావళులు చుట్టుఁ ♦ దేజరిల్లఁగఁ జేసి
లక్ష్మీజనార్దను ♦ లను సమాగ్రి
భక్తిఁ బూజ లొనర్చి ♦ బ్రాహ్మణోత్తములను
భోజనంబులను దృ ♦ ప్తులుగఁ జేసి
తనదుశక్తికొలఁది ♦ దక్షిణతాంబూల
ములనొసంగినట్టి ♦ ఘన్యమూర్తి
సకలవిభవములను ♦ సంతుష్టుఁడై తుది
ముక్తుఁడగును దివిజ ♦ మునులు పొగడ. 114

వ. ఇట్లు శంభుండు సెప్పినతులసీమాహాత్మ్యంబునకు విస్మయపడి యామ్యవిధంబు లెల్లవేళలఁ దలపోయుచు గౌరి కైలాసంబున సుఖంబుండె నాఁటియును. 115

సీ. శ్రీకరంబుగఁ దుల ♦ సీదళమాహాత్మ్య
మతిభక్తి వినఁగ వా ♦ రుఁగఁబతాప
ధనధాన్యవిభవసం ♦ తతులు సంధిల్లును
బాపసంఘము లెల్ల ♦ భస్మమగును
రోగార్తులైన ని ♦ రోగతఁ గాంతురు
పుత్రిలఁ గాంతుర ♦ పుత్రులైన
దూరబంధునకు బా ♦ ధు సమాగమంబబ్బు
నాపద లేవియు ♦ నంటకుండు

భయము లేకుండును నచ్యుతు ♦ భక్తి కలుగు
శుభములను గాంచి దుష్క్రియా ♦ శూన్యుఁడగుచు
మోక్షమును గాంచుఁ దుదిని మా ♦ ముక్షు నగుచుఁ
గమలలోచనుసంపూర్ణ ♦ కరుణచేత. 116

క. తులసీదళమాహాత్మ్యం
బలఘుమతిం బఠనసేయు ♦ నప్పాఖ్యానన్
దొలఁగు విపత్తతి తనకుదిఁ
గలకోరుకు లొందవు శౌరి ♦ కారుణ్యమునన్. 118

మాలిని. రఘుకులమణిదీపా ♦ రమ్యదివ్యస్వరూపా
పరిహృతసురతాపా ♦ పాపరక్షఃప్రకోపా
సకలభువనవాసా ♦ స్వాశ్రితానన్దరాసా
సరసగుణవిశాలా ♦ జానకీప్రాణలోలా. 118

§ గద్యము §

ఇది శ్రీమత్సకలకళాపరిపూర్ణ కాశ్యపవంశకలశవారాశి
సుధాకర లక్ష్మణాచార్యతనయ నరసింహాచార్య
ప్రణీతం బైనతులసీమాహాత్మ్యం బను
గ్రంథంబు సర్వంబు నేకాశ్వాసము;

సంపూర్ణము.



సీ. ఏవ్వాని కీర్తి "సహీప్రీతి" యనుకీర్తిఁ
గ్రాలు దిక్సతుల ముక్తాలతలయి
ఎవ్వాని సద్గుణబృందమాకాశవీ
ధీతారకంబుల ధిక్కరించు
ఎవ్వాని ప్రబలదాతృత్వసంపత్తికిఁ
గల్పంబు శీర్షభాగంబువంచు
ఎవ్వాని సలలితహృదయప్రదేశంబు
కరుణాస్రవంతికిఁ గన్నతావు
గీ. ఎవఁడు కవితారసగ్రాహి యెవ్వఁడతుల
బుధసమారాధనాయత్తబుద్ధి యతఁడు
తూతికమహాన్వయపయోధిజాతచంద్రుఁ
డైనయట్టి మా రామానుజయ్య యొకఁడె.

ఇందలి యితివృత్త మాంగ్లభాషనుండి గ్రహింపఁబడినది. ఇందచ్చటచ్చట గ్రామ్యప్రయోగములు ప్రయోగింపఁబడినవి. అవి బుద్ధిపూర్వకముగాఁ బ్రయోగింపఁబడినవే.



# మురళి.

గీ. పర మనోహరమహామయి భవ్యప్రశాంతి
మందిరమయి యత్యంత నిర్మానుషమయి
ఝిల్లికారావకలితమై చిత్రపుష్ప
వాటికావృతమయి యొకవనము పొలుచు.

సీ. జలజలస్వనముతో శాంతిని బోధించు
సవరని సెలయేఱు జలముఁ గ్రోలి
ప్రకృతివిలాససంపదఁ జూచుకొను పుష్ప
వృక్షాళిచాయల విశ్రమించి
మెలిగొన్న లవలీలతల చెలువుందనం
బులుగల పూపొదల్ నెలవుసేసి
నునుబచ్చియలుమేసి తనునాకవచ్చిన
లేటిపిల్లలతోఁ జెలిమినొనర్చి

గీ. యాకలములు మెసవుచు నిరస్త సర్వ
సంగమై లూనబహుదురాశాలతాల
వాలమై నిర్మలానందడోలనందు
నొకతపస్విని యుయ్యాల లూఁగుచుండె.

గీ. ఆమెకఱువది యేండ్లు దాదాపునిండె
నొడలు ముడతలుపడి కడువడలినట్టి
మావిపండువడువునఁ గ్రాహమయియుండె
మొగము బ్రహ్మవర్చసభరంబుగ నెసంగె.

గీ. ఆపెకంటికి దైవమహావిలాస
మొందుదక్క కన్పడదు మరొండుజగతిఁ
బాటలంబాడు నా దేవుపైని, మనసు
దగిలి యాటాడఁగా వాని దరికిఁబిలుచు.

కం. ఒకనాటిసాయమున నల
వికర్తనుఁడు గ్రుంకుచుండఁ బిరిగొనఁగాదీ
ప్తి కదంబంబు దిశాతతి
శకుంతనాదములు కర్ణసాత్కృతములుగాన్

సీ. జలజలప్రవహించు సెలయేటివళులనఁ
గ్రాలెడు తరఁగలగములవంక
నాకసమను సంద్రమందు లేచినతరం
గలు నాఁగఁదగు మబ్బుగములవంక
నలసందెవెలఁదుక హారములనమింటఁ
బాఱెడుసారస పంక్తివంక
సెలయేటిమెలనాఁగ తలవెండ్రుకలునాఁగఁ
గొమరారు మృదుశైవలములవంకఁ

గీ. బ్రకృతితరుణీవిలాస విభ్రమసమేత
లాస్యములవంక దీప్తిజాలములవంక
లలితగతిఁ దనచూడ్కులు మలపుకొనుచు
నాకె యొకశిలావేదిపై నధివసించె.

సీ. సాంధ్యరాగద్యుతి చ్ఛటలుపైఁబర్వ స్వే
దకణముల్ శోణరత్నములనెవయు

నవనవోద్భవయౌవనవిలాసతతి నిజ
సౌందర్యమునకుఁ బోషకముగాఁగ
హృదయంబునను ప్రసన్న వదనంబుశాంతిస
రోవరస్థితవారిరుహముగాఁగ
పండఁబాఱిననాచు పింఛముఁబోలిన వెండ్రు
కలగము లంటలుగట్టియుండ

గీ. నిసుకలోఁ దిగఁబడు కాళ్ళు నీడ్చికొనుచు
మెల్లమెల్లఁగ నడచుచు మీనమేష
ములను లెక్కించుచున్నట్లు పురుషుఁడొకఁడు
తద్వనమునుండి చనుచుండె దారితప్పి

గీ. ఏఁగుచుండఁగ నాతని యెట్టయెదుటఁ
గంటికగపడ్డ గుడిపై నిఁగల మనోజ్ఞ
జీవకళలనుగుఱిపించు చిత్తరువులు
అతనిఁ జేయూపి పిలిచెనుగతిఁ జెలంగె.

కం. డాసి యతం డాదేవళ
మాసారస్యములుగాంచి యావలికేఁగన్
రోసి మలపంగదృక్కులు
శాసనమగపట్టె నొకదృషత్స్తంభముపై.

వ. దాన నిట్లుండె.

సీ. ఊఁగఁగారావోయి! యుద్యాననీలతా
జాలకవ్యాలంబడోలలందు
నాడఁగారావోయి! హాయిగా నీమనో
హరవాలుకాపులినాళులందు

నీఁదఁగారావోయి! యీనిర్మలాంభః ప్ర
వాహముల్ గల కొండవాఁగులందు
పాడఁగారావోయి! పరభృతావళి మృదు
గానంబుసుతిసేసి కమ్రగీతి

గీ. యలరి యూయూయితావుల నాడికొనుచు
బూలతావులుగల చెట్లపొంతనుండి
మలయమారుతములు దెసలలముకొనఁగ
రహిని వాహ్యాళికింబోవ రాఁగదోయి!

శా. నీతోస్నేహమొనర్చి నీదయిన సాన్నిధ్యంబునం జేరి ని
ర్వాతస్థంబగు దీపికాకళిక నాభాస్వత్ప్రసన్నుండనై
ప్రీతిందావక మందహాస రుచిర శ్రీభాస్వరాస్యంబునే
చూతుంగాయని సంతసింతునెపుడాజోకల్ తటస్థించునో!

శా. ఆసూర్యోదయ మొక్కరీతి భవదీయంబౌవిలాసంబె యు
ల్లాసాత్మంబునఁజూచుచుం గుసుమమాలల్ గ్రుచ్చితిన్ నీదు శ్రీ
వాసీమమ్ము నలంకరింపసఖుఁడా! పండ్లన్ మరిందెచ్చితిం
బోసేయంగవకూడి వేగముగ రా బుద్ధిం బ్రసాదింపుమా!

గీ. కంటికగపడినట్లుండి కానరాక
పూలగములందు నవలతా జాలమందు
నమలినాంభః ప్రవాహమధ్యమునయందు
నడఁగి దాఁగుచుమూఁతలు నాడెదేల?

మ. అఖిలంబుందృజియించినీకొఱకు సన్యాసంబునున్ స్వీకరిం
చి ఖరంబైనతపంబుసేసి నినుదర్శింపంగ నేవచ్చినన్

సఖుఁడా! దాఁగుడుమూఁతలాడెదవు హాస్యంబిప్పుడా! వేగ నీ
ముఖసందర్శనమిచ్చి యొక్కపరి సమ్మోదంబుఁ గల్పింపుమా!

సీ. పసిపట్టి కాండ్రించి పైఁబడు బెబ్బులుల్
విహరించు నలకొండగుహలయందుఁ
గఱకుబల్ రక్కసకంపలగుంపుచేఁ
బర్యాప్తమైన పర్వతములందుఁ
బగఁబట్టి బుస్సని పడగఁబై కెత్తుచుఁ
గఱచు పాముల పుట్టగములయందు
నొక్కుమ్మడిని నయొనొక్కొ! మృగాపులమ్రింగు
నక్రముల్గల యునప్వాంతమందు

గీ. నింకఁ జెక్కుచోటులఁ జరియించినాఁడఁ
గాళ్ళలో శక్తి యుడిగెఁ జీకాకువుట్టె
నీదుసందర్శనంబు కాలేదు సఖుఁడ!
ఎచటనుంటివో! తెరదాఁటి యివలఁబడుము!

చ. "నడవఁగలేనునీకడకు నాకతిదూరములోననుంటి వి
క్కడకొకసారిరమ్మ"నుచుఁ గమ్మలిఖింపఁగదారి తెల్పి నే
నడుముబిగించికట్టి జవనమ్మునగాలినిఁగూడదాఁటి నీ
యడుగులమ్రోలవ్రాలెదఁబ్రయాసముగాదిదినాకుమిత్రుఁడా!

చ. కడపితిఁగొన్నినాళ్ళు బహుకష్టములంబడి జన్మమెట్టులో
విడిచితిఘోరసంసరణవృత్తి సమస్తమునింకస్వేచ్ఛ న
న్నడిగెడువాఁడులేఁడు సఖుఁడా! నినుఁగూడిసుఖాకమైనయీ
యడవినినాడుకొందు సతమూఁకఁటి కాకలముల్ మొసంగుచున్.

శా. నీవేలోకము, నీవెస్వర్గము, మరిన్ నీవేమహామోక్షమున్
నీవేసర్వమటంచునమ్మి సఖుఁడా! నీకోసమైవిశ్వమున్
భావంబందునరోసివచ్చితిని నీపార్శ్వంబునంజేరి నీ
సావాసంబునుజేయనాశను నిరాశంజేయఁగాఁబోకుమా!

సీ. పరభృతావళిమధుభరితకంఠోద్గత
కోకోస్వనంబుతోఁ గూడియొకట
మందానిలాపూర్ణ మధ్యరంధ్రోద్భవ
గీతంబుతో మేళగించియొకట
గోపబాలాధ్మాత కోమలస్వరవేణు
లలితగానంబుతో మెలపియొకట
బాలడోలాందోళ వేళలఁబాడెడు
లలిజోలపాటతోఁ గలిపియొకట

గీ. కరమునవ్యక్తమధురంబుగాసతంబు
పాటఁబాడుచునుందువే? ప్రమదమూర్తి
కలసికూర్చుండి మనకంఠములనుగలిపి
హాయిఁగూర్పఁబాడుదమురావోయి! సఖుఁడ!

మ. కనులన్ మూసి జపంబుసేయుతఱిఁ ద్వత్కమ్రస్వరూపంబనా
కనులంగట్టినయట్లుకన్పడి ధృతాకారప్రభాపుంజమో
యనఁగందోయిని విప్పనంతటన నేమైపోదువో కాని కా
ననముల్ చెట్లులుగుట్టలున్ వెదకినంగన్పట్టవేమోగదా!

సీ. ఉత్సాహముయ్యాల లూఁగింపఁబరుగిడి
తొట్రిలఁబడులేఁగ దూడతోడఁ

గిలకిలనవ్వుచంగుళలను గునుచుచుఁ
దొట్టిలోఁదూఁగాడు పట్టితోడ
జతగూడిగట్టుపై సవరననెగురుచుఁ
బెరిమఁజూపెడుమేఁక పిల్లతోడ
లేఁబచ్చియలఁజంచలితనేత్రములతోడఁ
బర్విడుహరిణశాబకముతోడ

గీ. ఆటలాడుచునుందువా యాయిచోట్లఁ
జిఱుమొగమ్మున లేనవ్వు చెంగలింప
గలసి మనమిర్వరమువాలుకాపుళినము
లందుఁగవఁగూడి యాడరావయ్య! సఖుఁడ!

సీ. కలువఱేఁడా! పూర్ణకళలతో వెలుఁగుచు
హాయిగా వెన్నెలల్గాయుమోయి!
ఆకసంబా! సముద్యద్దివ్యధారలఁ
గుసుమవర్షమ్ములు గురియుమమ్మ!
విహగంబులార! మీమహితకంఠములతో
గూండ్లలోఁగూర్చుండి కూయుఁడయ్య!
సెలయేఱులార! మీలలితాంబువులతోడ
నేసరేఁగుచుఁ బ్రవహింపుఁడమ్మ!

గీ. నాసఖుండిదెవచ్చుచున్నాఁడొకండు
వానినానందపఱుపఁగా వలయుసుండు
శోకతోడమీమీశక్తిఁ జూపవలయుఁ
దగినజాగ్రత్తతో నుండఁ దగునుమీకు.

సీ. సెలయేఁటులార! మీసలలితసలిలంబు
భక్తియుక్తంబుగాఁ బాద్యమిండు
లతలార! మీమృదుళంబు లౌపుష్పమం
జరులనర్ఘ్యంబు లొసంగుఁడమ్మ!
తరులార! మీదివ్య తరఫలంబులనునో
రెంబుగాఁగను సమర్పింపుఁడయ్య!
పతగంబులార! మీ స్వాగతవాక్కులతోడ
క్షేమవార్తలను బ్రశ్నింపుఁడయ్య!

గీ. అదిగో! నాసఖుఁడొక్కరుఁ డతిథియగుచు
వచ్చుచుండెనునేఁడు సుపర్వమయ్యె
నప్రమత్తతనుండుఁ డత్యాదరమున
స్వాగతంబిచ్చుతన్మంగళాగమునకు.

ఉ. సౌహృదవృత్తి నాదయిత జాడఁగనుంగొనవత్తువంచు న
వ్యాహతముత్ప్రవాహములు స్వాంతమహాంబుధినిండ సర్వస
న్నాహముసేసి నీదరిసెనంబు లభింపఁగ వేచియుండినన్
స్నేహితుఁడా! యిదింతఁదగునే? యరుదేర వదేమిపాపమో!

సీ. ఒకసారి శాతకంటకవృక్షపరివృత
శైలముపై నెక్కి శాద్వలములు
ఒకతేప నభ్రంలిహోర్వీజశాఖల
యందుఁ గూర్చుండి మహావనములు
ఒకపరి నలవలాహక కదంబకముపై
నరుగుచు సెలయేళ్ళ దరులగములు

ఒకమారు జవయుత వ్యోమవిమానంబు
పై నెక్కి పోవుదుఁ బంటచేలు

గీ. పాఱఁజూచుచునుంటి నేదారినీవు
వత్తువోయంచుఁ, దహదహపడుచు నుంటి
నెప్పుడే తెంతువోయంచు, నింతజాప్య
మేలొకో! చేయుచుంటివోయీ! సఖుండ!

శా. కైదండంగొని ముచ్చటించుచు మోదమునం గ్రామప్రకారమ్ములన్
బూదీమమ్ములఁజూచుచుం బులినభూముల్ జొచ్చుచున్నిర్మల
స్వాదూదమ్ముల కొండవాఁగుల విలాసంబుం బరీక్షించుచుం
బ్రాఙ్మహ్యాశ్రమదంతురాశ్మములరమ్యా! సంచరింపన్ సఖా!

గీ. విమలహిమబిందుతతశాద్వలములయందు
సారశారదశాలికేదారమందు
నవనవావ్యక్తరాగ పల్లవములందు
సమితమృదుశిరీషపుష్పములయందుఁ
జారురంభా మహీరుహస్తంభమందు
లలితమేచకరుచివియత్తలమునందు
స్రవదమలినప్రశాంత నిర్ఝరమునందు
మంజుమంజరిపుంజ నికుంజమందు
నతిమనోహర మాలతీలతలయందు
బతగకలకలకూజిత ప్రతతియందు
నద్భుతోన్నత ఫణలేలిహానమందు
ధవళకోమల కేతకీ దళమునందు
సాయసూర్యరాగప్రభాజాలమందు

శశధరప్రతిబింబిత జలములందు
నీమహిమ నీవిలాసము నీదుసౌరు
నీదు నైపుణి నీప్రౌఢి నీప్రశాంతి
నీప్రభావము నీదుపాండిత్యగరిమ
నీవిశాలభావమ్మును నీదుప్రతిభ
నీప్రచారము మఱియు నీనీసమస్త
మద్దమునవలెఁ గన్పట్టునయ్య! సతము.

వ. అనియున్న శాసనమును

క.౦ చదువుం జదువున్ మగుడం
జదివి తదీయాంతరార్థ సారస్యంబుల్
మదిఁగొని యేమహనీయుఁడో
యిదివ్రాయఁగఁబోలుఁగాక యితరులకగునే?

కం. మృదుమధురంబయి నవరస
నదీతరంగనిచయములు నాఁదగుపదసం
పదమై హృదయంగమమై
పొదలాడు నదేకవిత్వముగదా! తలఁపన్.

గీ. అనుచు శాసనపద్యదర్శనమువలన
నైన యానందపారవశ్యమున నుండ
నతనినేత్రాంబు జాతద్వయంబునుండి
ప్రకటముక్తాఫలంబుల పంక్తిరాలె.

గీ. అచటనుండి కాలుకదల్చి యాతఁ డవలి
కేఁగి యాశిలావేదిపై నెసకమెసఁగు

మూర్తి యేమూర్తి యోయంచుఁ బొంతకుఁజని
కనియె దాన జరత్తపస్విని నొకర్తు.

గీ. కలసి వారిద్దఱంతఁ బ్రగాఢమహిత
పార్శ్వికస్నేహ వాక్పరంపరలతోఁ బ
రస్పరానందభావ తరంగవితతి
తోఁ బ్రసంగించుకొనిరి సంతోషమొదవ.

క. శ్రీశా! సకాలముస నతి
పేశలమై రుచిరమై నవీనదళవిభా
రాశియయి కాకసుమము హ
తాశమయి స్వప్నంతిమెడయు టందం బగునే?

గీ. అనుతపస్వినిపలుకుల కతనిమనసు
వాఁడి ములుకులు గ్రుచ్చినపగిదిఁ గలఁగ
మొగముఁ దమ్మిమాడుచు కొని పొంతఁజేరె
స్పష్టలజ్జాలుపత్రింబు రీతినతఁడు.

గీ. పూచుచుం బూచుచున్నట్టి పూలచెట్టు
నిట్టనిలువున నెండి మొండియయిపోయెఁ
బట్టపగలింట మిక్కిలి దట్టములయి
కటికచీఁకట్లుగ్రమ్మె నల్గడలయందు.

ఉ. ఆశలు ధూళిధూసరములయ్యె హఠాత్తుగఁ బర్వె నిర్మలా
కాశమునందు మేఘములఖండతరంగతతుల్ ప్రశాంతివా
రాశినిరేఁగె జందురుఁడు రాహుఁగళాంతరసంస్థుఁడయ్యె నా
శ్రీశునిశాంతచిత్తమరరే! యఁగుడెంచె విశీర్ణమయ్యెడన్.

గీ. ఈవిశాలప్రపంచ మందావిలముగు
తనయభాగ్యజీవితగాథ తానవాయి
విప్పినోముపుటకంటెను వేఱుశిక్ష
'నాస్తి' యెట్టిధీరోదాత్తునకునుగూడ.

గీ కొంతసేపట కతఁడాచికొందలమును
మానసము గొంచియమునసహాధానపఱచి
యశ్రుకణములనొత్తి వస్త్రాంచలమున
దడదడలుమానిచెప్పఁగాఁ దొడఁగెనేదొ!

చ. చికిచికిముంగురుల్ నుదుటఁ జిందులుత్రొక్కఁగఁబిల్లమబ్బులం
దకపికిలాడు చందురువిధమ్ముగ నెమ్మొగమందగింప భా
వుకమయి, లేఁతవెన్నెలలపోఁడిమినోఁ జిఱునవ్వుగ్రాల నా
నకియనుగాంచు భాగ్యమిఁక జన్మశతంబునకైనఁ గల్గునే!

క. మురళీశ్రీశులువాసుమ
పరిమళమును దీపకాంతిఎటులంబుమహా
క్యరచననిర్గకముగవి
పరిణామముబొందెఁగాతపస్విని! జననీ!

గీ. శైశవమునందలిమురళీ శ్రీశులప్రణ
యంబుశాశ్వతమగుగాత మనినొడివి న
రేంద్రుచేఁజేతిలోఁ జేయి నిడఁగఁజేసి
కొనిపలుకలేదె? యతనితో జనని! నీవు.

గీ. దాకపందిళ్ళక్రిందను బోఁకతోఁట
లందులేమావిగున్నలక్రింద మాల

లీలతాకుంజములయందుఁ జాలసేపు
ఆడుకొంటిని మురళిని గూడి నేను.

గీ. ఒక్కకంచమునఁ గుడిచి యొక్కప్రక్కఁ
బండి యొక్కచోనాడుచుఁ బాడుకొనుచు
నిర్వచింపంగ రాక నిర్నిద్రమైన
యకలుషానందమున బాల్య మంతరించె.

గీ. నా జనకుఁడు తనదు మరణసమయమున
నా స్థినంతన రేంద్రున కగ్గపఱచు
చు మురళీలతజిగురెత్తుచు నెపుడలము
కొనునొ! శ్రీశమహాపఘ్నమున నిపలికి.

కం. ననువంటి యభాగ్యునకును
గునే? కనఁగనట్టి పుణ్యకోటియటంచుం
గనుకొలఁకుల బాష్పకణా
లు నిండ బిక్కమొగమూని లోలోనేడ్చెన్.

శా. బావా! శోకమునాఁ చికొమ్మ! మదినిక్ భావింపఁగాఁ బోకుమా
పూవుందావి వినాశమొంచునని, పూవుల్ పూచుకాలంబునన్
దీవల్ ప్రాఁకియుపఘ్నమందు విరులం దీపింపవే? పూచునే
పూవుల్ తీవలకాలమందకట! వాపోవంగనేలా! యిటుల్.

క. అనుమృదువాక్కులనాజన
కుని నూరార్చియతఁడ సులుగోల్పోనంతన్
ననుదిక్కు లేక తన చెం
తను జేరియడుగుకొనెడు నధమునిఁ గఁదలఁచెన్.

గీ. శైశవము మెల్లమెల్లఁగా జాఱుచుండె
యౌవనదశావికాసోదయంబు కాఁగ
మురళి, కరుణోదయము కాఁగఁ బూర్వదిశను
నెమ్మదిగ జాఱుచుండు చంద్రికలుఁబోలె.

వ. ఆ సమయమున మురళి యప్పుడప్పుడు నేను.

చ. సరసులతోడ ముచ్చటలు సల్పుచునుండ విలాసభూషణాం
బరములు దాల్చి యౌవను నాకవినంబు మూపఁగోరెయా
తటితటి కాదటం చెటఁగి దాని నెఱుంగని యట్టి ముచ్చటుం
జరచరవచ్చి కన్పడి వెసం జఱుసిగ్గు నటించి పాఱెనుఁ.

సీ. వదనసౌందర్యసంపదకుఁ గుంతలముల
నలువుందనమ్ము శోణమ్ము గాఁగఁ
జిగురాకుపైఁ గురిసిన మంచుసోనా
మోవిపైఁ జెలునవ్వు మోసులెత్తఁ
జందురమామలో నందగించు కళంక
మనఁ దిలకంబాస్య మునఁ జెలంగఁ
దళతళద్యుతిబింబిత తరంగతతి నాఁగఁ
జంచలాపాంగముల్ సందడింప.

గీ. లేఁతమబ్బులలోఁ దొంగలించు మిఱుచు
లనఁగ మృదువసనాలంకృతాంగకములు
చెలఁగ మురళీమనోహరి లలితగతులఁ
బొంచిచూడంగ ముద్దులుమూటగట్టె.

మ. అహాహా! యేమని చెప్పనుఁ మధురబాల్యామాయి కానందధూ
ర్వహమై, వ్రీడపటావగుంఠితమునై బాధాసితంబైన యా

మహిళారత్నము వక్త్రమండలముగమ్యప్రస్ఫుటజ్జ్వాల
ద్దహనజ్వాలల స్రగ్గిమగ్గి భసితాత్మంబయ్యె దుర్దర్శమై.

శా. మాబాల్యమ్మునదేకగాత్రులము నై మాజీవితద్వంద్వముల్
మాబాంధవ్యముమానినేశములు ప్రేమంబుల్ సమస్తంబులున్
నేబాసంచనశాశ్వతంబులనుచుం జిత్తంబులోనమ్మితిన్
నీ! బాలేయము బాల్యకోమలముగా నెంచంగ లేదమ్మరో!

కం. హృదయము విదళితమయ్యెను
ఛిదురపల్లై యనవయవములు శిథిలములయ్యెన్
వదలకయసువులువన్నం
గదఁగొలుపుచుఁ గానరాని కాఱియఁబెట్టెన్.

శా. నావృత్తాంతముసర్వమారయఁగ స్వప్నప్రాయమై యక్కటా!
భావాతీతమునై యగమ్యమయి దుష్ప్రాపంబుగానయ్యె! ని
న్నే! వర్ధిగతి మెట్టెశతృలనుగానీ! యింతకంటెన్ భువిన్
గావే మెన్నివిధాలఁజూచినను శ్రేష్ఠంబుంచుఁ జాటించెదన్.

గీ. మండువేసంగికాలము చండవృష్టి
నాతపముగురియుచునుండె నతిపిపాస
గలిగె నెండమావులు నీరుగాఁదలంచి
యాశతోఁబాఱుతెంచి హతాశుఁడైతి.

గీ. ఏమనియనుకొనిన లాభమేమికలదు!
నాదుసర్వస్వమెల్ల వినాశమయ్యె
నాప్రియత్నంబులెల్ల భగ్నంబులయ్యె
బూడిదనుమంచిపన్నీరు పోయనయ్యె.

కం. నాయర్ధాంగముదగ్ధం
బై యర్ధప్లుష్టవృక్షమన నిష్కళమై
హేయంబై భీకరమై
ఛాయారహితంబునై కృశంబయియుండెన్.

కం. అతటంబులైన నాజీ
విత గతదుఃఖప్రవాహ వితతుల తత్త
ద్గతు లెన్నసివినిపింతును
వితతకు పుట్టంగనీకు పిసవిసజననీ!

చ. కలకలలాడు నాముఖవికాసస మాకుటిలాలకంబు లా
సలలితబాల్యయౌవనదశాద్వయమిశ్రిణచేష్టితంబులా
పలుకులయందమా మృదుభావము లానవమోహనంబులుం
గల మురళీలతాంగి మృతిఁగాంచెనసంగను దోఁచుఁదప్పఁగన్

మ. జననీ! జ్ఞానము వచ్చు తొట్టి మురళీచంద్రాస్యసంజూచి సి
గ్గునమోమెత్తకచుట్టుపక్కలనుఁజూడక్కల్ చంచలాకాంతిపం
క్తినిఁ గల్పింపఁగఁ గ్రొళ్ళువాఱెడు కురంగీశాబముంబోలె ది
గ్గనఁ బర్వెత్తును లేఁతపవ్వలధరాగ్రింబందు వాహ్యాళిరాన్

క. అనఁగనఁగానొకరాజని
చినచిన్నకథలనెలమి వచించుచునొక చ
క్కనిచిలుకకూనవోలెను
మనమునునానందవార్ధి మగ్నముఁజేసెన్.

ఆ. వె. మదనశిల్పకుండు హృదయంగమంబుగా
శక్తిధారవోసి జాగరూక

తనురచించినట్టి తత్తకాంచనవిగ్ర
హంబునాఁగమురళి యందగించె.

శా. నేనొక్కొక్కపుడింటలేనియెడ నిర్నిద్రప్రియంభావుకా
త్మానందంబున నేవసించుగదియం దాయాయఁభక్ష్యంబులన్
గాసంగాఁదగుపండుటాకులును వక్కల్ సున్నముంబెట్టియా
రా! నాకోసముదారిఁజూచుచల ద్వారంబందునిల్వంబడున్

క. సౌందర్యలతాచ్ఛదసుమ
బృందమునావస్త్రభూషలింపెసలారం
గందాల్చిపేరఁటానికి
విందులకునుబోవుమురళి వీక్షింపవలెన్.

శా. దీపప్రాంతమునందు రెండవదియాదీపంబునాగేహము
ద్దీపింపంగనుఁగూరుచుండి మృదురీతింబాటలంబాడుచా
యాపాఠాలుపఠించుచుం మిగుల బ్రహ్మానందముంగూర్చుచే
నాపార్శ్వనికిరాఁగసిగ్గుపడి తానంతంతడాఁగంజనున్.

చ. జడము డియూడఁగేశముల జాలము విప్పినబర్హిపింఛపున్
వడువున, మేరుశృంగపరభాగమునుండి నితంబసీమపైఁ
బడుచునదస్పదంబునకుఁ బాఱెడుకృష్ణజలప్రవాహపున్
వడువునఁదోఁపనందపడి పట్టఁగరానిముదంబుఁగూర్చెఁగా.

సీ. జీవకళ లుట్టిపడు మంచి చిత్రరూపులు
వ్రాసిగృహాలక్ష్మి తనశరీరమునఁదాల్చు
భూషణంబులునాఁగుడ్యములకువ్రేలఁ
గట్టు ముద్దులుమూటలుగటుచుండ.

సీ. భాలవైశ్వానర జ్వాలలఁ గ్రాఁగని
శంకరాలంకృతచంద్రరేఖ
యతిసాంద్రధారాధరాచ్ఛాదితముగాని
శ్రీయుక్తదివ్యశాంపేయవల్లి
దారుణవ్యాధ శస్త్రప్రౌఢిఁగాంచని
చకితలోచనమృగశాబకంబు
పరిమత్తరుచిరబంభరచుంబితముగాని
చారుసురభిపారిజాతసుమము

గీ. మరుఁడుమోహపెట్టనట్టి యున్మాదశరము
చంద్రసందర్శనముగాని సారసంబు
పంజరంబునఁదాఁచని బాలశుకము
అహహా! మురళినిమఱువంగ నగునె? నాకు.

గీ. అరఁటిపిల్లలప్రక్కఁ బిల్లరఁటి, పూల
చెట్లకడనొక్క లేఁబూవుఁజెట్టు లతల
కడనొకంటకులతయుఁ గానిపించు
మురళియచ్చోట్లఁజరియించు తఱులయందు.

గీ. ముఖవికాసనముల, నేత్రములవిశాల
తల, మృదుశరీరనవ సౌందర్యకళల
సమ్యగవ్యక్తభావ వాగ్జాలములను
బ్రకృతిసుందరినాఁగ మురళిజెలంగు.

క. మాయామర్మములెఱుఁగని
యాయాచందలనుబడని యాటలుపాటల్

హాయియగువనవిహారము
లాయానందాఖ్యకల్ప మనబాల్యముగా.

గీ. కాలచక్రము తిర్వనఁ గంటికగప
డకతిరుగుచుండె మనమురళికివివాహ
సమయమునుడాసె "శ్రీశ ! నిశ్చయముమురళి
నీదుసొమ్మ"నిపలికిరి నేస్తకాండ్రు.

కం. బావా! బావా! యనిన
న్నేవాడలనున్నఁబిలుచు నీమురళి బళీ!
భావంబందునఁ దనకే
భావంబుదయించెనో? పిలువఁగనటుమానెన్!

కం. ఎగసనఁద్రోయుఁగనేఁ దలఁ
పఁగ మాస్నేహమయదీపవర్తిఁ గటకటా!
దిగసనఁద్రోయఁగ మొదలిడె
ను గమంగను పాపపువిధి నులినులిపడఁగన్.

గీ. నాదుమామయగు నరేంద్రనాథుఁడు తన
కూఁతు మురళిని నాకంటె గొప్పయాస్తి
పరున కీఁదలంచి లిఖంచెవానితండ్రి
పేర నొక్కజాబని నాకువినఁగవచ్చె.

గీ. గుండెలో నొక్కపెనురాతిబండపడెను
దృష్టిశూన్యమయ్యెను గాయమేపుదగ్గ
జీవకళమోమునందున శిథిలమయ్యె
మూర్ఛలోనుంటి కొంతసేపు స్మృతిఁదప్పి.

వ. కొంతసేపటకు స్మృతిఁదెచ్చికొని

కం. మురళీ మానసవృత్తిని
నెఱుఁగంగాఁగోరి యాపెయేకాంతముగాఁ
జరియించుతఱిని వేచితిఁ
జిరకాలముదాఁకనదియుఁ జేకుఱదయ్యెన్.

సీ. చిన్నారిపొన్నారి చిఱుమోముఁదమ్మిపై
ముసురుతేంట్లనఁగురుల్ ముఱుపుసూపఁ
బద్మరాగంబుపైఁ బటికదాపినభంగి
వాతెఱ లేనవ్వు స్వారిసేయఁ
బూతావికై వచ్చి పొదడాఁగు నల్లత్రాఁ
చనఁ బూలజడ తనవెనుకడాఁగఁ
బువ్వులుపూచిన బొంగులాబి యనంగ
నునుదళ్కునగలతోఁదనువుగ్రాల

గీ. గంధపుష్పాక్షతలుగల కంచుపళ్లె
రంబుకైదోయిఁగ్రాల సొగసఫహాగము
రక్తతామరసములపై వ్రాలుపగిది
దేవళంబునకొకనాఁడు పోవుచుండె.

గీ. ఆపెనుఁగాంచకుండ నాయాయిగతుల
నాపెవెన్నాడివెన్నాడి యాలయంబు
చేరి యొకమూలడాఁగ నాచెలువపూజ
నంబు సంపూర్తిగాఁగ ధ్యానంబుసేసి.

గీ. ఆమురళి నిజదృక్కటాక్షాళినాఁగ
రమ్యకంపాలతాపంక్తిఁ గ్రాలఁజేసె

మామకశరీరవారిద మధ్యమందు
నుత్తరక్షణమున నాంధ్య ముదయమయ్యె.

గీ. చిఱుత సిగ్గునఁదలవాంచు మురళి మొగము
వంచిపట్టినతమ్మి ప్రాభాతిఁజెలఁగఁ
గాలి బొటమనవ్రేలితో నేలరాయు
చచటలేయంచనానందమై చెలంగె.

గీ. నోరువిప్పియు నడుగంగ నోరురాక
యెట్టకేలకు ధైర్యంబ యేసరేఁగి
వెన్నునిమురుచుఁ బురిఁగొల్పుచున్నయపుడు
పలుకలేకపలుకలేక పలికితినిటు.

గీ. ఈడుజోడుగఁబెరిఁగి మింతదనుక
నొకటనాడుచుఁ బాడుచు నుద్భవిల్లె
యౌవనాంకూరములు మేనుఁదీవనీకు
మురళి! రాఁబోవు కాలమెవ్వరిదో? తెలియు

కం. మురళీ! యాస్మాకప్రీణ
యరమ్యవల్లీ నిక్కృంత నాయత్తమతిం
దిరుగుచు నుండెను మీతం
డిరి వింటివో? లేదో? నవతటిల్లతికాంగీ!

గీ. మనచిరంతన ప్రణయంబు మఱచిపొమ్ము
మనవనవిహారఖేలలు మఱచిపొమ్ము
మనభవిష్యత్ప్రయత్నముల్ మఱచిపొమ్ము
మురళి! యొకటేమి టన్నింటి మఱచిపొమ్ము

గీ. మురళి ! నీమానసఫలకమున మదీయ
నామధేయాక్షరద్వయి నేమకాక
వ్రాసికొనియప్పుడప్పుడు పాఱఁజూడు
మమలపీయూషయుతకటాక్షములతోడ

గీ. ఒక్కపొత్తునఁగూర్చుండి యోగిరంబుఁ
గుడుచుచుంటిమింతవఱకు నివ్వుడుమరొకని
పొత్తునను నిన్నుఁగుడుపంగబుద్ధినేమి
తలఁచినాఁడోకదా! నీదుతండ్రిమురళి!

వ. అనుమాటలకు మురళి మూకీభావమొందెను.

సీ. ఆకాశమా! నిర్మలాకారమై శాంత
మై నీలకాంతుల నీనుచుండె
చంద్రుఁడా! నిజషోడశకళాళి వెదజల్లి
హాయిగావెన్నెలఁ గాయుచుండె
మారుతంబా! మందమందంబుగాఁజల్లఁ
గాగంధయుక్తమై కదలఁబర్వె
విహగంబులా! మధువిహితకంఠస్వర
కోటితో గూండ్లలోఁగూయుచుండె

గీ. సకలజనతామనోనికుంజములదూరె
జవ్వజవ్వునానందాభిసారికాళి
కాని దారుణాభీలనిర్ఘాతమొకఁడు
పడె మురళిపయి సప్తమింపంగనెల్ల.

చ. నడవఁగఁగాళ్ళురావు, వదనంబుచెమర్చె, విలోచనద్వయిః
ముఁడివిడివడ్డముత్తెముల మొత్తమునాఁగను బాష్పబిందువుల్

గడుఁగడురాలె, మేనువడఁకన్మొదలయ్యెఁగడింది, గుండెలుఁ
దడదడకొట్టుకొనవిదితస్థితిఁ గొండొకనిల్చెనయ్యెడన్.

శా. ఆపాశాళముఁ బ్రేళ్ళుపాఱశిఫల త్యంతంబునాటన్ భువిన్
వ్యాపింపంగనభోంతరాళముఖలంబాత్మీయశాఖాతతిం
బ్రాపై యుండఁగఁబక్షిసంతతికి నుత్పాటింపఁగాశక్యమే?
యేపాపాత్ముననీకేద్బృఢాంగునకుఁ గానీపెన్పటంబజ్జరే!

గీ. గండ్రగొడ్డళ్ళు ముక్కముక్కలయిపోవు
భూరివజ్రాయుధములైన మొక్కవోవు
శల్యశల్యమునాటి యస్వల్పమయిన
ప్రణయవృక్షంబుచ్ఛేదింపఁ బ్రయతపడిన.

గీ. దీపమొకచోట దీపకాంతినిమరొకటఁ
దావినొకక్రేవ విరజాజిపూవునొకట
బింబమొక్కటఁ దత్ప్రతిబింబమొకట
వేఱునేయంగఁదలఁచెనే? విధికడంక.

వ. అని యీశ్వరివంకఁ దిరిగి.

శా. అమ్మా! మబ్బులుక్రమ్మియాకసము నందత్యంతగాఢాంధకా
రమ్ముల్ నిండిప్రచండవృష్ట్యశను లారంభించిలోకమ్మున
ర్వమ్ముల్ దుష్ప్రళయమ్ములోమునుచు వార్తల్ తోఁచెదుర్ నాదుభా
రమ్మొట్లీవువహించియావలికిఁ జేరంజేసెదో? యీశ్వరీ!.

మ. అనిసాష్టాంగముప్రొగ్గతిల్లఁబడి యయ్యంభోజపత్రాస్యయం
తనుజేతంగొనిపళ్ళెరంబధర మత్యంతాతపక్లాంతచూ

తనవాంకూరదళంబు కాఁగ ముఖపద్మంబందునన్ మూఁగు తేఁ
ట్లనునా ముంగురులొత్తగించుకొను చష్టచ్చోటనుండింజనెన్.

ఇది
సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిచే రచింపఁబడిన
మురళియను ప్రబంధంబునఁ
ప్రథమాశ్వాసము.

# ద్వితీయాశ్వాసము.

శా. సంతోషమ్మొకవంక దుఃఖమొకపార్శ్వంబందునన్ నిల్చి నా
స్వాంతాఖ్యంబగుక్షేత్రముం గొనకటా! యాపత్కాలమొక్కంటమొ
గ్గంతన్ వేఱొకటంగనంబఱచు నిర్గాశ్చర్యముం జేయు చ
త్యంతంబుంగను పట్టుచుండె ములుమాత్రంబొక్కటం జూపమిన్

గీ. మురళికై నేను దేవళంబునకుఁ బోతి
నన్నుసంగతి పొడగట్టి యాపరేంద్రుఁ
డకట ! మఱునాఁట నన్ను ద్వీపాంతరమున
కంపెఁ బెంపుడుచిల్కను నడవికట్లు.

కం. జననీ ! మురళీసంద
ర్శనమునకే నీళ్ళువదలి రాగస్ఫూర్తిన్
అనునిమిషంబా చెలి చిం
తనమే నాజన్మకారణమని తలఁచితిన్.

మ. లతలం జూచినఁ బూచి చెల్వగు లీలాకుంజముల్గాంచినన్
సతతంబా మురళీమనోహరతనూసౌందర్యసౌభాగ్య సం
తతికన్పట్టుటయుక్త మప్పగిదినే దైవారనేవ్యక్తి నీ
క్షితిపీక్షించినఁ దత్స్వరూపతనె భాసిల్లెన్ విచిత్రంబుగన్.

శా. నావండాయఁగఁ బోవునత్తఱిఁ గటా! నావంకఁ దత్తన్వియా
శావావాసగ వాక్సుసీమను దివృత్తాబుద్ధియై నిల్చె దుః
ఖావేశక్షురదళ్ళ్రిబిందుతతి పేర్మి కాశబాభాసితం
బై వేగాపతితోషు సంచయము నానాక్రందముం జేయుచున్

గీ. నావనెక్కితిఁగాని ప్రాణంబులన్ని
యకట! మురళీస్వరూపమం దదికిఁగొనెను
బ్రాణయనిర్యాసమునఁ జేసి, పట్టియెంత
లాగిననుగూడ రాక కలంచెనన్ను.

గీ. కలఁతపడినమదిని నావ మలపుతిరుగు
దాఁక మురళినిఁజూచుచు దానిఁదిరుగు
విమ్మటంగూడ నావైపె దృష్టినిలిపి
యుంచితిని జడీభావంబునొందిజనని!

చ. తరఁగలులేచియాకసముఁదాఁకి వటాత్కృతిసేయువేళ, దు
ర్భరతఁ దుపానువట్టి పడవందలకిందులు సేయువేళఁ, జి
చ్ఛటపిడుగుల్ పయింబడుచు సర్వమునాశముసేయువేళ, నా
మురళిచెలంగ నాకెలనఁ బొందవయీగతులంచునేడ్చితిన్.

ఉ. కాయము డస్సికాఁడుపడి కాలుఁగదల్పఁగశక్తిలేక హా!
హా! యని నోరిఁగొట్టుకొనునయ్యెడఁ గాసినినీళ్ళుగొంతులోఁ
బోయఁగ దిక్కు లేనపుడు పొక్కితినామురళీలతాంగియే
నాయదు చెంతనున్నయెడ నాకిటుదుర్గతి కల్గదంచటన్.

సీ. శోకాబ్ధివీచికా స్తోమంబులంబోని
సాగరవీచికాచయమువంక
వృత్తిశూన్యంబైన చిత్తంబునుంబోని
సర్వశూన్యంబాకసంబువంక
విరహాబ్ధిలోమున్గి తిరుగుశరీరంబు
నాఁదగునాయున్న నావవంక

విప్రియుక్తునివోలె వెలవెలఁబోవుచు
వెతలొందుచున్న నావికులవంక

గీ. చూపునిగుడించినిగుడించి చూచిచూచి
నాసమస్తంబుతో సమన్వయముసేసి
యశ్రుబిందులు నేత్రద్వయంబునుండి
కాలువలుగట్టనేడ్చితిఁ జాలసేపు.

ఉ. ఆమహనీయభీకరమహార్ణవమందునఁ బోవుచుండ బా
వా! మతిమంతుఁడా! కనుముపారముఁజేర్పుము వార్ధిలోపలం
గామముమున్గుచుంటినని కాంతతరంగతటాత్కృతిధ్వనిన్
శ్రీమురళీలతాంగియె వచించినరీతిగఁదోఁపనయ్యెడన్.

ఉ. ప్రాణములేచిరాఁగ ననుబావ! యటంచును బిల్తురెవ్వరం
బాణిమెఱుంగుముత్తెములయంతటి బాష్పకణంబులూర నా
పాణినిఁజాఁచి యామురళిపాణిగ్రహింపఁగఁబోయి వంగఁగాఁ
బ్రాణముదూలి యట్టె జలరాశిజలంబులలోన దుల్లితిన్.

గీ. దుల్లినంతటనే నట్టుడుగునకేఁగి
మరల దానితరంగాలయురవడిమెయి
నీటిపయిఁదేలియాడ మునింగితేలి
నట్టి చిన్నయోడపగిది నదవదపడి.

సీ. ఒకతరంగమునుండి యొకతరంగముపైకి
వేగధాటినిఁజేసి విసరివేయుఁ
బర్వతాగ్రమునుండి పడఁద్రోసినట్టుగా
నేలమట్టంబు నంటికొనఁజేయు

నోటికందిచ్చు తెన్నునఁ దిమింగిలనక్ర
ముల దృష్టిపథముల మెలఁగఁజేయు
ముక్కుజెవ్వులలోన నక్కళ్ళనీరొప్పి
కడుఁగడుఁ జీకాకు గలుగఁజేయు.

గీ. నొక్కమారాకసంబంటనొక్కమారు
ఘోరపాతాళమంటంగఁ గొంతసేపు
వెలుఁగులోపలఁ గొంతసేపు గడుఁ గటిక
చీఁకటులలోనఁద్రిప్పె నాసింధురాజు.

మ. నాదురవస్థఁగాంచి కరుణాభరితుండయి కర్ణధారుఁడ
త్యాదర వృత్తి నావ నతిదగ్గఱగా నడిపించి తెచ్చి నా
మీఁదను మోకునుం విసరె మిక్కిలిగట్టిగ దానిఁబట్టుకో
నాఁదటఁ బైకిలాగిరి ప్రయాసముతోనను నావికోత్తముల్.

ఉ. ప్రాణము సొమ్మసిల్లెను మదంగకముల్ శిథిలంబులయ్యె ని
ద్రాణములయ్యెఁగన్నులలఁతం మెయిజల్లఁబడెంగడింది ని
ర్వాణసమీపవర్తిగతభాస్వదీపముఁబోని నన్ను సం
త్రాణమొనర్చిరాపడవ నావికులేసముదారభావనం.

గీ. రెండుమూన్నాళ్ళదాఁకను స్మృతినిఁదప్పి
యొక్కగదియందునంబడి యుండినాఁడ
దోమలునునల్లులును గండుచీమలును గ
డుఁగడు నెత్రుపీల్చి నన్నుఁడొల్లఁజేసె.

క. ఒకనాఁడర్ధము రేయిఁగ
టకటా ! స్మృతిఁగాంచి నేఁగడంకను లేవం

వికటాంధకారబహుళన
రకకూపమునంబడిన తెలుంగునదోఁచెన్.

క. ఆయంధకారబంధుర
మాయామినియందమోఘ మైశ్రీమురళీ
భూయఃప్రణయజ్యోతియ
హాయిగఁగన్పట్టెమామకాక్షిద్వయికిన్.

గీ. నావికులునాదుసాన్నిధ్యమునకుముదపడి
నాదుజీవితవృత్తమంతవినిజాలి
గొనికడిందినాపైని నెక్కొనినప్రీతిఁ
గడుపునిండంగభోజనం బిడిరియెలమి.

గీ. దానిమఱునటిరోజు ప్రాతస్సమయము
నందుసింహళద్వీపంబు నందునన్ను
డించిపోయిరినావికుల్ కొంచెపఱచి
రోసిదురదృష్టవిధిక్రిందఁ ద్రోసినట్లు.

సీ. తినుటకన్నములేక "దేహి" యంచునుగడు
పునుగొట్టుకొనుభిక్షువులనుగలసి
"జై విశ్వనాధం" చు నసరించిగడ్డాలు
తారెడుబైరాగి దండుగలసి
సర్వసంగంబు నిస్సంగంబుగాఁజేసి
క్షితిసంచరించెడు యతులగలసి
పాపకర్మంబునఁ బడఁతిన్నిఁబాసివేఁ
దుఱువోలెఁదిరుగు పాంథులనుగలసి

గీ. యింకనావంటివారి ననేకమందిఁ
గలసిమెలసిచరించితిఁ గష్టములకు
నోడినిఁగట్టితిఁగాని యహాహా! యదేమొ!
మురళినాబుద్ధిలోనుండి మరలకుండె.

సీ. ఒకసారి బర్హిశాబకములతోఁ గూడి
యంగుగాఁ దాండవంబాడినట్లు
ఒకసారిఁ జంద్రచంద్రికల మవ్వంబును
నవ్వంగఁ గిలకిల నవ్వినట్లు
ఒకసారి మబ్బులందున్న చంద్రకళనా
నడరుచు దోఁబూచు లాడినట్లు
ఒకసారి మందానిలోదయంబై నట్టి
వేగువవాహ్యాళి వెడలినట్లు

గీ. దాఁగిమూఁతలనాడుచు దాఁగినట్లు
చిలుకపలుకలతో నన్నుఁ బిలిచినట్లు
మురళి నాప్రాణపదము నాప్రేమలందోఁచె
జాగ్రదాదులయినయవస్థలనుసతము.

ఆ.వె. బావ! నీవుదక్క వసుధపైఁ గలనరు
లన్నదమ్ములౌదు రెన్న నాకుఁ
జెలియులగుదు నేను సిద్ధంబువారల
కంచుఁ జెప్పినూఁది నట్లుదోఁచు.

ఉ. రాతిరినిద్రపట్టక కరంబను తాపముచేతఁ గుందుచున్
జేతిఁదలాఁడఁ జేసికొని చెట్టులనీడఁ బరుండియుండఁ జే

మాతురమై నితాంతముమదంఘ్రిలనొత్తఁగవచ్చి చెంగటం
బాతరలాడురీతి నగపట్టఁగఁజూతును శూన్యదిక్కులన్.

గీ. కనులుమూసినఁదెఱచిన గాఢనిద్ర
లోననుండిన నమృతకల్లోలమయక
టాక్షములఁ బ్రసరించుచు డాసినన్నుఁ
జేతితో మేనుఁదాఁకిన చెలువుదోఁచు.

గీ. నాదుగృహలక్ష్మి నాజీవనప్రసవవ
సంత మక్షియుగామృతాంజనము నాదు
హృదయకైరవశశికళ యెట్టియెనుట
గట్టిపట్టిప్పుడుంగూడఁ గానిపించు.

గీ. ననుఁబిలుచుఁగాని నేఁబిల్వఁగనుబలుకదు
డాసియునులజ్జచేవలెఁ బాసిపోవుఁ
గంటికగపడినట్లుండి కానరాక
హరిణశాబంబుబోలెను బరుగులిడును.

గీ. ఎవ్వరేమనుకొనుచున్న నెవ్వరేగు
సగుసలాడుచున్న నెవరుశ్వాసములను
విడుచుచున్న నాముకళీపరివృత్తియేమొ!
యనుచుఁ గడుఁగడుఁజెవియొగ్గి వినితిఁదనని!

గీ. ఇంటికడనుండి యుత్తరాలేఁగుదెంచ
నాముకళిసంగతులుగలవేమొ! యనుచుఁ
దహతహంబడిచూచి తద్భంగకలన
ద్విగుణితాత్మీయ దుఃఖమున్నితుఁడనైతి.

గీ. శారదప్రభాతంబుల జలజముక్త
లలితహైమనవార్బిందువులనుగాంచి
నాటిమురళీమనోహారి నయనబాష్ప
బిందువులు జ్ఞాపకముఁ రాఁగ వెతలుగొంటి.

గీ. హృదయగగనంబునంబుట్టి దృక్తటముల
జాఱుశృంగారభావ నిర్ఝరములనఁగ
వదనసౌందర్యపీయూషవారిరాశి
చారునాసట్యమానోర్మివారములనఁ
ప్రీతజనవశీకృన్మంత్రపూతవర్ణ
మాల జపియింపనగునక్షమాలికలన
గూఢగాఢానురాగ పరిఘోషములగు
ధమధమాత్కార రహితపటహములనఁగ
లక్ష్యసాధనాభ్యాస విలాసమదన
ముక్తసమ్మోహనాస్త్ర సమూహములన
మద్వరుండవు నీవసుమ్మా! యటంచు
కంఠమునఁ జుట్టవెట్టును క్రాలతలన
సవ్యలజ్జావగుంఠితాననమునెత్తి
కంబుకంఠంబుసాచి పక్కకనుదిప్పి
పరిణయశృంగారములను మిశ్రణమొనర్చి
చిత్తమైకాగ్ర్యసంవృత్తిఁ జేసి మెల్లఁ
గనుసహస్రఘటాభిషేకంబుసేయు
కరణి మురళి నాపయిఁ గటాక్షములుబఱచు
సరసతందల్పహృదయంబు తత్తిగిపోవు.

సీ. ఫాలలోచనజటాభారబందీభూత
బాలకప్రాలేయభానురేఖ
సాంద్రవర్షాంభోదసందోహమధ్యసం
ఛన్నశంపామనోజ్ఞతరవల్లి
దుర్నిరీక్షప్రభాస్తోమభూమీధరా
భ్యంతరగుప్తరత్నాంకురంబు
కంటకవృక్షశాఖాగణాగ్రిమాఢ్య
భూయఃపరీమళపుష్పకళిక

గీ. పంజరాంతరసంలగ్నబాలశుకము
శరధిగోపాయితానంగసాయకంబు
వ్యోమగంగానదీజాతహేమకమల
ముకుళమైయక్కటా! నాకు మురళిదోఁచె.

సీ. బాలరంభాస్తంభజాలసౌభాగ్యంబు
మొత్తమొక్కటఁబోఁతపోసినట్లు
కోమలమల్లికాకోరకైశ్వర్యమొ
క్కటఁజక్కఁగాగడ్డకట్టినట్లు
విస్తృతహైయంగవీనమార్దవభూతి
యేకత్రరాశిగా నెసఁగినట్లు
పరిపక్వమాకంద ఫలరససంపత్తి
తనివార నాకృతిఁ దాల్చినట్లు

గీ. లలితనిర్మలసౌందర్యలహరియట్లు
మామకాక్షిద్వయానందధాతువట్లు

చెలఁగు కురులు మనోహారి చెలువుఁదనము
సంస్మరించ నార్తి నయ్యె నాజన్మకకట !

గీ. అనివచించి దృఙ్మండలజనితబాష్ప
వాఃప్రవాహధారాతతి పక్ష్మయుగళ
పారగుఃలనిండిపొరలి పెల్లుబుకఁగాఁగఁ
గంపితస్తంభితశరీరకంతుఁ డయ్యె.

గీ. కొంతసేపటిదాఁకను గొందలమునఁ
బలుకఁగాలేక దీర్ఘనిశ్వాసకలిత
వాతపరిధూతసాగరాభ్యర్ణసంస్థి
తోడుపంబు తెఱఁగున నుండె నతఁడు.

ఉ. వానియవస్థఁ జూచుచుఁ దపస్విని యుత్కటబాష్పబిందు సం
తానము కంటివెంట బహుధాప్రవహింపఁగ నార్తిచెంగుతో
వానిముఖారవిందమును బాణితలంబున సంస్పృశించి శ్రీ
శా ! నిలుపోపు మోయి ! జలజాతము ఫుల్లముగాదె వేకువన్

కం. అనిబుజ్జగించి యూతని
గన్నుఁగొలకులనుండి కాల్వ గట్టిననును వె
చ్చనికన్నీటినిఁ దనదువ
సనంబునఁ దుడుచుకొనెను భృశప్రణయగతిన్.

వ. మఱల నాతఁడిట్లు చెప్పఁదొడంగె.

మ. జననీ! ప్రేమను ఘోరదారుణమహాశార్దూలసంకాశమం
చును గాలాగ్నిశిఖాచ్ఛటావలితమంచుం గ్రూరచక్షుశ్శ్వవో
ఘనదంష్ట్రావిషసన్నిభంబటంచుం గానీ తలంపం దలం
చిన, నిట్లా మురళీశశాంకముఖితో స్నేహంబుగావింతునే ?

గీ. మేరితాపమనఁబడు దావానలంబు
అస్రువర్షాంబుధారల నార్తిశోక
వెడఁదనిట్టూర్పుగాడ్పులు వీచుకలన
మాంశికరాటికిఁ జెందెఁ [illegible]

సీ. బాష్పాంబుపూర్ణదృగ్గళద్వార్ఘారాప్ర
వాహంబులో నవగాహమాడి
భూతధాత్రీధూళి భూతికదంబంబు
సర్వాంగములయందు సరవిఁబూసి
దేహసంభూతాతితీక్ష్ణతాపానల
జ్వాలికామధ్యదేశమునసలిచి
ముక్తి మా[illegible]మంత్రపుణ్యాక్ష[illegible]
పరిగతాత్మశక్తి [illegible]బు సేసి

గీ. చిత్తమైకాగ్ర్యసంవృత్తిఁ జేసి పటుస
మాధినిష్ఠుఁడగుచు నహర్నిశంబు
ద్వంద్వసందర్భములు నిరస్తములుజేసి
తపముసల్పితిఁదన్మయత్వంబుఁ బొంది.

క. జననీ! సింహళదేశం
బున నేనాదు దురదృష్టమునకున్ హృదయం
బునఁబట్టరానిదుఃఖం
బునఁబొగులుచుఁ గడపినాఁడఁ బొలుపఱి కట్టా!

ఉ. నాతలిదండ్రులిర్వురు మరణంబునుగాంచక యున్న చోఁగటా!
ఆతతకష్టసాగరమునందు మునుంగుచుఁదేలుచీగతిం

బ్రేతకళావహుండనయి వెల్వెలఁబోవుచునుందునే ? ప్రమో-
దాతిశయంబునన్ మురళిహస్తముఁబట్టిసుఖింపకమ్మరో !

ఉ. విన్ననువొప్పనామురళిపేరను మామనరేంద్రుపేర నె
న్నెన్నొలిఖించిజాబులనవెల్లనునూరకపంపఁబోక చూ
డ్కన్నిగుడించిచూచుచు విశీర్ణమనంబున దాఁచిక్రమ్మఱన్
గొన్నిదినాలపై నిఁగని కొందలపాటునఁజించివేసితిన్.

సీ. ఒకసారిపెక్కుల నూఁగించివిస్వోది
ఱెప్పనఁబఱచుపూరేఁడుచూచి
ఒకసారిపాయఁగా నుదధిభేదించియా
వలఁగట్టుఁదరియు నావలనుజూచి
ఒకసారివాత్యారయోద్ధతిమైకడుఁ
గడుఁబొఱుతెంచు మేఘములఁగాంచి
ఒకసారి దివ్యయోగికబలంబునఁ జేసి
యరిగెడుపటుయోగివరులఁగాంచి

గీ. తద్గతులనభ్యసింపంగఁ దలఁచితలఁచి
బిక్కమొగమునఁబరికించి దిక్కులకట !
దుర్మనాయమానుండనై తొట్రిపడుచు
సంచరించితి నాయాయి స్థలములందు.

గీ. రెండుసంవత్సరములు పూర్తిగఁగడచెన-
నంతరంబున మురళి రోగార్తయయ్యె
మరణశయ్యనధిష్ఠించె సరగనీవు
బయలుదేఱియే తెమ్మని వచ్చెజాబు.

గీ. దానిఁబఱియించి తూచాలు దప్పకుండఁ
బిల్లవానిపగిదిఁ బెద్దపెట్టుతోడ
నేలపైఁ బడిపొరలుచు చాలసేపు
దాఁకనేడ్చితినాపసాధ్యంబుగాక.

గీ. నైళమే సింహళమునుండి బయలుదేఱు
నావనెక్కి నిరంతర భావడోల
హృదయమునూయ్యాలలూఁగంగ నేఁగినాఁడ
నెంతలో వెళ్ళితినో నేనె యెఱుఁగనైతి.

మ. మురళీ! నీదగుతల్లిదండ్రుల మతంబుంగాలితోఁ నెట్టియె
వ్వరిఁబెండ్లాడక ఖిన్నమూర్తినయి దౌర్భాగ్యస్వరూపంబనన్
దురవస్థంబడియెంతగ్రుస్గితివో? సంతోసంబునోఁద్రోలినా
కొఱకేఁగా? యిదియెంత నాధనము! నాకుందక్కితేఁ గ్రమ్మఱన్

శా. నాయర్థాంగమునాయదృష్టఫలమున్ నాజీవనాధారమున్
నాయానందసుధాసరిల్లహరి, నానందివజ్యోతి, నా
శ్రీయుక్తంబగుభాగ్యరేఖ మురళీశీతాంశుబింబాస్య క
ట్టా! యీనాకొఱకేనొకో! మరణశయ్యారూఢయైయుండఁగన్.

కం. అనిలోలోపలఁగొందల
మునుగొనుచున్నావడిగ్గి పోయితి మురళీ
జనకుఁడున రేంద్రునింటికిఁ
జనిపోయినవాఁడువచ్చు చందము మెఱయన్.

గీ. అమ్మ! యీమధ్యకాలంబు నందుమిగుల
నద్భుతంబైనయొకగాధ యచటఁజరిగె

దానిఁదలఁచినమాత్ర హృదయముబ్రద్ద
లగును విస్మృతిపాటు కలుగనుగడిఁది.

మ. మురళీ! చంద్రముఖీవివాహ మది లేపో! మాపో! కానుండె నె
ల్లరువిచ్చేసిరి బంధుమిత్రులు గృహాలంకారముల్ పెక్కు సే
సిరి పండ్లుం బసుపుం దొడంగులు వాసిం గట్టిరంతన్ హఠా
జ్జ్వరరోగార్తగ నయ్యె నా తరుణియాశల్ తూలఁగాఁజేయుచున్.

సీ. నెత్తమ్మిపువ్వులో నెయ్యమాడు మొగంబు
కళలూడ్చి దుష్ప్రతికళ వహించె
నవమృణాళముల విన్నను వొప్పు కరములు
గుడ్డపేలికలలాగునఁ జెలంగె
మెఱుపుతీవియవోలె మెఱసిన యొడిమేను
ఎలిచెడిపోఁక పుల్లవలెనుండెఁ
గెంజిగురాకు నాఁ గ్రాఁజిగిఁడగు మోవి
వాడివత్తయి ధవళితమయ్యెఁ

గీ. గనలు గుంటలుపడెఁ గనఁగాఁ బట్టు
లేక జబ్బుపడినయట్టి లేటిపిల్ల
వలెనుమంచములోనుండి ప్రాణములను
మాత్రవదలకయుండె నామిత్రురాలు.

సీ. మధుమాసమునయందు మందమారుతమందు
సలిలతచంద్రికాజాలమందుఁ
గోకిలకాకలీ కోకోరవములందుఁ
బ్రాంతపుష్పోద్యానభాగమందు.

జాతీలతానికుంజప్రాంతములయందు
రమణీయపుష్ప వర్షములయందు
సకలజనానంద సమయంబులందున
లీలాలతానేకవోలలందు.

గీ. సహాహా! సీతోడఁగూడ వాహ్యాళికేఁగ
మాటలాడంగఁబహుళసమ్మదమొసఁగఁ
దూఁగుటుయ్యేలలూఁగ సంతోషమయ్యె
బావ! రావోయినాకయిఁ బ్రణయమంచి.

వ. అని యొక్కతెడవయు.

శా. బావా! సుందరమందహాసరుచిబాభాసంబునున్ మన్మనో
భావగ్రాహకదర్పణంబు ప్రణయప్రాగ్భారదృగ్భారముల్
శ్రీవర్చస్కకలితంబు మంజులతరమాశీతాంశుబింబాభమా
నీవక్త్రంబునుజూపిసమ్మదము సంధింపంగదోయీ! సఖా!.

వ. అని యొక్కసారియు.

ఉ. ముచ్చటలాడుచుల్ మృదుళమోహనగీతులుబాడుచుల్ సమ
భ్యుచ్చయసౌహృదయ్యకసపూర్ణకటాక్షముపై నిబర్వచుల్
అచ్చికబుచ్చికల్ సలుపు చయ్యెడహాయిగనుందుఁటంచునే
ముచ్చటఁబొందితిల్ సకలముల్ మొదలంటనశించెఁగాసఖా!.

వ. అని యొక్కసారియు.

కం. శ్రీశా! శ్రీశా! రావో
యీ! శీఘ్రగతిఁబ్రణయమహితమతి నన్నా
దేశమునకుఁగొనిపొమ్మా!
యీశిక్షలునాకుమాత్ర మేలా! యిచటన్.

కం. అనిపలవరింపఁబలుమఱు
జననీజనకులును బంధుసమితియుమురళిం
గని "యేమ" దియననాశ్రీ
శునివదనంబొక్కసారి చూపింపుఁడనెన్.

గీ. కనులుదిరుగుచునున్నవి కంటకములు
వలెశరీరమునంబుట్టెఁ బులకములును
ఎలుఁగురాసెనుజననిరో ! యిప్పుడనుచు
హృదయవిశ్రాంతి కైయాతఁ డించుకాఁగె.

ఉ. పాపము! తత్తపస్వినికి బాష్పములూరెనుగన్నదోయి నా
సాపుటమందునిశ్వసితజాలముఁదన్స్ఫురణంబుకల్గె సం
తాపముహెచ్చెమేన వదనంబుకళాపరిహీణమయ్యె నా
చూపుసశూన్యమయ్యెనొకచొప్పుననుండెనుశ్రీశుఁజూచుచున్

వ. తిరిగియాతఁడిట్లు చెప్పఁదొడంగె.

ఉ. ఇంటికిఁబోవునప్పటికి నెల్లరుబంధులు కౌఁగిలించిసం
గంటనుసీరువెట్టుకొని గాటముగారుదితంబుసేసిరా
వెంటనెవారినూర్చియతివేలమ్మనుపత్రిణయుపత్రిసక్తిమై
గొంటఁగనామసంబు బరికింపఁగఁబోయితినామనోహరిన్.

శా. కానీ, ద్వారముదాఁకఁబోవుసరికిన్ ఖట్వాప్రసూనాఘమై
నానాబంధుభిసత్పరీవృతయునై నష్టస్వసౌందర్యయై
ప్రాణాపాయనసూచకాకృతికయై యామ్లానపుష్పంబునై
కానంగాఁబడెనాసమస్తముగునాకంజాక్షి కందోయికిన్.

కం. నడవఁగనడుగులుగదుగదుఁ
+ దడబడ, వడవడ వడఁకఁగఁ దనువుంగూలం

బడిలినిఁజడిముడిపడుచుం
గడిచెనోయిరవయెనఁదరోడఁ గటకట ! యచటన్.

ఉ. మెల్లఁగ లేచి మంచమునసమీపముఁజేరితి,నన్నుఁజూచి యా
హల్లకపాణి దిగ్గుపడి హస్తముజేర్చి శనైశ్శనైస్స్మితిన్
అల్లనలేచిమంచమునయందుపవిష్టగనై కడింది నా
యుల్లముజల్లుమంచఁగ నొయ్యన నాపయిదృష్టిఁబర్వుచున్

శా. ఆనందాశ్రులురాలమెల్లమెలఁగా హస్తాబ్జముంజాఁపినా
పైనిన్ వేసియువెచ్చనూర్చుచును బావా! వచ్చినావా! ననుం
గానంగాఁబ్రియవృత్తి, నాజ్వరము భగ్నంబయ్యెనిక్కంబుగా
నేనీరోగిణినైతి నీదనమునన్ నీదర్శనప్రాప్తిమె.

శా. బావా ! తావకదర్శనౌషధ ములభ్యంబౌటనిన్నాళ్ళునే
చేవంబాసిరుజార్తిఁగ్రుస్సితిఁగదున్ సిద్ధించె నాకోర్కె నా
దేవీపూజఫలించెనీదినము సందేహంబు లేదీవెనా
జీవానందమనన్ మహామహితరాశీభూతభాగ్యంబనన్.

సీ. భవదీయసౌహార్దాపాంగవర్గములేమి
మామకతనువల్లి మాడుచుండెఁ
దావకీనమనోజ్ఞదర్శనంబులభింపఁ
జాలమిన్నక్షులు జడములయ్యె
భావత్కమృదుకలభాషణంబులు లేమి
శ్రవణరంధ్రములు స్వశక్తిఁ బాసెఁ
దావకహస్తలతాస్పర్శనములేమి
హస్తయుగ్మంబు ప్రశస్తిఁబాసె

గీ. నిన్నియును నొక్కపరి లభియించినాకు
సర్వలోపములందీర్చి సంతసంబు
నిరతిశయముగఁగలిగించె నిజమునేఁడు
హాయిగానుండె నాప్రాణ మోయి! బాల!.

ఘ. అనిరుద్ధప్రహ్వపుణ్యాళినాళలతికాహారంబు నాకంఠసీ
మను వ్రేలాడఁగఁజేసి ప్రేమభరసద్భక్త్యమానారసం
క్తినివర్షించుచు వెల్గుఁగొన్న యమునాకన్నీడఁగాలేకదా
పుఁగూర్చుండమొగొంతిసేపనమునఁ పుష్పంబోఁడెపల్కెన్ స్వనన్

గీ. నామనోహారిణీ భాషణముల నాహృ
దయము భిన్నమైపోయె నేత్రములుతిరుగఁ
జొచ్చె దలయూఁడఁబోపు చొప్పునతి
భారమగుబాధకలిగె నస్వస్థమందు.

సీ. కాలసర్పస్ఫటాకల్పభీష్మోత్తుంగ
భంగిచ్ఛటలనుండి బయటఁబడుట
తన్మృత్యుదశనాగ్నికంఠచ్ఛిద్ర
తుల్యభ్రమమునుండ తొలఁగిచనుట
ప్రేతరాజక్రూరప్రేనామాగ్ని
కింకిలాదులనోళ్ళ మెలఁగకుంట
ఘోరనారకమహాకూపసమధ్వాంత
గృహమునందునుండి యివలఁబడుట

గీ. కష్టసంతానమున జేసి కాఁడుపడుచుఁ
బడుచు లేచుచు నీగతిఁ బ్రతికియుంట

మురళీ! శ్రీనిర్మలానందమోహనంబు
త్వన్మృదుప్రణయప్రభావమునఁ జూపె!

మ. మురళీ! మామకదివ్యభాగ్యలహరీమోహాల్లసద్దీపికా
కరమా! మన్నయనామృతాంజనమ! నీక్రూరాత్ముఁడన్ నిన్నుదు
స్తరదుఃఖావిలఘోరసాగరము మధ్యం ద్రోసితిన్ నీదు ద
గ్గఱనింకేమని మోము నెత్తుకొని పల్కన్నేర్తు నిర్లజ్జమై.

గీ. ఈడుజోడైన పడుచుల తోడఁగలసి
ముద్దుముచ్చట్లఁ జూపుచు మురిపెములను
గఱపుచు మెలఁగుచుం దలఁచితిఁగాని కష్ట
ములఁబడెదవని కలలోనఁ దలఁపనైతి.

ఉ. నీకలిదంప్రభేదర్చనరసన్ నెరయించి వివాహమాడి హృ
త్ప్రీతిగ బంధజాలమునఁ బేరుప్రతిష్ఠలనుఁగ్రహించి సా
ధ్వీతిలకంబవై చుఁ బృథివీతలమందెసలారుదఁచు నెం
తేతలపోసినాఁడఁనది యిల్లయునయ్యెనుదారుమారగన్.

శా. బాలా! బాలకురంగిపోలెఁగరమున్ భాసిల్లుచున్ సర్వదా
లీలాఖేలనలోలబుద్ధివయి హృల్లీనప్రమోదంబునన్
హేలాదృష్టులనల్లడల్ నిగుడఁ బర్వెత్తంగ నిఁజూచిము
న్నాలోకింపఁగనేఁడు వేఁడయిన నిర్వైపోవఁడే నిల్వునన్.

కం. అనినేనబులుకుపులుకునఁ
గనులన్ బాష్పములురాల గాఢప్రణయం
బునఁ బలుకఁగనా మురళీ
వనితామణి నన్స్పృశించి వచియించెనిటుల్.

క. బావా! సర్వం బెఱిఁగిన
నీ వేదుఃఖింతు వేమి? నేఁడే స్వాస్థ్యం
బావిర్భవించె నాకుం
గావున విశ్రాంతిఁ గొనుము గతదుఃఖమతిన్.

చ. అనితల దిండుపై నునిచి హస్తము నొక్కటి యుంచి నాపయిం
గనుఁగవ మూసి శాంతమతి గాఢముగా నిదురించె నప్పుడా
వనిత మహానిదాఘబహువాతయుతాతపతాంతయై ఘనా
ఘనజలసేచనంబున వికాసము నొందిన వల్లి నాఁ దగెన్.

ఉ. పొందికలేని వాగుడులు పుట్టినగాధలు లేనిపోని యూ
క్రందము లట్టహాసములు క్రన్నన ముంచ ముముండి లేచుటల్
గందరగోళముల్ దొలిసెఁ గాంచఁగ నూత్రిసుపింబి శాచికా
బృందము వోలె నన్నుఁ గను వేగ మెత్రీముకళీల తాఁగికెన్.

ఉ. ఆవసనంబు క్రాలఁగ సమస్తకళాపరిపూర్ణమాకర
చ్ఛ్రీవిధుబింబమట్లు ధరసీముఖమందున మందహాసముల్
నా వెలుఁగొందుచున్న సుధ నానయనాంజలిఁ గ్రోలిక్రోలి నా
జీవితమింక శాశ్వతము శ్రీమురళీతరుణీసహాయమై.

క. అనిలోలోపల ముప్పిరి
గొను సంతోషమున నచటఁ గూర్చుండఁగ నా
య్యన మామ నరేంద్రుఁడు
చనుదెంచి కవుంగిలించి సాదరమతియై.

శా. అన్నా! శ్రీశమహాశయా! కడుదురన్యాయంబుగా రోసితిన్
నిన్నున్నీ యెడఁ దప్పుమై మసలితిన్ ద్వీపాంతరప్రేమమిం

కెన్నోకష్టములందుఁద్రోసితిని నన్నెల్లన్ క్షమింపంగదే!
చెన్నారంగనునాదుపట్టిమురళిన్ జీవింపఁజేయుంగదే.

కం. నాప్రియకన్యారత్నము
నాప్రాణపదంబు నీప్రణయమూర్తియిదే
నీప్రాణపత్నిగాఁగొని
సుప్రీతిని మాకుఁగూరుచుమ! సతతంబున్.

ఆ. వె. వెండిగిన్నె గోరువెచ్చనిపాల్పోసి
పంచదారవేసి పట్టుమనుచుఁ
జేతికిచ్చుచుంటి జిహ్వాకురుచిగాఁగఁ
జేసికొనెదొ? నేలఁ బోసికొనెదొ?.

మ. అనుచున్ మామకపాణియుగ్మమును హస్తాబ్జంబులంబట్టిచుం
బనముంగైకొని సంస్పృశించిచిబుకప్రాంతప్రదేశంబు మె
ల్లననావీఁపుఁగరంబుతోనిమిరి యాలక్షించి ప్రేమప్రకా
శనపూర్వమ్ముగమాటరాకనిలిచెన్ స్తంభించివ్యగ్రాంగుఁడై.

ఉ. ఆవలనాఁటిప్రొద్దుటన యంబుజలోచన గేహసీమ స్వే
చ్ఛామతి లేచితాఁదిరుగఁ జాలినదానినిఁజూచియెల్లవా
రేమిది? వ్యాధియెల్లనశియించెను శ్రీశునిఁజూడనంచునే
మేమొ? సమున్నతప్రణయ వృత్తినిఁగూర్చివచించిరమ్మరో!.

శా. ఆనాఁడేమురళీలతాంగియును వల్దంచున్నివారించినన్
స్నానంబాడివిశుద్ధవస్త్రయయి పూజంబూర్తిఁగావించియుం

దానైకమ్మనితావినల్గడలఁ జిందంజేయు కత్తత్పదా
ర్థానీకంబునుచుండె నాకొకయు బ్రహ్మానందముం గూర్చుచున్.

సీ. కమ్మననేతిలోఁ గాల్చి పేల్చినకర
కరలాడు కూరముక్కలనుగొన్ని
కొత్తిమిరి మొదలగు నవిచేరిచినస
పడనూరిబెట్టి పచ్చడలుగొన్ని
పరిమళద్రవ్యసంభరములై చవిగూర్పఁ
గలపంచదార లడ్డులనుగొన్ని
సేవియల్ మొదలుగాఁ జెన్నారుమధురపే
యములై నమృతపాయసములుగొన్ని

గీ. అప్పడాల్గొన్ని బెని వడియాలుగొన్ని
చారుపులుసులునోరెంబు జక్కపఱచి
వెండికంచంబులోఁ గూరుచుండనాకుఁ
పీఁట వేసినా ముంగటఁ బెట్టె మురళి.

గీ. అపుడు నేనా పదార్థంబులందలి రుచి
గంటిఁ బదివేల రెట్లధికముగ రుచి క
లిగిన తన్నేత్రియుగ మండలీకటాక్ష
మాలికామృతధారలు గ్రోలినాఁడ.

కం. ఏమో! కానీ, మురళీ
భామామణి యింటఁ దిరుగుపట్టున మురళీ

భూమికిఁ దాల్చినపేరితం
బేమో! నాకింగూ భయముదయించె నామనసులోన్.

మ. మురళీ! నీకవిత న్ధరిత్రి కెచ్చనగున్ గాంచి త్రివీక్షింపకే
జ్వరరోగాగ్నిని కాలిన ట్లుగు పుష్పంబట్లు సౌందర్యవి
స్తరసౌభాగ్యవిలాససంపదలు నాశంబొంద గర్వమ్ముగా
కొలికే గాముదింగుచుంటివి మహాగాఢానురాగమ్మునన్.

మ. మురళీ! నేన మహాకళంకమతినై మూర్ఖుండనై పాపినై
తరుణిన్ ముగ్ధమనోహరాంగి నిను దగ్ధస్వాంతఁ గావించియు
త్తరుణిన్ సింహళదేశమేఁగితిని గాదా! యింతకంటెన్ మహా
దురితం బెక్కాగాని యొందుఁగలదే? దోషంబు సైరింపవే!

మ. అహ, బావా! మన ప్రేమబంధములు దా ... ట్టెనో! దానివ
ర్తన తెవ్వారొ? తనే యువాస్తవిక తత్త్వంబెట్టిదో? గట్టిగా
గనఁగా దైవము గోలఁ దలంచి యుటులం గల్పించి యున్నట్టులో
చను లేకుండిరె గల్గునే? తిరిగి యిచ్చోటన్ సమావేశముల్.

గీ. నీవుచేసిన దేముండె బావ! నీవు
మాత్ర బుద్ధిపూర్వకముగా మనల ప్రణయ
బంధముం ద్రెంచి లేచిపో వంగఁదలఁచి
నావె? బలిమి నంపెనుగాక నా జనకుఁడు.

చ. అనివచియించి యామురళి యంతటఁ గొంచియు మూరకుండియా
వనదశ తద్రహస్థలము బాంధుకతత్ప్రియమాపరిచారభా

వణములవెల్లఁ జిత్రజలజంబౌకరీతిగఁ జేసెనేమొ? యొ
య్యనఁబరుగెత్తిపోయె సదనాంతరభూమికి జవ్వజవ్వనన్.

ఇది

సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిచే రచియింపఁబడిన

మురళి యను ప్రబంధంబున

ద్వితీయాశ్వాసము.

## తృతీయాశ్వాసము.

సీ. మృదుళతరదళశిరీషపుష్పంబును
దద్గతమంజులత్వంబునుండి
పర్యాప్తకాంతివిస్ఫారరత్నంబును
దద్వర్తిదీప్తిబృందంబునుండి
సారరసాధారశర్కరాఖండంబు
తద్భక్తసుమధురత్వంబునుండి
శీతలచంద్రికాత్రాతయుతేందువిఁ
దన్నిష్ఠసాంద్రశైత్యంబునుండి

గీ. సహజగాఢానురాగప్రశస్తమతుల
నొక్కదాని మరొక్కటినుండి కడఁక
న్యాయమార్గంబుపాసి భిన్నములుసేయఁ
దెలుపుమోతల్లి! భగవదుద్దేశమేమొ.?

గీ. అకట! ఆనాఁటిమధ్యాహ్నమందుఁగూడఁ
దోడిసఖురాంద్రతో మాటలాడికొనుచుఁ
గొంచెమాయాసమొందినయంచున్నదన
పట్టెమంచముపై నెక్కి పండె మురళి.

చ. కనుఁగవమోడ్చిశాంతముఁగ ఖట్వఁబరుండి మనఃప్రహర్షసం
జనితతనూలతాపరవశత్వముచే నతిగాఢమైన ని
ద్రనువహించెనో! యనుచు భ్రాంతిజనింపఁగ నల్లవారికిం
గనులనుబ్రామిప్రాణములు కైకొనిపాఱెనుమింటివింటికిన్.

కం. మురళీ! మురళీ! యంచును
మురళీదనయుఁడార్తి హస్తమునఁ దట్టఁగనా
మురళీదేహం బకట! య
త్తఱి నెండినయొక పుడకవిధంబునఁ గదలెన్.

గీ. గగనమున తిప్పతిప్పన నెగసిపోవు
పతగసంచయ మట్లాపె ప్రాణవాయు
గణ మనంతనక్షత్రమార్గమ్ము వట్టి
యగపడక వేగముగ దూరమెగసిపోయె.

శా. తల్లిదండ్రులుదొట్టియెల్లరసమాప్తవ్యోథదుఃఖాగ్నికి
లోల్లీఢాత్మశరీరవల్లులయి యయ్యో! యింకనేముండె మా
యిల్లేకూలెనుమాసమస్తమునుఁబట్టెటంగటా! చేరె మా
తల్లిఁ జూడఁగలట్టిభాగ్యమిఁక లేదా! మాకునీజన్మకున్.

మ. అనువాక్యంబులు తద్విరుద్ధరుదితవ్యాగ్రక్షురశ్రేణులై
వినఁగా రాఁగ మదీయకర్ణములకున్ వేవేగ నేఁ బోయి యిం
గనఁగా నేమియుపద్రవంబొ! యనుచుం గానీ కనంగం దప
స్వినిరో! మామకజీవనవ్రతతియే ఛిన్నంబు చేయంబడెన్

గీ. ఇంతదాఁకనలుగురితో నిచటనచట
మాటలాడుచుఁ గూర్చుండెఁ దేటఁబాఱి
యింతలో నెంతగా రోగ మెక్కువయ్యె
నక్కటా! యంచుఁ బలవించి రంతమంది.

కం. ఆవట్టికట్టెపైఁ బడి
బావా! యనినన్నుఁ బిలువవా? దగ్గఱకున్

రావా? యీగతినన్నుఁ
జీవన్మృతుఁజేయనీకుఁజెల్లునె? మురళీ!

సీ. ఆఁపఁగారానిమహారోదనారవం
బులచేతజనని! నాయెలుఁగురాసె
సంతతబాష్పవర్షమ్ములచేతనా
కన్నులుకాయలుగాచిపోయె
హృదయంబుబ్రద్దలయినగతిఁగాడ్పడి
ఘోషించుకతమున శోషవచ్చె
ఉద్ధతమైననిట్టూర్పుగాడ్పులచేత
నాతనుస్వాస్థ్యంబునాశనమ్మె

గీ. మురళిమోమున నాదగుమోముఁజేర్చి
గట్టిగానాపెఁగేల్దోయిఁగౌఁగిలించి
యకట! యీవట్టికట్టెపై నాసవిడిచి
పోకదానిపైఁబడిమూర్ఛపొందినాఁడ.

కం. ఆమూర్ఛాదశనుండఁగ
నామురళిని నాదుజీవనము నాబందుల్
తామైకొనిచనిరిఁకనా
కామురళీభస్మరాశి యాశ్రయమయ్యెన్.

గీ. ప్రాగ్దిశాతటమున బాలభాస్కరుండు
ఉదయమయ్యెను వలిగాలిపొదలుచుండెఁ
బద్మినీలత హిమబాష్పవారిఁదుడిచె
మొగముఁనందునలేనవ్వుమొలకలెత్తె

సరసపరిమళాసారప్రసారణములు
కొమరుమీఱ నష్టదిక్కులగుబులుకొనెను
తేటఁబాఱెను గాసారతీర్థజలము
దానిమధ్య నానందసందాత్రివోలె
శ్రీవిభూతిని నిందిరాదేవివోలె
నమలకాంతుల కలిమి లేయంచవోలె
సొబగుగానుండెనని వినిచూడఁదలఁచి
వచ్చుచుండంగ నింతలోపలన యకట!
గంధవారణమొక్కండు గనులుకుట్టి
చూడలేకతటాలునఁ జొచ్చిసరసు
పద్మినీలతమొదలంటఁ బట్టిత్రుంచి
చెలఁగిచిందరవందర చేసిసరసు
తేటనీటినిఁగలఁచియుద్రేకమునను
ఫూత్కరించుచుబృంహితములొనరుచుచుఁ
జూచువారలకెదభయస్ఫూర్తికదురఁ
దిరుగుచుండెను గటకటా! దిక్కఁకేమి?

వ. అనియును.

గీ. వ్రేలితోఁజూపినన్నునీబాలుఁజూచు
కొఱకెజీవించియున్నదీ మురళియింత
దాఁక,నాపసితీఱుఱుతనదుదారి
దాను జూచుకొనితటానదాఁటిపోయె.

కం. అనికంటనీరుపెట్టని
మనుష్యమాత్రుండునాకు మందునకైనన్

గనఁబడలేదు ననుంగని
జననీ ! యేమనుచునూర్పుఁజాలెను చెపుమా !

గీ. జనని ! మామకరాట్కిరశాబమధుర
వదనవాక్యావళీమద్యపానవశత
మత్తతంగొననొకడేగ మహితపక్ష
వాతములదానిఁగొంచునుబాఱుతెంచె

గీ. కటకటా ! మాలదైవంబు కరుణమాలి
కండ్లలోఁగారముంగొట్టి గడియలోనఁ
బ్రళయకాలంబొకంచుకల్పనముచేసి
తారుమారొనరించెనేతత్సకలము.

శా. దేవీ ! లోకముతారుమారయిన రీతింబోఁ చెసర్వమ్ముచే
జీవింగాంచినఁగానియక్కటకటా ! చెల్వంబుగోల్పోయి దుః
ఖావేశంబుననావలెందిరుగుచు న్నట్లయ్యెమిన్నిక్కలిన్
ద్యావాభూములయందు రేఁగికొనె హాహాకారసంరావముల్

కం. ననుఁగనివిశ్వము విశ్వం
బునుగని నేనేడ్చుచున్న పోలికయయ్యెన్
జననీ ! యేమున్నదినా
ధనమపహరియించె దొంగ తాలిమియున్నే?

గీ. అమ్మ ! బాంధవ్యసంబంధమది దెగినను
ప్రణయబంధంబుబొందిలోఁబ్రాణముందు
దాఁకఁదెగనిదికావుటఁదత్త్వమరసి
యాపెభస్మరాశికడకునరిగినాఁడ.

గీ. చేరియాభస్మరాశిపైఁ గూరుచుండి
యెలుఁగురాసిననాద్దైన గళముతోడఁ
బలుకలేకున్న హృదయంబుకలఁతపెట్ట
నస్ఫుటంబైనమాటలనంటినిటులు.

గీ. లలితలతలార! చూతపల్లవములార!
బాలకుంజంబులార! చంపకములార!
పుష్పమంజరులార! నామురళినాదు
చిలుకమొకరినినొకసారి పిలువుఁడయ్య!
అందచందాలపుట్టినిల్లైనయావ
సంతకాలంబు వచ్చె రసాలపల్ల
వములనాకంఠముగమెక్కి బలితములయి
చెలఁగి వలరాజునకుఁ బరాకులునుడువుచుఁ
గండుకోయిల కొమ్మపైఁగూరుచుండె
భ్రమరవిద్యార్థిసంతతి ప్రసవములకుఁ
బోయి మధుభైక్షములనెత్తి పుష్పధన్వ
శాస్త్రమభ్యసియించెడు చందమునను
దిరుగుచున్నవి యానందకరములగుచుఁ
దోడిచెలికాండ్రు జవరాండ్రతోడఁగలసి
పూలనిండినతీఁగెటుయ్యాలలందు
నూఁగుచున్నారు నామనంబుత్సహించె
నేనుగూడనుమురళితోనిందుఁగూర్చిఁ
దూఁగుటుయ్యాలలూఁగనుత్సుకతఁగొంటి

నొంటిరిగనూఁగఁ గాఁజాలనొయ్యనొయ్యఁ
జెలిమిమైనాదుమురళిసిఁ బిలువుఁడయ్య!

కం. అనినేనువానివానినిఁ
గనియుఁగఁగ నవ్వియల్లఁ గనుఁగొని మదవ
స్థను నిశ్వసించిన తెఱం
గుఃపీవఁగనొక్కగాలి కొంచెముమగుడన్

వ. ఇట్టు పలికె.

గీ. బాలుఁడా! యింతగందరగోళమేల?
పోదె చెప్పెదవది కంతశోషగాని
నీచిలుక మొకరి పలుక నేఁదిప్పుడు
స్వర్గమందిరమందు స్వస్థముగ నుండి.
నందనోద్యానవనసీమమందు రమ్య
హర్మ్యభర్మడోలాందోళనాంగనామ
నోజ్ఞహస్తాంబుజములవినోదమధుర
భాషణములాడి సంతోషపడుచుచుండె
దానిజాడనుగనిపెట్టనౌనె? నీకుఁ
జాలుఁజాలునువేమాటలేల? యింకఁ
బొమ్మునీవొక్కఁడవయాపుకొమ్ము శ్రీశ!

వ. అనిప్రత్యుత్తరించనేనుదిరిగివానితోనిట్లుపలికితిని.

గీ. రమ్యవృక్షప్రవాహతీరములయందు
మంజుమంజరిపుంజనికుంజమందు
వాలుకాపుళినంబులజాలులందు

బాలతృణసముజ్జ్వలితశాద్వలము లందుఁ
జారుమాకందభూరుహచ్ఛాయలందు
జలజపరిమళయుతసరస్తటములందు
సరసవాసంతరాత్రులసమయ మందుఁ
జంద్రమస్సాంద్రచంద్రికాజాలమందు
మందసురభిళమారుతబృందమందు
మావినోదఖేలనములుమఱఁగెనో క్కా !
మావిహారంబులన్నియుమ్రమం డెనో క్కా !
మాప్రచారంబులన్నియుమ్రగ్గెనో క్కా !.

మ. అకటా ! శ్రీమురళీహసన్ముఖము మాయావిద్ధచైతన్యమో !
స్వకళానాశగతేందుమండలమొ! నా సమ్యక్త్వముం బాసి భ
స్మకదంబంబయి మృత్యుదేవతకు సన్మానార్థమై యిచ్చెగా
నికమైవిశ్వముమాఁటుచేసెనె వర్ణింపంగ రాకెన్నఁడున్.

గీ. నామనోహరి దుర్మరణంబుఁబొంది
భస్మసాద్భూతమైనను వదలలేక
వచ్చియాభస్మరాశిపైఁ బ్రణయకలన
వ్రాసినాఁడ నీయక్షరపంక్తివితతి.

మ. మురళీ! మత్ప్రియయావనీజశుకమా! పుణ్యంబునం జేసి యె
వ్వరుఁ బొందంగనశక్యమైనపత్రికటస్స్వర్గస్థలీస్త్రీణ సుం
దరహస్తాంగుళివల్లరీతతుల నానందంబునం జేరి దు
ర్భరసంతోషముఁగూర్పఁబల్కెదవు నీభాగ్యంబుసామాన్యమే!

మ. మురళీ! నీవువినా ప్రపంచమునఁ బొల్పుంగాంచుపూఁబోఁడులె
ల్లరు మువ్మాటికినమ్ము! నాదుజననుల్ నాయప్పసెల్లెండ్రు నా

గురువుల్ నాకులదేవతాగణము నాకుఁ సేవ్యులై యుంట వి
స్తరభక్తిస్థిరవృత్తి వారికి నమస్కారంబుఁగావించెదన్.

వ. అనిలిఖియించి

కం. శివ! శివ! జీవచ్ఛవమై
భువినుండుటకన్న మరణముంబొందుట యె
క్కువమేలని యుత్రాడుగ
లవలీలత మెడఁబిగించి లాగుచునుండన్.

గీ. వలదు! వలదోయి! బాలుఁడా! వలదు! వలదు!
ఆఁగుమిదెవచ్చుచుంటిని వేగపడకు
అనిపిలుపుపైఁబిలుపు పిలిచినకతమున
నెవఁడో? యనివానిఁగనఁగమోమెత్తినాఁడ.

గీ. అపరశంకరపాదులోయనఁగఁజేయు
నొక్కసన్న్యాసి యేతెంచి ప్రక్కనిలిచి
చేతితో వెన్నునిమిరి వచించెనిట్లు
ఆత్మహత్య మహాపాతకాస్పదంబు.

గీ. బాలుఁడా! యేలయడియాసపడెదవీవు?
కర్మబంధంబువలన సౌఖ్యములుకాని
దుఃఖములుకానియగునవి దూలిపోవఁ
బులుగడిగినట్టి ముత్తెమువలె నెసఁగుచుఁ
జిత్తశాంతిని వహియించి జీవుఁడమల
పటుతరానందడోల లోపలన యుండి
యూఁగుచుండును గాన వియోగభరము
నాఁచికొని జీవతత్త్వంబునరసికొనుము.

వ. అని జ్ఞానోపదేశంబు ప్రసాదించిపోయె.

గీ. నాఁటఁగోలెను నేను సన్న్యాసవృత్తి
స్వీకరించి విరాగినై చెదరఁగొట్టి
ద్వంద్వసందర్భములు జీవతత్త్వసార
మరసికొంచును సకలంబుఁదిరుగుచుంటి.

గీ. "జననిరో! నాయభాగ్యజీవనవిషాద
గాథవింటివా? యిది" యనికనులనీరు
నింపఁగా శ్రీశుఁడుతపస్వినియుఁగడింది
యూర్చి నిర్విణ్ణయై యుంగలార్చుచుండె.

గీ. శ్రీశుఁడంగదతోడవచించినట్టి
కథ నితిశ్రీగవిని ప్రభాకరుఁడు కూడ
ఘోరదుఃఖాంబునిధిమధ్యఁగూలెననఁగ
బశ్చిమాంభోధిలోఁ పలఁబడియెనపుడ.

గీ. కొంతసేపటికి వారుగొండలంబు
మాని యంకిలిదేఱిచి మానసములు
సాంధ్యకృత్యనిర్వర్తనసమయమగుట
వెడలిపోయిరితచ్ఛిలావేదినుండి.

గీ. ప్రక్కఁబ్రవహించునలకొండవాఁగులోని
యచ్ఛనీరంబులందు నీరాడివార్చి
పూసి దేవాలయమునకుఁ బోయిరంత
దేవసందర్శనముచేయుభావమునను.

గీ. ఆతపస్వినిఁగూడి తదాశ్రమంబు
నందె శ్రీశుండు గతగాథ నంతమఱచి
బ్రహ్మనిష్ఠాగరిష్ఠుఁడై ప్రకృతిబంధ
ములవిసర్జించి బ్రహ్మసాద్భూతుఁడయ్యెఁ.

ఇది

సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిచే రచియింపఁబడిన

మురళి యను ప్రబంధంబునఁ

దృతీయాశ్వాసము.

మంజువాణీ ముద్రాక్షరశాల, ఏలూరు.

సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిచే రచింపఁబడిన

గ్రంథములు.

1. కుమారి. 0—2—0

2. మురళి (ప్రబంధము) 0—8—0

3. మరాళి (ఖండకావ్యము) 0—4—0

ముద్రణమందున్నవి.

1. కృష్ణాభ్యుదయము (శ్రీనాథునిశృంగారనైషధమునుబోలు నది. ఇందు చమత్కారములయిన కౌముదీప్రయోగములుగలవు. 6 ఆశ్వాసములు. 1000 పద్యములు.

2. శతశ్లోకి. (సంస్కృతము)

3. లవలి. (నిర్యతిప్రాసము.)

# శుద్ధపత్రము.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 5 | ఒకనాటి | ఒకనాఁటి |
| 11 | 15 | చెటు | చెట్టు |
| 13 | 2 | మురళినిగూడి | మురళినిఁగూడి |
| 16 | 2 | పుష్ట | ప్లుష్ట |
| 17 | 7 | లతాచ్చద | లతాచ్ఛద |
| 17 | 22 | గటుచుండ | గట్టుచుండ |
| 32 | 3 | నాటి | నాఁటి |
| 54 | 13 | గూరుచుండె | గ్రాలుచుండె |
| 56 | 13 | మాఁటుకొని | మాటుకొని |

సీ. ఎవ్వాని మందిరం బిందిరాంబకుం బటు
క్రీడాసమారంభ గేహభూమి
ఎవ్వాని కరముదఃపృథివీసమారూఢ
కమనీయబృందారకల్పశాఖ
ఎవ్వాని కీర్తిబంహీయఃప్రదీప్తిన
భోవీధికాసరఃపుండరీక
మెవ్వాని సద్గుణబృంద మంభోధిసం
భృతభంగచ్ఛటాభూతికమ్ము
గీ. ఎవండు విబుధజనవిధేయుండెవండు వైశ్య
బృందహారనాయకమణి యెవండు ప్రథిత
విమలమాజేటివంశాబ్ధివిధుండతండె
సరసతకుందావు మారామచంద్రరావు.



# మరాళి.

కం. అనఁగనఁగానొకక్షత్రియుఁ
డనఘుఁడు కలఁడాతఁడొక మహాకాంతారం
బునఁబోవుచు మధ్యేధ్వము
జనితశ్రముఁడై పరుండె తన్మ్రుజచ్ఛాయన్.

గీ. ఎచటినుండిబయలుదేఱి యెచటకేఁగఁ
దలఁచెనోకానియాతండు దెలియరాదు
కట్టుబట్టపై కండువా కరమునందు
వెండిపొన్నుకర్ర వినాగ వేఱులేదు.

గీ. నడచినడచిబడలికచే నడవలేక
నెత్తిపైఁదలగుడ్డను మెత్తఁజేసి
చేతిదండనుగలదిండు సేసికర్ర
నికటమునునుంచిగాఢంబు నిద్రపోయె.

చ. అతనిమొగంబుచూడఁగ మహాకమలామహీళాకళాసము
ద్యుతితముకాఁగఁదోఁచెడిని యోజనచేయఁగ నాతఁడేటికి
గతిఁబడియుండెనో! గహన కాననసీమను దారితప్పెనో!
మతిచెడెనో! అదృష్టవిధి మక్కువమై యిటకంపియుండెనో!

చ. అతనికళావిలాసతతి యాతనిచారుదృగబ్జసంపదల్
అతనితనూప్రభావిభవ మాతనిమంగళశాంతమూర్తి యా

యతనిమహామహత్త్వము సమస్తముచాటకచాటుచుండె నీ
గతినిఁజెలంగెఁదానిఁగుఱుకప్పినదిప్పన బాధభావుఁడై.

మ. అరవిందుండనునొక్కరాజు మృగయావ్యాపారకేళీకళా
నిరతుండై చని తన్మహాగహనసాన్నిధ్యంబుఁదత్తన్మృగో
త్కరహింసాపరుఁడై కనుంబడలికంగాంతారమందున్న భూ
మిరుహచ్ఛాయను విశ్రమింపఁగనునెమ్మిన్ వచ్చెనవ్వేటకున్.

చ. చని, కనిచెట్టుక్రింద నతిశాంతముగానిదురించువానియా
ననసరసీరుహంబును, మ[illegible]ంబునవిస్మయమందియెవ్వఁడీ
మనుజుఁ? డిదే[illegible] ? ఘోర[illegible] మధ్యమునన్ శయనించినాఁడు కా
ననమృగభీతిలేకనుచు నవ్యసమాదృతిఁజూపెవానిపై.

గీ. నిద్రఁబోయెడువానిని నిద్రలేపఁ
బాపమొదవునటన్న పెన్ భయముఁదోఁచి
యైన లేపంగనుంకించు నంతనతఁడు
దలనుబైకెత్తెఁగన్నులు నులిమికొనుచు.

వ అంత నాక్షత్రియయువకుండు.

మ. కరకంజంబుల జంటయున్మొగిచి మోఁకారించి చేయున్న మ
స్కారణం బాయరవిందభూమిపతి యాశ్వాసించి యాశీఃపుర
స్సరుఁడై కైకొని యేలొకో ! గహన వృక్షచ్ఛాయలోనుంటివి
త్తటిని వెవ్వరవోయి! తావక చరిత్రం దెల్పుమా! సాంతమున్

ఉ. నేనొకక్షత్రియుండ నవనీవర ! మిక్కిలిబీదవాఁడ, వి
జ్ఞానకళాధురంధరుఁడ శాంతుఁడునాదగునాదుపేరు లో
కాన, సమస్తదేశములఁ గాంచితినింకనుగాంచఁబోవు చీ
కాననమధ్యమునుండి చనఁగానయిచ్చటికేఁగుదెంచితిన్.

కం. నావిని యాయరవిందము
హీంకరుఁడాశాంతుపై నహీంకరరుచే
మావేశంబును జూపుచు
నావానిని వెంటరమ్మటంచునుబలికెన్.

చ. అతనియహేతుకాదరణ మాతనిదివ్యమ్ముమూర్తిసంచయం
బతనికృపాళుతాగరిమ మాతనిశీతలసారదృష్టిసం
తతియివియెల్లశాంతునకుదారమహాశ్చర్యభాగధేయసం
గతియుతమూర్తియో!యనఁగఁగట్టెదుటంగనఁబట్టెఁజక్కఁగాన్

కం. ఏలోకో! దేవరవారలు
వాలాయముగాదమూర్ధ్ని భావముతోసి
వేళఁగటాక్షించిరి నా
పై లలి; నావలననేమి ఫలమో! మీకున్.

వ. అనియన నారాజు

శా. ఏమో! కాని భవన్ముఖాంబుజము నేవీక్షించుకోలేన్ మహా
ప్రేమానందఝరీనిమగ్నమతినై వీఁకల్పిపోఁగా మనం
బామోదింపద; యెట్టిపూర్వభవభవ్యస్నేహబాంధవ్య సం
స్థామాహాత్మ్యమొహేతువయ్యెడనివస్మద్భాగ్యసంయుక్తికిన్.

కం. కావున నావెనువెంటన్
రావోయీ! నాదుమందిరంబున కచటం
గావలసిన భోగంబులు
దేవేంద్రునిలాగు కనెదు దివ్యతరముగన్.

గీ. శాంతుఁడాయరవిందుని సంగడమున
కీయకోలునుగావించి యేఁగుదెంచె

నతని నెనువెంటనేపడి యడవిదాఁటి
ప్రాంతమందున్న యారాజుపట్టణంబు.

ఉ. ఆయరవిందభూమిపతి యామహనీయుని శాంతునొక్క ర
మ్యాయతనంబునందు విడియంగనుజేసి నృపోపచారముల్
చేయఁగఁజేయుచుం దనదు సేవకుల న్నియమించి యద్భుతా
ప్యాయితసౌహృదయ్యమున నాతనితోఁ జతగూడియుండెన్

గీ. ఎప్పుడో రెంబుఁగుడుచునో! యెప్పుడు పెర
రాచకజ్జంబులెల్లఁ దీర్పఁగఁజనునొ?
యిప్పుడప్పుడనఁగనేల? యెల్లవేళ
లందతనితోడ ముచ్చటలాడుచుండు.

శా. శాంతుం డాయరవిందభూపు నపరాస్తప్రేమవాక్స్నిగ్ధగీ
సంతానమ్మున నోలలాడుచు గుణస్థానాయమానుండనై
శాంతాత్ముండయి రాజహార్దభవదుష్టవ్యగ్రగర్వప్రథా
హంతాశాన్యుఁడుగాఁ జెలంగె జనతాహ్లాదైకసంధాయితన్.

శా. వాచాచాతురి నొక్కమారు కవితావ్యాహారసంపత్తి ప్ర
జ్ఞాచాతుర్యబలంబు నొక్కపరి విజ్ఞానాహ్వయోద్యత్కళా
వైచక్షణ్యమొకొక్కతూరి నిజదివ్యద్దేశయాత్రాటన
ప్రాచుర్యంబులఁదెల్పు చొక్కపరి సంభావించునా భూపతిన్.

మ. అరవిందావనివల్లభుం డతని విద్యానైపుణీధోరణీ
స్ఫురణమ్ముల్ వినియాత్మచిత్తమున నామోదించు, దేశాటనాం
తరతత్సాహసకార్యగాథలకు నుత్సాహంబుసూచించు, భా
స్వరకంఠస్వరమాధురుల్ వెలయసంభాషించు, నాశాంతుతోన్

సీ. పారిజాతాగణ్యపుణ్యకల్పతరుఫలము
పారిజాతాఘ్రాణకాంతివిస్తారసుమము
బహుతరానోకస్యభావసంపత్తిగృహము
హృద్యభాగాతము సతము సౌహృద్యమునఁగ.
తే. అనసూయాపురందరుని కాత్మజయైనమరాళినాఁగ వి
ద్యావతి, శాంతమూర్తి, రుచిరాకృతి, పూతచరిత్ర, సద్గుణ
శ్రీవిభవాభిరామ, స్వవశీకృతయౌవనరాజ్యలక్ష్మి, ల
క్ష్మీవనితావతారమునుమిా! యిదియంచునుతింపఁగాఁదగున్.
సీ. ఆమరాళి నిజాచ్ఛకటాక్షవీక్ష
ణాళి పూమాలెగాఁ గ్రుచ్చి యతనిమీఁద
విసరె శాంతుఁడున్నె జదృగ్విసరమును మ
మాలఁ గ్రిమ్మఱవిసరె మరాళిమీఁద.
కం. ఒక్కొకతఱి నొండొరువుల
దృక్కులు మెఱపట్టి పేరిమదీపార్థముగా
మిక్కిలి మురిపెముతోడ
నక్కఱమై పేనుచుందు రతిహర్షమునన్.
శా. సాయంకాలమునం దలంటుకొని పారిసాదాగ్రభాగంబునన్
వాయుల్ చల్లఁగవీచుచుండఁగరభూపంక్తిన్ స్వకైశ్యంబులన్
హాయింజిక్కఁడలించికొంచు నట వాహ్యాళిపరిచారంబునన్
బీయూషాక్తకటాక్షమాలికలచే వీక్షించునాశాంతునిన్.
వ. మఱొకప్పుడు
మ. లలితాంబట్టు మెఱుంగుకంగుగల వల్వంగట్టిజీరాడఁ గు
చ్చెళులున్నెలపయిం జెలంగుపయిఁటం జిన్నారిపౌన్నారి భూ

వలునర్తింపఁగఁ గోపుమూపుఁగమిచేఁ జాటించుచున్ భావమున్
లలితాస్యంబున మందహాసరుచి క్రాలన్ శాంతునిం జూచెడున్

వ. ఇటుల మరాళి శాంతునిపైఁ గోర్కె తగిలియుండ నాశాంతుఁడును.

శా. ప్రాసాదాగ్రమునన్ విహారగతిఁ గ్రమ్మ శ్రీమరాళీసమీ
పాసక్తుండయి తత్సతీహృదయమాకర్షింప విజ్ఞాన వి
ద్యాసంబంధవిశేషముల్ కనఁగ నందర్శింపఁగాఁ జేసి వాం
ఛాసందోహము లాపె కాతనిపయిన్ జన్మింపఁగాఁ జేసెడిన్.

కం. ఏవంవిధిగఁ బరస్పర
భావంబుల భావమెఱిఁగి వారిద్దఱు ప్రే
మావేశంబునఁ బొలుతురు
గై వెక్కి పరస్పరాంశ్లిష్టమతులై.

గీ. ఆమరాళీకుమారిక యాత్మనీన
బహుతరోత్కంఠ హృదినిఁ దాఁపంగరామి
శాంతుపేరిట నొకకూర్మిజాబు వ్రాసెఁ
బ్రకటముక్తాఫలాక్షర పంక్తిఁ గ్రాల.

గీ. నేవిశేషించివ్రాయఁగా నేర నీకు
సకలశాస్త్రార్థసార విజ్ఞాతవౌట
నెఱిఁగియేయుంటి వద లిఖియింపనుంటి
నాదు సనుఁబ్రియపుంబల్కు లాదరింపు!

సీ. గుమగుమానెత్తావిఁ గ్రుమ్మరించెడుచంప
కప్రసూనము ముల్లకంచెలోనఁ

గొమరారుక్రొంజిగుళ్లులకరింపఁగఁజాలు
మణికోటి త్రాఁచుల ఫణములోనఁ
గమ్మనియమృతంబుకడవ కౄరాత్మభ
స్త్రంబునఁ జంద్రమండలములోన
బంగారుకొండను బరికల్పనముసేసి
సతతంబువోరరాని స్థలములోన

గీ. దాఁచి యాయాయుతావుల దానిదాని
నభిలషించు జనంబులకందనీక
యకట! గుర్కిక్కెర్క్రమింగించు చానఁ గొలిపి
బాధపెట్టుమనయ్యకు వందనంబు.

గీ. గండుఁగోయిలపాటలోఁ గమ్మదనము
గుజ్జులేమావిగున్నలోఁ గొమరుఁదనము
కలిపినోయూర్పుచత్తాఁకఁగొలుపుఁగాని
ఫలమనుభవింపనియుఁ డెవ్వండొ! కూళ

సీ. మందారసుమములో మంజిమంబుసృజించి
సౌరభ్యలహరికిఁ జాటుసేసె
రతనంబులోఁగాంతివితతినిఁదాపించి
భూమిలోపలదానిఁ బూడ్చిపెట్టె
బహుఫలదాయమై పరిథవిల్లెడుకల్ప
కముమింటిపూవునుగాఁగఁజేసె.
బంగారునెత్తమ్ములంగల్పనముచేసి
యాకాశగంగకు నప్పగించె

గీ. నెవఁడుసంతోషపడుటకై యిట్టియిట్టి
వట్టిసందర్భశూన్యమైనట్టిపనులు
సేయునేమిసంకల్పముచేసినాఁడొ!
ఆవిధాతకు నానమస్కృతులు ఘటింతు.

గీ. కాలమా! యొక్కతీరుగాఁ గడచుచుండె
భావమా! యొక్కతీరుగాఁ బాఱుచుండె
దైవమా! నోటనీళ్ళూర్చిదాఁటుచుండెఁ
గ నిసంకల్పసిద్ధియేగతిఁ గలుగునో?

శా. ఆకాశస్పృశమైన కంటకిత వృక్షాగ్రప్రదేశంబుపై
రాకాచంద్రసుధాసమానమధుధారాకోశమొప్పారెఁద
త్ప్రాకారంబుసరీసృపప్రతతి కాపాడఁగ బల్! దానినే
లా? కైకోవలెనో! తదేకమతివై యాత్యంతమూహింపుమా!..

మ. వలలోఁ జక్కఁ విహంగశాబకము కాపాడఁ దయావంతులే
కలుగానీతఱియంగలేరకట! క్రూరస్వాంతుఁడై యల్లదే!
ములుకుల్ వింటినిఁ జేతఁబూనితిరిసెన్ బోయండు పేవచ్చి యా
వలత్రాటింగనిత్రుంచితుత్తుమురుగాఁ బాలింపుమా!
శాంతుఁడా!..

గీ. కండచక్కెరఁ దేనెపాకమునఁ గలిపి
పైఁడిగిండియలోఁ బెట్టి బాలకునకు
నాల్కకందిచ్చిలాగుచున్నాఁడొకండు
దానిచవిఁగొనబాలుఁడాత్రముపడంగ.

సీ. విరియఁబూచినజాజి విరులపిండులనుండి
కమ్మతావులుదెసల్గడలుకొనియెఁ

గండచక్కెరచవుల్ కడనుండఁబంచమ
స్వరముతోఁగోయిలల్ బాటపాడె
అమృతంబువెదజల్లు విమలదీప్తులతోడ
నజ్జాబిలింట వాహ్యాళివెడలెఁ
కుసుమరసంబాని కుత్తుకబంటిగాఁ
గావరించిచరించెఁ గండుతేంట్లు

గీ. ప్రకృతిసుందరి యానందభాగ్యలహరిఁ
దోఁగిసౌఖ్యాళినుయ్యాలలూఁగుచుండెఁ
గొఱఁతఁమందున కేనయ్యెఁగొఱఁత కాని
కటకటంబడెఁజక్రవాకములజంట.

గీ. వచ్చుకాలంబు తెలియఁగాఁ బడదు కొంచి
యంబు క్షణభంగురంబుగాత్రంబునాఁగ
జీవితంబున సాధింపఁగావలసిన
దొక్కసౌఖ్యంబుమాత్రంబు నిక్కువంబు.

సీ. తమ్మిపువ్వులఁబూచు తరుణజాతీలత
లానందకరములై యంపగించుఁ
గిలగిలనవ్వుచుఁ జిలికించుచమృతంబు
లీలమైచంద్రుఁ డుయ్యాలలూఁగుఁ
గమ్మనితేనెలఁజిమ్మ చక్కజముగాఁ
బవడంబుగెంజాయఁ బఱచుచుండు
నానావిధప్రసూనంబులు పూచుచుఁ
గాంతుల మిఱుమిట్లు గనఁగఁజేయు

గీ. అక్కజంబయి శోభించు, వాంఛాళినొసఁగు
మదనకల్పకవల్లరి మృదులపఙ్క్తి
దానిహరియించి రాజునుద్యానకమునఁ
బెరఁటిలోనాటి నీర్వోసి పెంచుకొమ్మ!

సీ. కండచక్కెరలోనఁ గమ్మందనము వెట్టి
వేఁపాకులోఁ జేఁదుదాఁపఁ జేసె
దిరిసెనపూవులో విరసించి ప్రమదిమంబు
శిలయందుఁగాఠిన్య మలవరించెఁ
గేతకీదళములోఁ గీల్కొల్పె నెత్తావి
పాలయందుమదాగంధ్యమునురదించె
మల్లెపువ్వునయందుఁ దెల్లందనము పెట్టి
చీఁకటిరాత్రిలోఁ జేర్చెనలుపు.

గీ. చంద్రబింబములోఁజాలఁ జల్లఁదనము
నేర్చిరవిమండలమున నుష్ణము ఘటించె
పృథగఁగోపంబుఁబూని హృత్పథమునందుఁ
బరఁగు నాపక్షపాతంపు బ్రహ్మదేవుఁడు.

గీ. అనుచునిజమనోభావంబు వ్యక్తపఱచు
జాబునొకదానిఁ బ్రియమహేశలత వ్రాసి
సిగ్గుతెరచాటువెల్వడి చేటిచేతి
కిచ్చిపంపించె శాంతుపైనిచ్చముదిరి.

౪౦. ఆచేటి లేఖఁ గైకొని
వేచనిశాంతుఁడువసించు వేశ్మంబునకుఁ

జూచెను బర్వఁగదృష్టిము
రీచితతటిల్లతలతని శరీరాభ్రమునన్.

గీ. చూచి దిక్కైన దోసము మోసుపుష్పాంబకుఁజూపి
చేతి క్లీలాకుశాంతుని చేతికిచ్చి
మరలె శచియాన శక్రాణ్మందిరమున
కేఁగిచనుదెంచు నొక దాసిలాగునంత.

శా. ఆలేఖంగని కంఠశ్లేషగొని కాంతా! ఏమినాభాగ్యమం
చాలోచించు, నిదంతయేనెఱుఁగునా? యంచున్ విచారించు నెం
తేలోలోపల, మధ్యమధ్యవికచమ్మున్ నిట్టూర్పుఁ, దత్తత్స్వచిం
తాలీలాపరివర్తితాననిక యాధారుండు గాఁగన్నునన్.

గీ. దానిఁబట్టియుంచితూచాలుచెప్పకుండ
నంతరార్థంబుగ్రహియించి సాంతముగను
స్తంభితస్వశరీరుఁడై తనువరిఁగను
హస్తపత్త్రికాశూన్యుఁడై చెప్పపోలె.

కం. కొంతొకసేపటకాశాం
తుం డస్మృతిఁదెచ్చుకొని యాదూరస్థలమం
దుండిన కురిచీ గోఁ గూ
ర్చుండె మరాళికి జవాబు సుడివడి వ్రాయన్.

శా. వ్రాయంబోవును, సంశయించు, దెసలంబల్మారువీక్షించు, న
త్యాయాసంబువహించు, నుస్సురనియత్యంతంబునిట్టూర్చు, దై
వాయత్తంబుకదా! సమస్తఘటనంబంచున్ విచారమ్ముగలం
జేయున్, బిక్కమొగంబుబెట్టుకొని కుర్చీపైనినాసీనుఁడై

గీ. మరలఁ గొంతకుఁ గన్నీట మాసినట్టి
కాగితముఁ గొని తుడిచి యాకరణి నెత్తి
'శ్రీమరాళి' యటంచు హృత్ప్రేమ రేపఁ
బట్టుమని నాలుగక్కరాల్ వ్రాయునంత.

సీ. నాసాపుటీతటోష్ణశ్వాస ఘుఁఘుమాని
లపహరింపఁజు ధైర్యమపహరింప
నేత్రపంకేరుహానిర్గళద్బాష్పధా
రావర్షధారలు చేనమాఁప
ఆందోళహిందోళనాభ్రంలిహాభీల
భంగముల్ నైరాశ్యముఁ గమింప
అశ్రాంతదుఃఖగాఢాంధకారవ్యాప్తి
దృష్టిరోధకముఁగాఁ దీఁకరింప

గీ పాణిపాదాఖ్యపటుకేళికాశకములు
శిథిలములు కాఁగ నాకఘోరసింధుమధ్యఁ
జిత్తనౌకను ముడిపింపఁజేఁత గాక
శాంతుఁడాకర్ణధారుఁడు స్తబ్ధుఁడయ్యె-

చ తుడుచుచునున్న వీఁకఁ గనుదోయినిఁ జిప్పిలు బాష్పబిందువుల్
కిడుఁగడు దృష్టిరోధములుగా నగుచుండు, శరీరవల్లికన్
జడిమ జనించుఁ, బాణిజలజంబు చెమర్చి నిరంతరంబుగా
వడఁకుచునుండుఁ గాగితముపైఁ గలమూని లిఖింపఁబోవఁగన్.

కం. ఈవృత్తాంత * ఖబాణము
వావిరిఁ బ్రసరించి వాడవాడల నరవిం

* (ఆకాశబాణమనఁగా బాణసంచులో అవ్వాయి అని చెప్పఁబడునది

నావనిపాలుశ్రీవోయుగ
లీవరరంధ్రములలో బళీ! యనఁజొచ్చెన్.

మ. అరవిందావనివల్లభుండువిని వృత్తాంతంబుసాంతంబుగాఁ
బరమానందముఁబొందియిర్వురకు సల్పంగావివాహంబు హృ
త్సరసీజాతమునందిలంచి నగరిం జాటింపఁగాఁబంచె స
త్కృపమైయానతియిచ్చెఁబత్తనము శృంగారింప రమ్యంబుగాన్.

సీ. పచ్చనికొబ్బరిపండిళ్ళ మామిడా
కులతోరణాలుగట్టి కొమరుమిగులఁ
గాగితంబులపూలుగత్తరించివితాన
తతిఁదాపినిల్వుటద్దాలమర్చి
విద్యుత్ప్రదీపికావితతియంతటఁగల్పి
ఘటపుష్పవిటపిసంఘములు పేర్చి
పండ్లయరంట్లుకంబాలుగానిల్పి ముం
గిటరంగవల్లులుగీలుకొలిపి.

గీ. గుమ్మముల కెల్లఁబసుపుకుంకుములు పెట్టి
గోడలకువెల్లవేయించి క్రొత్తక్రొత్త
చిత్రపటములవ్రేలాడఁజేసి ప్రతిగృ
హమునవేడుకలంజేసి రతిశయముగ.

సీ. వచ్చుచుండిరిపైఁడిపల్లకీలందెక్కి
వసుధాపురందరులసమయశులు
దిగుచుండిరిజయంతుపగిదినిఁ డెల్లగు
రాత్రిలపైనుండిధరాపసుతులు

అరుదెంచి గొకకోరఁ దుఱుమిడిమీసాల
మెలివెట్టి త్రిప్పుచు వెలమదొరలు
వాలిరి గుడ్డగుండీలచొక్కాలతో
రవళిల్లుపల్లెలరైతుపిండు

గీ. పండితులు పామరులు మరిం బకుచువారు
బిల్లకాయలు పెద్దలు వేగనడచి
యేఁగియాయాయివారికి నేర్పఱచిన
విడిదిమేడలలో బసల్ విడిసిరంత

గీ. రాజుదేవిడీలో నగారాలు మ్రోఁగెఁ
బెద్దధ్వనితో ఫిరంగులు ప్రేలుచుండె
ఘనముగా బాణసంచులు గాలుచుండెఁ
జిత్తమానందమగ్నమై చెలఁగుచుండె

కం. ఆసంరంభము తెలిసి సె
బాసనవారిద్దరపుడు భవ్యతరముదా
కాసారమున జలక్రీ
డాసంగతిఁ దోఁగితోఁగి డస్సిరికడకున్.

సీ. ఆకాశమా! నిర్మలాకారమై శాంత
మైనీలకాంతుల నీనుచుండెఁ
జంద్రుఁడా! నిజషోడశకళాళి వెదచల్లి
హాయిగా వెన్నెలఁ గాయుచుండె
మారుతంబా! మందమందంబుగాఁ జల్లఁ
గాగంధయుక్తమై కదలఁబర్వె

విహగంబులా ! మధు విహితకంఠస్వర
కోటితో గూండ్లలోఁ గూయుచుండె

గీ. సకలజనతా మనోనికుంజములదూరె
జప్పుడప్పున నానందాభిసారికాళి
కాని దారుణాభీలనిర్ఘాత మొకఁడు
పడెసమస్తమస్తంగమింపంగనపుడు.

సీ. పండఁబాఱినవాచు పింఛఁగేరెడుజటా
జూటంబుతీవియఁ జుట్టవెట్టి
సుడిగొన్న నల్లత్రాఁచులమలంకలవోని
మాలలుకంఠసీమమునఁదాల్చి
కరువుబోసినపటికంపువిగ్రహమునాఁ
దెల్లనిబూది మేనెల్లఁబూసి
భరితరాగస్ఫూర్తి ఫాలనేత్రమునాఁగ
బొమలందుఁగుంకుమ బొట్టుపెట్టి

గీ. పులికళాసంబుబట్టగా మొలకుఁజుట్టి
చేతనొక్కభిక్షాపాత్ర సేకరించి
సత్వమూర్తి తేజోరాశి శంకరుండు
నాసమీపించె శాంతు సన్న్యాసియొకఁడు.

గీ. దగ్గఱించినయతిని నేత్రకమలముల
విప్పి వీక్షించి భక్తియావేశపెట్ట
వితతసాష్టాంగదండప్రణతులొనర్చి
కింకరుండయ్యె శాంతుఁడా శంకలేక.

శా. ఆశీర్వాదమొసర్చియాతని మెయిన్ హస్తంబుతో దువ్వి యా
కాశంబుం బరికించి మెయ్యదియొ లోకంటన్ విచారించి యో
యీ! శాంతా! యతిసావధానమతివై యేఁ జెప్పఁగాఁ బోవు వా
గ్రాశిన్ వాసిగఁ జెవ్వి యొగ్గి విని సార్థక్యంబు గల్గింపుమా! .

వ. అని యాయతి పలుక నాశాంతుఁడు

కం. మీయాయత్తము నాదగు
కాయము సర్వస్వమీవ కావే? నాకున్
చేయుదు భవదాజ్ఞను బం
హీయస్సద్భక్తిజలములేర్పారన్.

వ. అన నాయతి.

గీ. బదరికావనసీమలో వకుళపుష్ప
వాటికాపరివృతమంటపంబునందుఁ
దపముఁ గావించుకొనుచున్న తఱిని నాకుఁ
గొంతకాలము శుశ్రూషఁ గొనవె నీవు!.

ఉ. పెండిలిమాని తత్త్వపరివిత్త్వమునుం గొని సన్న్యసించి చే
దండకమండలుద్వయము దాలిచి కట్టియుఁ గావి బట్ట భూ
మండలమందు శంకరుని మాద్రిఁ జరింతుమంతోపదేశ వా
క్కాండము పన్యసించుచు నఖండముగా నని యాఁదిపల్కవే?

చ. మఱచితివే మొ! కాని మతిమాలి, వివాహముఁ దూలనాడి సు
స్థిరముగ దీనిమానెదని దే! గురుపాదములాన యంచు నా
చరణములంటలేదె! యటశాంత! యదంతయు ధిక్కరించి యీ
కరణి ననీతిమార్గమునఁ గాలిడఁగాఁ జెవి నెవ్వఁ డూఁదెనో!

శా. సంసారంబనఁ గల్పవృక్షమట, తచ్ఛాఖాఫలంబందఁగా
హంసీ! యానయమొక్కనిచ్చెనటవే! యద్దానిఁబొంతెంబరి
ధ్వంసంబుం బొనరింపఁగావలయు సద్వంశంబులంగొన్ని వి
ద్యాంసుల్ దానిని ముక్తిచెట్టుపగిదిన్ భావింతురశ్రాంతముల్
ఉ. పెండిలిపెండ్లియంచు నవివేకతఁజంకలు మోఁదుఁగాని పై
నుండెడి కష్టకష్టముల ప్రవాహములం దెలియంజనానన్న కుల్
పెండ్లనపెండ్లియంచు మదినిన్ ముదమొందునుగాని యమ్మకుం
బుండువలెఁగటా! సతిపోరనియెంచని బాలుకై వడిన్.
వ. నేనొక్కకథ నొడివెద వినుము
గీ. దాఁటఁగారాని దైన సంద్రంబునందుఁ
గర్ణధారుఁడొకండు నౌకాప్రయాణ
మునను నొక్కమహాద్వీపమునకుఁబోవఁ
దలఁచి నావతో జలధిమధ్యమున కేఁగ
శా. జృంభించెన్ బహుచండవాతములు, వర్షించెన్ బృహద్ధారలం
గుంభద్రోణముగా, మహత్తరములు పెక్కుల్ రాలె, గాఢాంధ్యసం
రంభంబయ్యెను, నేఁగెనావికుల యార్తధ్వానముల్, జీవితా
రంభాశల్ నశియించెఁ, గాంచుపడె యాత్రంగర్ణధారుండటన్.
గీ ఆదినప్పు ప్రసవీకుండికోదగంబు
బ్రద్దలయ్యెను నొక్కపర్వతముదాఁక
నావ, దానిలోనుండిన నావికాళి
సంద్రమున మున్గిరంత శ్వాసములువిడిచి
ఉ. ఆసమయంబునందయిన నాపటుసాగర తారకుల్ ప్రవా
వ సమునందునెక్కలిపి పారముఁజేర్పఁగరాఁగదోయి! నేఁ

బాసితినీప్రపంచమును భారమునీదిసుమీయటంచు సం
త్రాసభరంబుమాని తననావహుంగలట్రేన మెట్టిదో !

గీ. కొంతసేపటు కాఁకలిఁ గొనెఁగఁడింప
దూపమోపయ్యెనంగముల్ తూలిపోయెఁ
జుట్టుప్రక్కలఁదనకనుపహాఘుఁగోన
రానెవరులేమిఁ దెఁచు విరక్తిఁజెందె.

కం. సంపాదించినసెన్నో !
కొంపలుగోడలును నెంటఁ గొనిపోవుదుతో
నింపగునే ? వైరాగ్యా
పాంపతిలో మునిఁగి తేలువాసికవిభవా !

శా. వైరాగ్యంబనసౌఖ్యకల్పకము భవ్యస్వర్గడోలాచ్ఛటా
పారవ్యంబులు సుందరీతనులతాసంస్పర్శసౌభాగ్యవి
స్తారంబుల్ రుచిమత్పదార్థతతియుద్దానక్షసదాకెల్గు దు
ర్వైరస్యంబునుగొల్పకుండు విచిత్రంబద్దియత్యంతమున్.

చ. కరతలభిక్షలంగుడిచి క్రమముగా సెలయేళ్ళగట్లనో !
తరువులనీడనో ! విడిసి ద్వంద్వములన్నిరసించిసౌఖ్య సం
భరమున నాడచుండు యతివర్యునిఁగాంచసువర్ణడోలికాం
తరరమమాణమన్మథసుధాకరులైననుసన్న్యసింపరే ! .

కం. అనుదీర్ఘోపన్యాస
మ్మునువినిమేల్కొనివివేకముంగొనిచిత్త
మ్మునమునుపటిప్రతిసనుజ్ఞ
ప్తినిఁదెచ్చికొనిపలికెమృదుపేశలఫణితిన్.

సీ. భవదీయవరవరివస్యాబ్ధిమధ్య మా
మకజీవికానౌక మందరగతిఁ
గౌశలవృత్తిమై గడపఁగాఁ దొడఁగియా
సాగరాంతరమునఁ జనుచునుండ
నాదువిశాలమానసవిహాయసమున
మోహమేఘాళిక్రమ్ముకొని పెద్ద
పెట్టునవ్విఘ్నించెవిచెఁబ్రచండవా
తములు తుపాను దద్దయును బట్టె

గీ. నాదునావ యావగ్గము సఁబడితిరిగి
తుట్టతుదకొక్క ద్వీపంబుఁ బట్టెదాన
స్థిరతరానాసమును జేసితినిఁగడంక
మిగిడి చనలేక కాడ్పడిమతినిఁదప్పి

గీ. అనివచించివివాహకార్యంబునంద
సహ్యతంగని స్వప్రతిజ్ఞానమగ్ధ
నాపరమతిమై యాత్మసన్న్యాసమపుడ
సేకరించెనుశాంతుఁడచ్చెరుపుదోఁప.

ఉ. అద్దములోనిపాపవలె నాశయముల్ తలక్రిందులయ్యె శ్రీ
మద్దమితామితాఘుఁడగు మాస్కరిసిఁ దరిసించునంతలోఁ
దద్దయుశాంతుఁడాయతినిఁ దక్షణమే బలవంతపెట్టె వా
రిద్దఱు ఘోరకానసమహింపదవింబడి పోయిరేడకో!

మ. సుముహూర్తంబుసమీపమయ్యెననుచుఁ సూరుల్ నివేదింపవే
గముగా నాయరవిందుఁడేఁగఁ గొనితేఁగా శాంతునిం, గానిశూ

న్యముగా, సర్వకళావిహీనముగఁ గ్రంథతత్త్వసంభకుడ్యంబుగా
దమితానందముగాఁగఁ శాంతునిని శాంతంబుఁగనెం గన్నులన్

గీ. వెలవెలంబాఱు శాంతుని వేశ్మముఁగని
వెలవెలంబాఱె నాయుపవింపు మోము
వెలవెలంబాఱు తూరుపుమలను గాంచి
వెలవెలంబాఱు చంద్రమండలముపోలె.

శా. ఉద్యానావళియాదిగాసకలవాయువ్యాప్య దేశంబులన్
సద్యశ్శోధనముంబొనర్చి యుచటన్ శాంతుంగనంగామిఁ దా
నుద్యోగించిన కాంతుపెండిలికిఁ బ్రత్యూహంబదట్లుండ సా
హ్లాద్యప్రాభవుఁడైన శాంతుకయిమొంతేఁగొందలంబుంగొనున్.

కం. శాంతుఁడు లేకరవిందుఁడు
శాంతాత్ముండగుటకతన శాంతాత్ముఁడుగా
కింతయు నత్యంతము దుః
ఖాంతమహానాటకరసమాస్వాదించున్.

గీ. వెదకివెదకి వేసరి తుట్టతుదను శాంతుఁ
గానలేక కూఁతురి ధరాజానిసుతుల
యందొకనికిచ్చి పాణిగ్రహణమొనర్చి
పిమ్మటన్ సన్న్యసింప భావించెనతఁడు.

గీ. ఆయుదంతముప్రసరింప నామరాళి
మానసమ్మునగొంచెపొక మైక మొందు
గుండెలోన నాపెను రాతిబండపడఁగఁ
ద్వరితగతినేఁగె నిజగృహోద్యానసీమ.

గీ. మంజిమంబునఁదనుఁబోని మాలతీల
తనొకదానినిఁద్రుంచి హస్తలతచేతఁ
గంఠమునఁజుట్ట భూషగాఁగ్రాలియుంతఁ
క్రూరభీకరకాలకాకోదరమనఁ
బ్రేతపతికరచాపమౌర్వీలతయనఁ
బాపకమహీధ్రభవ విషవల్లరియన
హాలహాలద్రవలిప్త శాతాసియనఁగ
మృత్యుదేవతాహస్తదుర్గోత్రమనఁగ
సర్వవిధ్వంసికాలపాశంబనంగ
గాలవృశ్చికదుష్టశూకంబనంగ
కంటికగపడి శ్వాసముల్ కాకుపఱచి
ప్రాణతతిశూన్యకాంచనప్రతిమకరణి
విదళితప్రకాండకబాలకదళిరీతి
దావవహ్నిదగ్ధకురంగశావమువలె
రాహుసంగ్రస్తచారుచంద్రకళవోలె
నపుడసేసెనావల్లి మాహాత్మ్యమేమొ!
ఉ. ఆయరవిందభూమిపతియాత్మజయంతము విన్న వెంటనే
కాయముదగ్ధమైనగతిఁ గాడ్పడిముందునకేఁగలేక వా
లాయము నేత్రనీరజములన్ బహుబాష్పకణాలురాలఁ గు
య్యో! యనిమొత్తువెట్టజనులూటటమానికలంతఁగుందఁగన్.
ఉ. ప్రాణసఖుండుశాంతుఁడు, స్వభావముచే నతిశాంతుఁడాతఁడే
ప్రాణముపాయుచందమునఁ బాసెనునన్ను, మరాళియున్ స్వక

ల్యాణముకూడరోసిమృతయయ్యెఁగటా! యిఁకనాకుమాత్రమీ
రాణువలేల? యీమహితరాజ్యరమావిభవంబులేటికిన్.

ఉ. కాలముమారిపోయెఁ బ్రియుకందగుకాలమునందుఁగూడ ము
ప్పాలుగతించెఁ గష్టములపైఁబడితాఁచెను నింకరాజ్యభో
గాలనరోఁతపుట్టెనతిగా, ఁబ్రియమారఁగసన్న్యసించి ని
ర్మాలమొనర్చి దుష్టతమమోహభరంబుముముక్షువయ్యెదన్

సీ. వచ్చినసనిజబాంధవగణంబులోఁగొంద
ఱనుధర్మపాలకుల నోసరించి
రాజ్యముపై వచ్చు ద్రవ్యమంతయుఁబాఠ
శాలలకునుధర్మ సత్రములకు
వికలాంగులకుసర్వవిధసదుపాయముల్
జరుపునేర్పాట్లను సలుపుకొఱకు
దేశాంతరములసాధింప విద్యలుపోవు
నాకభాగ్యులకు సాయపడుపొంటె

గీ. ఏరుపాటొనరించి మహీధవుండు
ధర్మశాసనమును గాగితమునవ్రాసి
ధర్మపాలురచేతుల దానిఁబెట్టె
సంశయముపాసినిర్ముక్తసంగుఁడగుచు.

గీ. వచ్చినతనబంధువితతి వచ్చినట్టె
దారిఁబట్టెనాయరవింద ధరణిపతియుఁ
గావిరంగుపుట్టంబులు గట్టిపాద
చారియైయొక్కఁడయడవి దారిఁబట్టె.

# శివరామకవి ప్రణీత గ్రంథములు.

| | |
|---|---|
| (1) సోముడు లేక ఉత్తరహరివంశ విమర్శము. (1919 సం॥ విరచితము) | 1—0—0 |
| మేలుప్రతి | 1—4—0 |
| (2) సోముని జీవితము. | 0—1—0 |
| (3) ఋతుకాలతి. చక్రవర్తిప్రబంధము. (1910 సం॥ విర) | 0—12—0 |
| (4) తాంబూలఖండనము. (విమర్శనము) (1913) | 0—4—0 |
| (5) గుంటూరుకాలేజీ శతావధానము. ఇందు మేలుపద్యములు కలవు. | 0—4—0 |
| (6) కొవ్వూరు. | 0—3—0 |
| (7) తెనాలి. | 0—2—0 |
| (8) నిజాపే. | 0—2—0 |

[అవధానములన్నియు నొకతూరి గొనువారికి 0—8—0]

| | |
|---|---|
| (9) స్నాతకసూత్రము. [ఖండకావ్యము 1910] | 0—4—0 |

[ముద్రణలోనున్నవి.]

(1) మణిమేఖల. గొప్పకల్పిత గ్రంథము.
(2) మానవవర్మ. నాటకము. [విషాదాంతము.]
(3) మనుస్మృతి.

విలాసము:—

వేలూరి.
చిరివాడ, తెల్లప్రోలుపోస్టు,
కృష్ణాజిల్లా.

ఇందలి కథ కల్పితము. శమజయంతులు సహాధ్యాయులు చెలికాండ్రును. 'ముక్తాలతయను' వారకామిని శమునిఁ బ్రేమించినది. జయంతుఁడు ముక్తాలతా సక్తుఁడు. కాన శముని సమయుంచినాఁడు. దాన ముక్తాలతయు సమసెను. దాన జయంతుఁడును మడిసె. (ఇందు ముక్తాలతా పవిత్రప్రేమయు, శముని గాంభీర్యము శాంతియు, జయంతుని రాజసగుణమును, ప్రదర్శింపఁబడియె.)



# ముక్తాలత.



శ్రీలకుఁ దావు విద్దెలకుఁ జేరిక య్యై తగు నాంధ్రమండలిన్
గ్రాలుచునుండు పత్తిసనికాయము లోపలమేలురీతిఁ గై
కోనాసరించుచున్ 'ధరణికోట' పురంబొకఁ డొప్పుమీఱునా
ప్రోలున 'సింధులుండ' నెడుభూపుఁడెసంగుచు నేలుఁజండుఁడై.

క. ఆతనికి నేక లేక జయంతుఁడను కొ
మారుఁ డొకఁడు జనించి యల్లారు ముద్దు
గాఁ బెరుంగుచుఁ బత్సురిఁ గ్రాలుచున్న
మేలిపరిషత్తునన్ విద్దెఁ గ్రోలెఁ జాల

సీ. శుక్రుండు మొదలైన సూరు లేర్పఱిచిన
నీతిశాస్త్రంబుల నేర్పు బొంది
మనుయాజ్ఞవల్క్య సమ్మతములౌ స్మృతుల జాం
బమ్ములం గల్గు సారమ్ముఁ ద్రింగి
తొంటి రాజుల సంగతులఁ గాంచి చెప్పు పు
రాణకోరణుల కర్థంబెఱిఁగి
మదికి నానందంబు బొడలింపఁజాలు సా
హిత్యమార్గమున సాహిత్య మొంది

మ. ఒకనాఁ డాశ్రముఁడునే జయన్తుఁడును క్రీడోద్యానభాగంబు చెం
తను నేకాంతముగాఁగ నేఁగిరి లతాంత వ్యాప్త సౌరభ్య పో
షక మన్దానిలముల్ కదంబముల తెంచన్ గుజ్జుక్రొమ్మావులన్
పికముల్ రాచిలుకల్ కపుంజు మొదలౌ పిట్టల్ రవాళింపఁగన్.

సీ. గుమ్మటంబులఁబోలె గులకరించెడు రూపు
జెరియు రేరాశిపియల సొబగు
పొడవుగఁ జాఁగి సొంపుగ నాకు వెట్టిన
దుంపరాష్ట్రిపు మొకయింపు పెంపు
వ్రేలనై చిన చేతి వ్రేళ్లఁబోలిన పూల
సలరారు విసాగ్ద్రియుల బడంగు
గంటలఁబోలు నాకారమ్ము తాల్చి సొం
పులుగుల్కు క్రొందూఁటిపూలపొలుపు

తే. విరహాభర క్షిన్న యామేలు వెలఁదిఁబోలెఁ
బొలుపుమీఱుచు పగురు చెట్టుల వికాస
మారఁ గాంచుచు మునిమునఁ గూరుచుండి
రన్నకొలిపెడి పలుఁగురా తిన్నెమీఁద.

వ. అయ్యెడ నచటనున్న వనపాలుండు వడివడిగ నేఁగి

సీ. మారుతమ్ముగ యాందు మాలిన్య మొదలింపఁ
జాలిన తులశిదళాలఁ గొన్ని
విలసిచిన మాత్రఁ దాపిసి విస్తరిలఁజేయఁ
గలుగు సాంబ్రాణికాఁడులను గొన్ని
ఎలదేఁటికదుపుల కేలిసంఖ్యైన గొ
ప్పులుకల్గు సంపెంగ పూలఁ గొన్ని
నిండార విచ్చియుండు గొండ రేకులఁ దొంగ

లించిన బొండు మల్లియలఁ గొన్ని
గీ. పండఁ బాఱిన గజనిమ్మ పండ్లఁ గొన్ని
పగిలి విచ్చిన దానిమ్మ పండ్లఁ గొన్ని
చలువకూకాకెగడ్డిపోఁచలనుగొన్ని
తెచ్చి యిచ్చెను భూపాలతిలకమునకు.
క. ఇచ్చిన సంతోషముగాఁ
బుచ్చికొని జయంతుఁడతని పొందికఁ బొలుపున్
మెచ్చుచుఁ బాదుల పనికై
పుచ్చిన వనపాలుఁడరిగఁ బోయినపోకై.
క. అంతట నాలోచించి జ
యంతుం డాశముని మోము నారసి యోయీ!
శాంతముగా విను చెప్పెద
వింతయు, నటుపైనిఁ జెప్పుమా! ప్రత్యుక్తిన్.
వ. అని యుపోద్ఘాతంబుసేసి పిమ్మట నిట్లనియె
క. ఇన్నాళ్లు మనకు విద్యా
సన్నాహము లోడఁగడఁచె సరిగా; నికముం
దున్నవ్య జీవితముకద!
అన్నా! మఱి దాని నెటుల నతివాహింతో!
మ. అనఁగా జీవితముంకనున్ మిగుల విద్యాచింతనాసంయుతం
బునుగాఁ జేసెదొ! పాణిపీడనముకై పూఁబోఁడినిన్ స్వీకరిం
చి నితాంతంబును మోహనమందెదవో! నీ చిత్తంబునందెట్లు పా
ల్పిసదో యోజన చెప్పుమీ వినియెదన్ స్నేహానురూపంబుగన్.
క. అనుచుం బల్కు జయంతుం
గనుఁగొను చాశముఁడు నవ్వి కనుసన్నల మా

యెను నీ మాటలు నేనే
మిని యోజింపంగలేనుమీ! యనిపలికెన్.

చ. పలుకు శమంగనుంగొని నృపాలకుఁడించుక కోపమొప్పఁ గన్
గొలఁకులుసంభ్రమింపఁ బలుకుంబడియుందునఁ గాఁకవుట్ట 'నా
పలుకులనిట్టులన్ నగవు పాలొనరింతువె' యంచుఁ జేతిలోఁ
గల విరిమల్లె వై చెనడి గట్టిగ వానియెడందఁ దాఁకఁగన్.

ఉ. ఈరసమొత్తెనంచు గ్రహియించి శముండు శమంబుతోడి పాం
దారసి యాజయంతుఁగని యల్లన నిట్లనియెన్ సఖా! మనో
ద్వారము విప్పవాఁడ వినుమా! సిరివచ్చిన షేంప్లమాపయిన్
గూరిమి నింతనింపుమ? కొందఱుమీగతి వారుదక్కఁగన్.

వ. కావున నాచెప్పునది సవిమర్శంబుగా నాకర్ణింపుము.

సీ. ఈలోకమంతయు నాలుగునొకటి జా
తుల క్రిందనేర్పడి మెలఁగుచుండు
నందవాంతరములై నట్టి జాతులుగూడఁ
గలిసిపోవును వాని కర్మఁజేసి
విద్యోపజీవియై వెలయు బ్రాహ్మణుఁడు రా
జన్యుండు రాచ కడ్గంబుచేత
సలరుఁ గోమటియు బేహారంబుచేత నా
ల్గవజాతి వాఁడుసేద్యంబుచేత

గీ. ఖ్యాతినింపుదు రైదవ జాతివార
లందఱకు దాసులౌచు దాస్యంబుసేసి
జీవనంబుల నెట్టెట్టొ చేయుచుంద్రు
కష్టసుఖములచే నవకృష్టులగుచు.

శా. చాతుర్వర్ణ్యము మంచికాదని మదిన్ జర్చించెదంగాని త

ర్వాణన్ గర్మబలంబు చొప్పుననొగిన్ వర్ణంబులింకెన్ని యే
నోతప్రోతమ్ములై చెలంగుననియే యూహించెదన్ గావునన్
జ్ఞాతవ్యంబగు నెల్లవారలకిలన్ జ్ఞానంబు ముమ్మాటికిన్.

ఉ. జ్ఞానము కల్గు వెంబడినె కల్గును వర్ణవిభాగమెల్ల లో
కానఁ జెలంగు వారికుపకారక మౌనను జ్ఞాన మింక వి
జ్ఞాన పథంబుగాంచను జనంబుల కల్లర పొక్క రూపుగాఁ
గానఁగ వచ్చు తీర్పు దొరకింగల దోయి సఖా! సుఖంబుగన్.

శా. కానన్ జ్ఞానము నెల్లు గాంచెదనొ లోకంబట్లు యోజించి య
ద్దానిన్ నేనును సల్పగించికొని సత్వస్ఫూర్తిశోభిల్ల వి
జ్ఞానంబున్ వెదఁజల్లు నెంచెద దిశాజాలంబులన్ నీవు నా
కానర్థంబును సంఘటింపుము సహాయంబుం బ్రసాదించుచున్.

శా. పాండిత్యం బది లేమిఁ జేసి కలయీ వర్ణంబు లేకంబు కా
కుండున్నాతల పోత్పుష్టిని సహాయత్వంబుచే జీవుఁడే
ఖండత్వంబును నాదరింతురు మరజ్ఞానావృతాకారులై
'చండాలోస్తు సతుద్విజోస్తు' నుచు నాశాసింప రేః శంకరుల్.

క. కావున జ్ఞానగృహంబునఁ
గావలియుండెదను నేను కలజగతికినై
జీవితము ధారపోసిన
నావిత మిటులాగ్రహా చేసినాఁడను మిత్రా!

క. అన పిసులారఫిసి యా
జననాథకుమారుఁ డంతి సంభ్రమమును మిం
చిన యాశ్చర్యము పొందుచు
ననువాదముచేసె నాతఁడను వాక్యములన్.

వ. ఇటు లనువాదంబు సేసి యంతట

శా. వేదాంతంబన నాకుమంట యదియేఁ పూర్వవాసనల్ బుట్టెనో!
కాదంచున్ మది ద్రిప్పికొన్నను గలంగంబోదు దాదారి బు
ద్ధ్యాదుల్ చేసిన బోధమేలనుచు లోనానందముం బొంది మీ
కేదో చెప్పుచునుండ్రు నా చెవికి నింతేనెక్కదో యీ! సఖా!

వ. ఆసంగతి యటులుండనిమ్ము. 'నీవిఁక నేమిచేయుదువ' ని నీవు
నన్నుఁ బృచ్ఛ చేయుదేని వినుము.

శా. సంగీతమ్మొకవంక నొక్కయెడనున్ సాహిత్యమున్ వేఱొకం
టంగూడన్ గవితావిలాసములు వేడ్కల్ గూరుపంగా సభా
రంగంబందునఁ గూరుచుండి శుభమిత్రప్రాప్తి పార్శ్వండనై
సాంగోపాంగముగాఁ దన్మయుండనై యానందముం బొందెదన్

వ. ఇదియ యిప్పటికి నాతలపోసిన తలపోఁతయని జయంతుండు
పలికిన విని సోముండు

ఉ. బాఁగుగఁ దెల్పితోయి! సరసాలకుమారకుఁడా! యిట్లైన నో
మాఁగుపడుంగదే! బ్రదుకు మాసపడన్నమునె తినందు కీ
మూఁగురుపండితుల్ తెలుపుముచ్చటలన్ వినుటింతియే ఫలం
బౌఁగదె! నీకు నిచ్చ యిటులాయెనె! వాసన కల్మి పెంపునన్.

శా. ఐనన్ నీవిటు కోరుకోర్కె యెడ నావంతేని దోషంబుగాన్
గానన్ నాదుసఖా! సఖాతురుఁడ! చాణక్యుండులోనైన స వి
జ్ఞానుల్ తెల్పిన నీతిశాస్త్రమును నిష్ఠంజూచి యున్నాఁడ వ
ద్దానిన్ పోషఁగ నిర్వహించెదను బ్రమోదంబందఁగాఁ జూడుమీ!

వ. అన విని జయంతుండు నెడనెడ నాకొని యిట్లనియె.

సీ. గుమురుఁగొను చిగురాకు గములమీఁజకమావిఁ
గూర్చుండి కూయుఁ బుంస్కోకిలములు
ఘంటిమొగింబులై యుగుకొత్తుమసముతో

సలిపె 'సంబా' యని యాలమంద
ఋషివాటికలనుండి ఋగ్వేదపాఠముల్
శ్రోత్రపేయంబుగా సోఁకుదెంచె
కృష్ణానదీతీర కీచకంబులు పాడెఁ
గోమరారిఁ బిల్లనగ్రోవిపాట
గీ. దిగుడుబావుల తీర్థమ్ము తేరుకొనియె
దెసల నెత్తురిరంగులు దీటుకొనియె
మందమలయానిలమ్ములు మలయుచుండెఁ
బోవుదమె నిమ్నగాతీరభూములకును.
చ. అనవిని యాశ్రమంబు సరియంచు జయంతుని కేలువట్టి యు
ల్లసఁ జనఁగాఁ దొడంగెను విలాసముగాఁ దదనంతరంబ యి
ట్లనియె జయంతుఁ డాశ్రమునినారసి, యో చెలికాఁడ! రాష్ట్రముల్
గనుఁగొనిరాఁగ నానయుడినాగలు నాజనకుండు మంత్రులున్.
ఉ. కావున నెల్లి రేపకడఁ గట్టెద నేను ప్రయాణ మీవునున్
రావలెనాదువెంబడి నరాతులకాలని దుర్గముల్ పుర
శ్రీవిభవంబు లింపయిన చెట్టులు జేమలుగాను తోఁటలున్
త్రోవలఁ జూచుచుంజని వినోదముసేయుదమయ్య చిత్తముల్.
వ. అనినవిని యాశ్రమంబు కొంతవడి యాలోచించి మెత్తని
పలుకుబడి నేసి యిట్లనియె.
ఉ. మొన్నఁగదే! వివాహమను ముచ్చటవచ్చెను నీకు, లగ్నమిం
కన్నెలనాళ్ళలుండెనటు కావున నందులకేఁగుదెంచు వి
ద్వన్నికరంబులం గవులఁ దక్కటివారలఁ గూడ గారవిం
పన్నడికట్టుకట్టుకొనువాఁడను గావున రాక తక్కెదన్.
ఉ. ఇంతకుమున్న నీవటుల నిచ్చితివాచతిఁగాన దానికై

యెంతయొపాటుచేయవలె నేర్పులుపందగు నేరుపాటులన్
వంతులునైచి కొందఱు పొనర్చినఁగాని కొఱంతతీఱ దా
వంతయు నింతకాచరితమైనదిలేదుకదా! సుహృద్వరా!

వ. అని చెప్పఁగా విని జయంతుండు మాఱుపల్కక చనుచుండె నంత నొకయుపలస్థూణం బభ్రంకషంబును శతవ్యామ్యగ్రా హ్యంబును నైనది పాడకట్టిన నిలిచి దానిశిల్పంబు చూచుచు దానఁ జెక్కంబడిన యక్కరంబులఁ గాంచి నమస్కరించి శేముంగని జయంతుం డిదియేమి యని యడిగిన 'నిదియొక జ్ఞానిచెక్కిన కవితాశిల్పంబు' అని చెప్పి జయంతునిచేఁ బృష్టుండై యిట్లు చదివె.

సీ. కొండలోయలలోనఁ గొమరారుకింజల్క-
పుంజంబుగల నోఁగుఁబూలయందు
కాఱుమబ్బులకూఁత కామగానెలకొన్న
విధినెసంగెడిమింటి వింటియందు
నిలువెల్లమవ్వంబు చెలువమ్ముగమిచియు
చ్చెరువొనర్చెడు చెట్టుజేమలందు
తారకాకోరకాంతరితమై విధుబింబ
విద్ధమైతగునభోవీథియందు

గీ. ఆడుకొందును నీవుందువంచునెంచి
యచటికేఁగఁగ నాకేలయాసపెట్టి
పాఱిపోయెదు? నీతోడఁబఱవఁజాలఁ
గదలిపోయెడు నంతరంగంబుతోడ.

ఉ. మేరలులేని యాకసము మీఁదులుసూచి దిశావిశాలమా
ధారుణియెల్లఁగాంచి లలితప్రకృతి ప్రతివేశమెంచి వే

సారిలతాగృహాభిముఖచారుఁడనై యటుమోమునెట్ట వె
న్నారయఁదిట్టినట్టులయి యారసినాఁడనులేని నిదెసల్.

మ. సౌదరింటంగనుదోయిమూసికొని యీపూదండఁ గై దండ కి
చ్చెదఁగాకంచుఁగడంగి మెల్లమెలగాఁ జేసాఁచియుండీయ నీ
వది కైకొన్నటులై కనుల్ దెఱవఁగా నచ్చోటలేకున్న ని
న్నెదకం గానఁగరావు పూవులటులుతాపిన్ నేలఁబొర్లాడెడున్.

గీ. నీకొఱకుశాంతితోడ ధ్యానించుచుండఁ
బిల్లపీఁచరతీవియ మెల్లమెల్లఁ
గంఠమును జుట్టుకొనె దానికంటకములు
ద్రుంపకయె యోసరింపు మోర్పునుగమించి.

శా. సంపాదించితిఁ గస్తికోర్చిమిగులన్ సంపంగుల న్నిన్నుఁ బూ
జింపంగన్ గదళీసదాపనసరాజీవాదిపత్రంబులన్
నింపంగొందఱుబాలకుల్ గనుచుసన్నిందించుచున్ నవ్వుచున్
గొంపోఁజూచిరి కొంపులింపులగుచున్ గొంపల్ గుమాయింపఁగన్

వ. అనిచదువు నాశమునికడ్డంబై జయంతుం డక్కటా! యీకవి
తాశిల్పంబు గూఢంబై యున్నది. ఎవఁడో కాఁడువడిన నిన్ని
పద్యంబులతో విసుఁగుపుట్టునట్టు తేలవర్ణింపవలయునని పల్కిన
నాశముండు శాంతంబుగా జయంతుదిక్కుమొగంబై, చెలి
కాఁడా! ఇయ్యది తద్వర్ణన మాత్రమేకాదు; ఈశస్తోత్రంబుగా
గ్రహింపుమనిన విని పైని జదువుమని చెప్పినఁ జూచి యాశ
ముండు మఱల నిటులు చదివె:—

సీ. చెలికాఁడమఱచితే? చెప్పుమాయనియొకం
డింపారునెలుఁగుతో నేఁగుదెంచె
రెండుచేతులు తన రెండుచేతులతోడ

వలపుచేఁగాఁబోలు వడిగనిమిరె
సింగముల్ చెక్కిన బంగరుమురుగులు
తొడిగెను రెండుచేతులకుఁగూడ
తొడిగిసంతసెచూచి నులిపిముందటివాఃప్ర
వాహమ్మునందున నైచినాఁడఁ
గీ. బడుచులేచుచుఁబోయి యాపడుచువాఁడు
నెదకినెదకిగ్రహించి నాయెదుటనిడియె
వాఁఱునైచితి మఁజల నావాఁకయందు
నెదకినెదకివిరక్తిచే నెళ్లెసతఁడు.
సీ. ఒకమాటునెన్నెల నోడింపఁగాఁజాలు
మొలకనవ్వధరంపు మొనలమీఁద
ఒకవేళయందుఁగవోష్ణమై ప్రవహించు
కన్నీటిగుంపు మీఁగాళ్ల మీఁద
ఒకతేపఁ బ్రకృతికంతకు వేఁడుకలుసూపఁ
పులకించుశాంతి కందోయిమీఁద
ఒకసారిమేనెఱుంగకయుండఁ జేయునౌ•
దాసీన్యమమల చిత్తమ్ముమీఁద
గీ. ఒక్కతూఁటినినెల్లర నోరగించు
విస్మయావస్థసకలాంగ వీథిమీఁదఁ
గానఁబట్టుచునుండె నామానసమున
నిన్నుఁదలపోయునట్టి యానిమిషమునను.
మ. చెలికాఁడెందఱో నామవంకఁగనియాక్షేపించి రావోయియా
పొలముంద్రొక్కఁగనేల? నీకునను చుర్ణబోధించుచున్నారలీ
కలుపుంగోలుఁదనంబు లించవలయూఁగాముల్ తలందూఱ స్వ

ఛలమిత్రుల్ విడనాడుఁ డశ్రునయనాసార ప్రశాన్తాత్మునిన్.

కం. ఈరంబునఁ గూర్చుండ వి
చారముచేఁ గంటినీరు జాల్వాఱెమృగం
బారసినాకఁ దోడంగ నో
యారపుఁ బచ్చియలు చూపి యనిపితినటుగా.

వ. అని చదివిన విని నిట్టూర్చి జయంతుండు

శా. వేదాంతంబది యేడ? మంజుకవితావృత్తాంతమేడన్ నృపా
లాదుల్ విన్కలిమాత్రనే యెఱిఁగి పై నానందముం బొందఁగాఁ
గాదా! యీకవితాకళాఫలము జ్ఞానంబుం గడుం దెల్ప సూ
త్రాదుల్ వాక్యము లుంబదంబులును లేవా? భాషలోఁ గొల్లగన్

క. తీయని మామిడిపండును
నాయసపాత్రంబులోన నమరిచినగతిన్
మాయురె! తత్త్వజ్ఞానము
కై యొదవిన యీకవిత్వమది కనఁబట్టెన్.

వ. అనిన విని శముండు నిశ్చేష్టుండై కొంతవడికి

శా. ఔరా! యెంతవిమర్శధోరణి జయంతా! వింతలం గూర్చె వ్యా
హారంబీయది భూపుఁడొక్కఁడె కవిత్వానందముం జెందునా!
లేరా! లోకమునందు నెందుఁ గవితాలీలాకళాగ్రాహులా
వారల్ విన్కలి మాత్రనే తెలియుమేల్ వైదగ్ధ్యకూలంకషుల్

ఉ. పదములయందు సూత్రముల వాక్యములన్ గలతత్త్వశాస్త్రముల్
గుదురుగఁ గూరుచుండి గురుగోష్ఠిని బుద్ధినిఁ గష్టపెట్టుచుం
బదపడి నేర్వఁగాఁ దగును పార్థివులెల్లరు దానిఁ గావునన్
బదిలముగాఁగ నీకవితఁ బొల్పుడు తత్త్వము వారికింపగున్.

వ. అనిపలుకుచుఁ గృష్ణాతటంబెక్కి తత్ప్రవాహంబు దెసఁ గాంచుచు

జయంతునితోఁడఁ బౌనపానచూషుమని తర్జనితో నిర్దేశించుచు

మ. కనుపట్టున్నను తీయమామిపెను మోకంగట్టంగాఁ బద్ధ యె
ట్టని చెంగావి మసుంగు చెందిరికచాటల్ బొల్చు చెంగుల్ మరుద్
ఘనవేగంబున నట్టులిట్టులు తటాత్కారంబు గావింపఁ గ్రిం
దనెవండో యొకఁ డత్యగాధమగు నిద్రం జెందుటల్ ముందటన్

శా. సద్యోముండిత శీర్షభాగచిబుకశ్మశ్రుండు కౌపీన మా
త్రోద్యద్వస్త్రపిధానుఁ డాస్యతల నిష్ఠ్యూతప్రభాంకూరుఁ డీ
యుద్యానంబున గుజ్జుమావికడఁ బన్నుండెన్ మహాబోధి వృ
క్షాధస్స్థానః సమాధినిష్ఠుఁడగు మాయాదేవిపుత్రుండనన్.

వ. అని చూపి చెప్పి, జయంతా! నేనచటికేఁగి చూచి చనుదెంచువాఁడ, నీవు కృష్ణాతీరంబునందలి విహారనౌకపై నుండుమని చెప్పి చన్న పిదప జయంతుం డాందోళికారూఢుండై విహారనౌక కడ కరిగె నదియు.

చ. గృహమువలెన్ విశాలమయి కేతనదీధితులెల్ల ప్రక్కలన్
బహుళములై చెలంగఁ బువుబంతులు తావులఁ జల్లఁ గ్రేవలన్
దుహినకర ప్రభాపటల దుగ్ధము లెల్లెడ వెల్లనై వఁగా
ముహురుపచీయమానరుచిపూరితమై వెలుఁగొందెఁ గృష్ణలోన్-

క. యువరాజ దర్శనోత్సుక
మవునొక వారాంగనా సమాజము నాట్య
ప్రవహణమందు నభినయ
ప్రవీణతను జూపఁగడఁగెఁ బరమోత్సుకమై.

క. అందొక ప్రౌఢాంగన ‘ కవి
కైందిర ’ యని పేరు గలది యేతెంచుచు రా
ణ్ణందను నభిముఖముగఁ బొ

ల్పొందగ వచియించి నిట్లుపోద్ఘాతంబుగ.

చ. కవికిని జిత్రకారునకు గాయక వర్యునకున్ సదస్సులం
దవగత శక్తిమై నభినయమ్మును బట్టెడు రోనెలందికిన్
లవమును భేదమన్నది కనంబడ దెందును బ్రాణికోటి కు
త్సవమును గొల్పి యాపయినిఁ దన్మయతన్ బొనరించు చుండుటన్

చ. కవియనఁ జిత్రకారుఁడన గాయక వర్యుఁడనన్ సదస్సులం
దవగత శక్తిమై నభినయమ్మును బట్టెడు రోనెలందినా
భువి నవ సృష్టికర్తయని పోల్పఁగ వచ్చును బ్రహ్మసృష్టి సం
భవమును జేయుచుంట భగవంతుని శిల్పము కాక వేఱొకో!

ఉ. వేసఁగి కాలమందు వినువీధిని గాడ్పులు నిప్పు గాల్ప నా
భాసము బొంది దప్పికకుఁ బొల్పెడు పట్టునను వసంతపుర
మాసము వర్ణనమ్ము మనసమ్ము నొసర్చునఁ దన్మయత్వ సం
న్యాసుని చేసెడిమెయి మఱచి తానది గ్రీష్మమటంచెఱుంగునే?

చ. విరహదవాగ్నిచే నొడలు ప్రీలి మనస్సు శ్రుతి యేమిలేక దు
ష్కరమయి కోర్కులున్ వితగఁబొఱఁ జలించి నితాంతనిద్రమై
యురలిన వేళఁ జిత్రపట ముంచిన నయ్యెడ, మేలుకాంచి యా
పరమును జూపదే? యువిద తా వలపింపదె? ప్రేమనింపదే.

ఉ. ఆలును బిడ్డ లెల్లరును నావురుమంచును నేడ్వఁ దండ్రి ప్రా
ణాలకుఁ బాసిపోయిన దినంబున నేనియు వృక్షకోటరో
ద్వేల భుజంగముల్ వినఁగఁ దేఱఁగ రాళ్లు స్రవింప గానమున్
జాలనచేయ నెవ్వఁడు శుచన్ బడఁగాఁగలఁ డక్షుఁడున్ వినా.

సీ. తొలికాలు దివిచి యావలికాలువైచి గి
రుక్కునందిరుగు నాకూపుఁజూచి
కనుఁగల్వలను వెల్వడిన సోగ చూపుల

గుదులపైఁ బొదలు సంపదలఁజూచి
కమ్మఁగూరుచుండి యాకసము వంకకుఁ జూచు
నెడ నిక్కి చనుఁగవ వెడఁదఁజూచి
తొలిచమత్కారంబు వెలయించు నెడల సం
ఫుల్ల పద్మముఁ బోలు మోము సూచి
తే. వెనుక కేఁగెడిపట్టుల వీలుసూచి
ముందునకువచ్చుపట్టుల ముద్దుఁగాంచి
కూరుచుండెడిపట్టుల సౌరుచూచి
రాయుడైనను గఱఁగు హర్షంబు పెలుఁగు.
క. అలయభినయమందున నం
దెలమ్రోఁతల నడయదల్పు దిటమగుకటకం
బులరాయిడిఁ జెమ్మటసో
నలుకుటెయుఁగఁదుమువఁగా మనంబుబ్బదొకో!
తే. అతివయిట్టులు చెప్పుచున్నంతలోనఁ
'గాయకంఠెను వోఁడిమ మొండాయె' నంచు
రొకతె గజ్జెలు ఘల్లన నూపెఁగాలు
నంతమార్దంగికధ్యాన మతిశయించె.
సీ. దీపించెఁగమ్మిచ్చు తీయుతీవియభంగి
రమణీమణీ మహారాగభంగి
రాణించె గజ్జెలు రవమొనర్చెడురీతిఁ
తరుణీ గళోద్గళత్తాన రీతి
ఒప్పారెఁదోలిమబ్బు లుఱిమినసరణిమా
ర్దంగికాభ్యస్త మృదంగసరణి
ఏపొందెరాయంచ యెలుఁగొనర్చినభాతిఁ

గాల క్రమోద్భూత తాళభాతి

గీ. మెఱు సెగీతంపుముంజేయి మేలుతాయి
పరివెఁజక్కనిఫణితిఁ బ్రబంధఫణితి
వరలెమేలై సజాతిగా వర్ణజాతి
యలరెమించునయంబున నభినయంబు.

ఉ. ఆయెడఁగృష్ణనీరజసి యాకసమంటెడు నొక్కమేడపైఁ
దోయజనేత్ర గోసతి కుతూహలదోహల యొర్తు నాట్యశి
ద్యాయుతనంబులైన గణికాంగనలం గను పొంటెనిల్చె నా
కాయజుఁడెల్లపేరెదలఁగాఁడఁగ నేసినబాణమో యనన్.

గీ. ఆడుచున్నారుగాని రోచేడెలందు
కాంచుచున్నారుగాని ప్రేక్షకులుముందు
కూరుచున్నాఁడుగాని రాద్దారకుండు
చిత్తమామేడపైని నొచ్చెల ! పరుండు.

గీ. ఎఱుఁగఁడావేళయందు నాయెమ్మెకాఁడు
సరవి నేతెంచి కూర్చున్న సంగడీని
నాట్యమొనరించురోయెలనాఁగపిండు
కాంచమూఁగినయట్టి ప్రేక్షకులదండు.

వ. అట్టియెడ.

శా. రాజద్వారముదద్దడంబున నగారా మ్రోయఁగా వారనా
రీజాతంబులు నాట్యమాఁగిరియథారీతిన్ ; శకుంతాళి భూ
మీజాంతంబులనుండిపాఱుగతినేర్మిన్ బ్రేక్షకుల్ వోయిరా
రాజున్ లేచెజనంబులొత్తిగిలఁగా రాయంచచందంబునన్.

ఉ. గాలముమేనఁగ్రుచ్చికొనఁగా బెగడొందెడుచేఁపవోలె భూ
పాలకుమారుఁడయ్యెడల బ్రద్దలువాఱిన డెందమొప్ప నాం

పోల్కికనెక్కె నాశ్వముచిత్రో, బయకారులుపోలె సేవకుల్
మూలుఁగుపోంకృతుల్ చనిరిముప్పదియిద్దఱుముందువెన్కలన్

ఇది
శతావధాని శివరామకవి ప్రణీతంబయిన
ముక్తాలత యను ప్రబంధంబునఁ
బ్రథమాశ్వాసము.

# ముక్తాలత.

## రెండవ యాశ్వాసము.



సీ. తారసించెనో లేదో తారకా మండలో
న్గ్రథితపాటల సౌధ మండలంబు
ఆచరించెనో లేదో యలవోక సౌగంధ్య
భరితశైలమున నభ్యంజనంబు
ఆరగించెనో లేదో యాలదుగ్ధముతోడ
నుదిత ధావళ్య శాల్యోదనంబు
కూర్కిఁ జెందెనో లేదో కోమలారు శేషక
ప్పసము పోలిన పూలపాన్పునందు
గీ. పూరితంబాయె మలయజమారుతంబు
మొగ్గదొడఁగె నవోద్యాన పుణ్యలతలు
ఒప్పఁ దొలఁగెను కృష్ణ వేణ్ణోదకంబు
వెన్న ముద్దయనంగొల్చె వేగుఁజుక్క.
శా. పూవిల్తుండు పురారి సంభవ పరాభూతిన్ బరిత్యక్త బా
ణావిర్భూతమనీషుఁడై చు దధిమాధాలోల లోలేక్షణా
లీవేణీ విషచేఁ గృపాణఘురళీలీలన్ బ్రభాతంబులన్
బ్రావీణ్యంబును బొందుచుండె భువన ప్రేమాజిగీషారుషన్.
తరు. శ్రుతికి నెక్కుడగుచుఁ జాలుపంచమంబు
పోఁకార్చె షడ్జంబు పోఁగ పోకాల్చె

తతమును ఋషభసంధానహీనమ్ము
దనరించి కాకువుల్ తాఁకకుండంగఁ
గతలు చక్కనిరీతి గ్రాహ్యంబులైన
గమనరీతులు సొంపుగాఁ గూర్చుచు 'సహి
ప్రతి' యనంగనవుడు వాడిరి చల్ల
వంది మాగధులనిష్పంద గాత్రమున.

వ. అందొకం డిట్లు పాడె

సీ. ప్రాల్మారె నాకాశ కల్పభూమిజశిఖా
తనుఫలంబనఁగ నౌత్తానపాది
సంపతిల్లెను మీఁద సప్తగవంబైన
బండినాసక్షి మండలంబు
పలుకఁబోఁ విమోగభరితాంగనాగండ
మండలంబనఁ జంద్ర మండలంబు
రాణించెఁగుంకు మార్ద్రంబైన కమలినీ
కందఖండంబనంగాఁ బ్రతీచి

గీ. అలనిశాపతి, నెంతయు నభిసరించి
శ్వసనసురభిళగంధిమై సత్వరముగ
నంబరాంతమ్మువహియించి యరుగుచుండె
రజనికామిని ప్రాతరారంభవేళ.

వ. కొండొకఁడిటులు పాడె.

శా. ఇందుస్వీడఁగవాడుఁజందనముమాయించున్ మృణాలంబులన్
నిందించున్ శతపత్రిలక్ష్మిఁ దెగడున్ సీహారహారంబులన్
జిందంజేయును నీదుకీర్తి విరహా శ్రీయుక్తయా కాంతనా
నెందేనిల్వక మూఁడులోకములఁదా నిట్టట్టు లూఁగాడెడున్.

వ. ఇటులు వంది సందోహ సంగీతసంబోధితులై

ఉ. మంగళస్నాతవస్త్రములు మండనముల్ సరిగాధరించి యా
యంగజుఁబోలెఁబొల్చినజయంతుఁడునాశముఁద్రొక్కి మత్తమా
తంగమునెక్కి గౌరజల్లద్దంబులనంగను రాజమార్గసా
రంగతులై ధనాంగనల రంగములుంగల వీధి నేఁగుచున్.

వ. ఆయెడ

సీ. చేతిచేఁ బల్లొత్తు చీరచే గోరొత్తు
దాఁచితి గంధంబు దాఁగు నెట్లు
చెంగుననెదపోటు చేతఁ బెంజడద్రేటు
దాఁచితి ప్రియకోక దాఁగునెట్లు
మూఁతిగాజులకోఁత పూఁతఁ గస్తురిగీఁత
దాఁచితి కాటుక దాఁగు నెట్లు
వంగి సిద్దురసొక్కు పొంగినాలుక సొక్కు
దాఁచితి కుంకమ దాఁగునెట్లు

గీ. అనుచుఁబలికి కవోష్ణ బాష్పాంబుధార
విడుచునింతినిఁ బ్రియుఁడల్ల వేఁడికొనుచు
మోఁకరిల్లఁగ సంతోసమునొకింత
దుఃఖమొకకొంత పొందె నాతోయజాక్షి.

వ. ఇటులు తచ్చేష్టఁగాంచుచుఁ బోయి.

చ. అనుదితపక్షయామయులయి యాజ్యులఁజక్కనిసామిధేనులన్
గొనకొనినాల్గురీతులఁగొనఁగూడఁగ సుస్వరమొప్ప మేలుదా
రినిఁబ్రకటించుచున్ మెలఁగు ఋత్విజులిచ్చెడునట్టిహోమముల్
గొనియెడునగ్నిహోత్రుఁ గనుఁగొందగ వారికి దవ్వుదవ్వులన్.

సీ. కూలంకషోచ్చల గోపురప్రాకార

పటలకేతన కళాభాసురంబు
ధీవరబాహుసాధిత జాలరంధ్రోత్ప
తితఝషోన్మేషసం దీపితంబు
తీరద్వయీసముత్తేజితావనిజాత
పర్ణమర్మర రవవ్యాపృతంబు
నీలనిర్మలజలాన్విత విస్తృతప్రవా
హాభ్యస్తశాంతి రసాంచితంబు
౯. ప్రవహణాన్యోన్య సంఘాతవలయితంబు
మారుతాపూర్యమాణ వంశారవంబు
శంకుహతిసూచ్య సంకేతజలతలంబు
చక్కఁగనఁబట్టెఁ దరువాత సహ్యజాత.
శా. ఏనుంగుందిగి భూమిపాలసుతుఁడెంతే మెల్లఁగాఁబోయి కృ
ష్ణానీరంబులపై గృహంబులనొగిన్ గన్నారఁగాఁజూచుచున్
దానానావనునెక్కనప్పుడు వెసన్ జాఁపన్ సరంగొత్తి సం
ధానించెన్ మరకాంద్రడ పింపు కరసంతానమ్మురన్ దేష్టులన్.
ఉ. ఆఁగెదనంచుఁదెల్పెను జయంతునిశోడశముంను, భూమినిన్
నాఁగలిచీల్చికొంచుఁ జనునాయమున్ జలమొత్తగించి బి
ట్టేఁగెను నావదానిఁగని యించుక నాశముఁడక్కడంబు కై
కోఁగఁదాఁకాలున్ విశదకూలముపీఁడి జలంబుమధ్యగాన్.
క. చనునావ కానఁబడమిని
వెనుదిరిగెనునంతలోన వెలఁదియొక ర్తా
తనికడ్డమయి నమస్కృతి
పొనరించి 'మీఁదాసిచూచి పోవఁగఁగోరున్'.
వ. అని తెలిపిన విని యాశమునుఁ కృష్ణాప్రవాహంబునఁ దేలి

యూహు మహానేకయననొప్పు మలయసేనా ప్రాసాదంబు
ప్రవేశించె నంత.

ఉ. తాలిమిఁజెందిమ్రోఁగు నల తంబుర నక్కడనిల్పఁబెట్టి కై
కోలొనరించియున్నసుడిగోరది యున్నది యున్నటుండ నీ
లాలకజాలముల్ ముసరి యానన మందములీనుచుండ 'ము
క్తాలత' వచ్చెఁదానెదురుగా 'శముఁ' గాంచుతలంపుపెంపునన్

శా. పూర్వాచారపరాయణత్వమున నాపూఁబోఁడిభాసించుచున్
దూర్వాలంకృతమైన చౌకమునయందున్నిల్చి శాంతంబొగిన్
సర్వాంగీణముగాఁగఁ బొల్పఁగ నమస్కారంబునుంజేయ నా
శీర్వాదంబొనరించె నాశముఁడు వాసింబొల్చు నుచ్చారణన్.

శా. ప్రాసాదంబును నెక్కరంతటఁ దటీప్రాంచద్ఘటీసంహతి
వ్యాసక్తప్రసవంబులం దగులుచున్ వార్ధిదళంతంత, న
భ్యాసప్రౌఢిని లేమయొక్కతె యథాన్యాయ్యంబుగాఁ బీఠవి
న్యాసంబుం బొనరింపఁగా శముఁడు తానాసీనుఁడాయెన్ రహిన్

వ. అపుడాస్థలంబేకాంతంబుసేసి యందఱుచన్నపదపడి శముండిట్లు

క. నీమాత మలయసేనకు
సేమమె? నీతమ్మునకును సేమమె? నీకున్
సేమమె? విద్యావ్యాసం
గామోదమువడయుచుందువా? యహరహమున్.

క. అన విని ముక్తాలత, యో
యనఘా! మీనిక్కవంపు టాశీర్వాదం
బున నమకూరెను సర్వం
బును గీవనలెటులుమీవి పొల్లయిపోవున్?

ఉ. మాడలువెచ్చపెట్టెనను మాయురె? మీదగుదర్శనంబుచే

కూడదు పున్నెముల్ తొలుతఁ గూడఁగఁ బెట్టఁగఁ బోలునాకు నే
పాడినె మిమ్ముఁజూతునని యంటిని వీరలతోడ నిన్ననే
'యూడఁగఁబోవుతీర్థ మెదురైనది' నేఁడిటమాకుఁ జూడుఁడా!

చ. చదివితిమిందు నేకగురుసన్నిధిఁ జిన్నతనానఁ గొన్నినా
ళ్లదియునుఁగాక మీరలపుడప్పుడు చింతనచెప్పినార లీ
యదయత నేఁటఁగాక మఱియప్పటఁ గల్గెనె? వారకామినీ
సదన మిదిం తకుఙ్ మదిపసఙ్ మిము నాఱడి పెట్టనేటికిఙ్

సీ. కొలమున లేకున్న గొప్పఁదనంబు పెం
చియుఁ జెప్పఁబోవ నా చేతఁగాదు
ఉన్న గొనంబులే యొకసాంద్యైనను
వచియింపనా కోడఁ బాటుకాదు
అనవరసంబులై నట్ట్రిప్రసంగంబు
కొలుపంగ నాకియ్యకోలులేదు
అందఱతో పాటు నాచరింపఁగ నంత
రంగంబు నాయది రాయికాదు

గీ. మీ కయో ద్రేకమునఁ జేసి యేదొ గీతి
తెలిసి చేకూరి యున్నది, దీనికీటులు
ఇటులు చెప్పిన నతిశయం బెఱుక పడును
ఎటులలో చెప్పంగ వలెఁగదా వృత్తములను.

ఉ. ఈ కొలపుం బ్రసంగముల నెత్తిన కొందము చంద మెల్లఁ జీఁ
కాకయి పోవునిందు జనిఁగాంచి యొకింత తెల్వి తేటలన్
జేకొను టొక్క తప్పిటులు జెప్పట యింకొక తప్పు కాన నీ
కాకులముందొ ఱంగు విధ్యై తపియించెద నెల్ల వేళలఙ్.

క. అని చింతాకులమై యా

తని పాపము లంటఁబోయి ‘ తాఁకిన చో నం
టును బొందు మీశరీరం
బును గొనియెద ’ నంచు వెనుక కల్లనఁ జనినన్.

వ. అని విని శమ్ముండు కరుణాభరితుండై ముక్తాలతం గాంచి

ఉ. తాఁకుట తాఁకకుండుటయు దాపుగ నుండుట దూలనుండుటల్
తేఁకువలేనివారు గణుతించెద రూరక యంతె కాని ము
క్తాఁకలు తీరు జ్ఞానులటు కాదని బోధ యొనర్తు వారికిన్
మోఁకరిలంగఁ జెల్లును నమోనమ యంచు నితంబినీమణీ!

చ. కొలమునఁ జేసి దోసము నగూడునె? బుద్ధుఁడు క్షత్రియుండు; వ్యా
సులు నొకపల్లెదానికిని సూనుఁడు; నీతులరీతిచే మహా
ర్షులకును వంద్యుఁడై నవిదురుండల నాలవజాతివాఁడు; వీ
రలకును నెక్కుడయ్యెదరె! బ్రాహ్మణులెందఱు గాడిఁ జేరియున్.

మ. కులభేదంబులు లేవటంచు దెసలన్ ఘోషించెఁ గోటాన కో
టులు లోకంబులు నాఁటి బిడ్డ తలిదండ్రుల్ జ్ఞానుఁ డౌనట్టు ల
చ్చలమౌ బోధ మొనర్చె నెల్లెడ నహింసాధర్మముం జాటె మే
పులకింపంగను బుద్ధులం గఱపె నా బుద్ధుండు సామాన్యుఁడే?

ఉ. కుండలఁ గ్రుమ్మరించి చనెఁ గోమలమౌ పదగుంభనంబుతో
మెండుగ నెల్లకోటులను మేఘుఁడు నీరము చల్లినట్లు వ్యా
సుండు శ్రుతిగ్రహణంబు పరిశుద్ధుఁడు తత్త్వరసాయనంబు బ్ర
హ్మాండము ముక్తి చెందు నటులాతఁడు గొండికయే! కొలంబు చేన్

ఉ. అగ్నిబలెన్ విశుద్ధుఁడయి యాదట నింద్రియజాలవాసనా
మగ్నుఁడు కాక భూమిజ సమాజ విరాజిత కాననంబునన్
నగ్నతఁ జెందితత్త్వమును నారసి మానసి ధర్మదేవతా
లగ్నుఁడు కాఁడె? జ్ఞానముకలన్, విదురుం డతఁ డల్పుఁడయ్యెనే?

వ. అటులుకావున,

ఉ. తాఁకుటతాఁకకుండుటయు దాపుగనుండుటదూలనుండుటల్
తేఁకువలేనివారు గణింతించెద రూరక యంతెకాని ము
క్కాఁకలుతీరుజ్ఞానులటుకాదని బోధయొనర్తు్రివారికిన్
మోఁకరిలంగఁజెల్లును నమోనమయంచు నితంబినీమణీ!

వ. అని యిటులు దీర్ఘోపన్యాసంబు సేసిన విని యామ్రుక్తాలత.

సీ. జీరాడుక్రొంబట్టు జిలుఁగుఁబయ్యంటలోఁ
బాలిండ్లు రారాపు పట్టుచుండ
అవలగ్నమందు నింపారు నౌద్ధాణంబు
కూయని పింపిళ్లు కూయుచుండ
ముంగాలిమునివ్రేళ్ల మొకరిమట్టెలమ్రోఁత
మధురనిక్వాణంబు మనుచుచుండ
కోటీరుసందంబు కొంచెంబుగాఁజేయు
సాపట తీరి చూపట్టుచుండ

గీ. గండపాళిలసందంబు పండుచుండ
అవటుదేశంబుపై జడయాడుచుండ
బ్రాహ్మణోత్తమమ్మృదుపాద పల్లవముల
నంటికొంచు నమస్కార మాచరించె.

వ. ఇటులు నమస్కరించి కూరుచుండి

సీ. ఎన్నాళ్లనోయుండి యెదుటనమస్కార
పరిపాటి నాచరంపంగఁ దలఁతు
ఎన్నాళ్లనోయుండి యేకాంతగోష్ఠిలోఁ
బాడిగా ముచ్చట లాడఁదలఁతు
ఎన్నాళ్లనోయుండి యిూజీవిభావిజీ

విత చరిత్రము కొంత వినుపఁదలఁతు
ఎన్నాళ్లనోయుండి యేఁకరియున్న కం
దోయినిమిముఁజూడఁజేయఁదలఁతుఁ

గీ. గోర్కు లన్నియు నేఁడొడఁగూడెఁగాన
దీనిపైఁ గొంత మీకుఁగన్నానెఁగాన
దేవుఁడీరీతి మిమ్ముఁలఁ దెచ్చెఁగాన
నేఁడు సుప్రాతమైనదీ నింద్యజీవి.

చ. ఒకతెకు నిష్టుఁడైన సఖుఁడు గ్మలిపై వలపూనఁబోవఁడ
గ్లోకనికి నిష్టమైనసఖి యుంపద యాతనిమీఁదఁ బ్రేమ, యొం
శోకళులకున్ సమానముగ నూర్జితమానవలపున్నచోఁ బ్రశ
స్తికిసది హేతువౌను సుఖసీమకుఁ బెట్టనికోట యయ్యెడిన్

శా. నేనీలోకమునందు నొక్కనికినై నిర్మాణమైతిన్ ద్విజే
* శానా! నిక్క మిదెంచుమీ! యతనియూష్మస్పర్శముల్ తక్కనొం
డైనన్ గిట్టవునాకు నీవిషమువిన్యాసంబునందున్న నే
నానందంబెటులూనుదాన! నలవాఁడానందముం జెందమిన్.

వ. అని చెప్పఁగా విని శముండు చిఱునవ్వు వెట్టిన నెమ్మొగంబు
త్రిప్పికొని గవాక్షంబులోనుండి తొంగిచూచి సూర్యభగ
వానుం డిదె వెలుంగొందువాఁడని తెలిపె నాయెడ.

చ. అరుణములైన పద్మముల కళ్ళులుచాఁచి ద్విరేఫమాలికల్
గురువుగనున్న తేనియలఁ గుత్తుకబంటిగఁ ద్రావి మత్తుచేఁ
దరుణి కటాక్షపాతములు తామనుకొంచటఁ గ్రుమ్మరిల్లఁగాఁ
గరకర ప్రొద్దొగిన్ బొడిచెఁ గమ్మనిగాడుపు వీచె దిక్కులన్.

వ. ఆయెడ నాముక్తాలతయు మంథరంబుగాలేచి శముని నెమ్మొ

---

* 'శ' 'ను' అను నక్కరములు, ఊష్మస్పర్శములు, అని గూఢార్థము.

గంబుఁ గాంచి సూర్యభగవానునకుఁ గేలుమోడ్పుసంధించి
మఱలికూరుచుండి మెల్లఁగా నిటులనియె.

శా. నాకున్నంతటి ప్రేమ మాతనికినిన్ దానుండునో! యుండదో!
లే కొక్కింతయు లేనె లేదో! తెలియన్, లీనంబులై యుండు నీ
యాకారంబు లెఱుంగఁగా వశమె? శేషాద్రీశు పెన్ గాథలన్
దాకట్టుంచెద మీకు నయ్యెడల నా తద్జ్ఞత్వమున్ దెల్పఁగన్.

సీ. కొలముసాములు నవ్వుకొందురుగాక యీ
కూఁత, 'కులానుకూల' యంచు
కన్నతల్లికడంగి కన్నార్చుఁగాక యీ
'రాలుగాయ, పరాస్తశీల' యంచు,
పొఱుగువారలు నాడిపోసికొందురుగాక
యీ త్యాఁగ సౌఖ్యమ్ము లెఱుఁగదంచు
తోడిసానులు దూఱి దొరకొంద్రుఁగాక యీ
'చెనఁటి పూవిల్తుపూజింపదం' చు

గీ. కొంటె గోపాండ్రు కూడి రేఁగుదురుగాక
యిష్టసఖుఁ డిది కొలమున కీడుకాద
టంచు రోయునుగాక యీయంతరంగ
మతనియందె విలీనమై యలరుఁగాక.

చ. ఇఁక మలయానిలుండు ప్రవహించునుగాక దిగంతరంబులం
దిఁకఁ బరిపూర్ణచంద్రుఁ డుదయించునుగావుత మంబరంబునం
దిఁకఁ గుసుమాయుధుండు రచియించునుగాకనురాగముల్లమం
దిఁక రచియింత్రుగాక సుకవీశ్వరులున్ రసవత్ప్రబంధముల్.

క. ఇటు వాకొని ముక్తాలత
ఘటితాంజలియగుచు నిలువఁగాఁబడ శేముఁ డ

ప్పటి కేమియుఁదోఁపక త్రో
క్కుట పడుచును మూక భావ కలితుండాయెన్.

క. ఆసమయమ్మున యందున
భాసురమయి శబ్దశాంతి పరఁగియెయున్నన్
డాసెను హృదయమ్ములలోఁ
గాసట బీసటగఁ బ్రళయకాలారవముల్.

వ. ఇటులు కల్లోలంబైన మానసంబున నాశమును

సీ. అనురాగసంపత్తి నాదరింపఁగవచ్చుఁ
దప్పించుకొనరాదు దానివ్యాధి
మోహమున్న లతాంగి మోముచూడఁగవచ్చు
దాఁటిపోఁగారాదు దానిచూపు
హృదయరహస్యంబు నెఱిఁగింపఁగావచ్చుఁ
దారసింపఁగరాదు దానిపీడ
అతిదీనవాక్యంబు నాలకింపఁగవచ్చు
మానుపింపఁగరాదు దానిమొదలు

గీ. చెలియనెమ్మోని సముఖంబుఁ జేరవచ్చుఁ
గానితప్పించుకొనరాదు దానితాఁకు
పలుకవచ్చు నసత్యసంభాషణంబు
కానితొలఁగింపఁగారాదు దానిచేటు.

వ. అని తలంచుచుఁ బ్రత్యుత్తరం బెటులు చెప్పను దోఁపక
కొంతవడికి డగ్గుత్తికవడిన యెలుంగుసేసి

ఉ. నీయభిసంధియున్ ధృతియు నిక్కువమైచలియింపకున్నచో
న్యాయముగాఁగనుండెడుఁజామాతుదిదాఁకనునిల్చియుండిమేల్
చేయనిపించుకోఁగఁ బ్రతిచేష్టితమందున దుష్కరమ్మ ప

ద్మాయతః చనా! జయమునందుము నీయభిసంధియందునన్

వ. అది యెట్లుండె

శా. రాఁబోవున్ యువరాడ్వివాహసుముహూర్తంబో సతీయెచ్చటన్
వేఁబోకల్ మలుసంజలం చనక యే, విద్వత్సభారంగముల్
కాఁబోవంగఁ బ్రయత్నముల్ సలుప సంకల్పించియున్నాఁడె నీ
పైఁబో బెంపఁగఁబోయివత్తు హితభావప్రీత! ముక్తాలతా!

వ. అనవిని యా ముక్తాలత

ఉ. కంటకితాంగియయ్యు నవికాసితిఁగానఁగనీక కాఁక చే
నొంటరిమింటరంబులగు నూర్పులు పుచ్చక భాషణంబులన్
గొంటెదనంబు చూపకయె క్రోలెను వాని మొగంబునందముల్
కంటనె, తుమ్మెదల్ విరియుకంజము లందలి తేనియల్ వలెన్

వ. పదపడి

ఉ. నాతుక రాజుపల్లెరమునన్ గనులన్ మిటుమిట్లు గొల్పు రు
గ్జాలము చేతి మెఱ్ఱుజలజాతము చేయఁగ స్నిమాల స
గాలము నసి వాని కరకంజములందిడి తాల్పుమీ! యొగిన్
'బ్రీతికి దూతియీయదిచుమీ'! యనిమెల్లఁగనాచిపల్కినన్

ఉ. మట్టెలమ్రోఁతతోఁ గలిపి మంగళగానము తేంట్లు పాడఁగా
నట్టులొసంగిపల్కు చెలియాలిని నారసి 'కొట్టుమీనుతా
కట్టి' దియేలపెట్టితివి కావఁగఁజాలనునేను దీనిఁ జే
పట్టఁగజాలనయ్యెదిను బాలకురంగవిలోలలోచనా!

వ. అని పల్కు యాశోచుంఁడు మఱియు

శా. రాజాంతఃపురకామినీగళములన్ రమ్యప్రకాశంబుతో
రాజిల్లందగుఁగాక యెల్లపుడు నీ రత్నాలపెందండ యీ
నేజోహీనుని కంఠసీమ భరితాతిశ్రద్ధమై వైచుచో

గాజుల్ వాటిస్వకీయకాంతికిఁ జెడుం గాదొకో ముక్తాలతా !

వ. అని పల్కిన నాముక్తాలత నెమ్మోము ప్రొవ్వాళ్లుసేసినఁ జూచి శముండు తన యెదయందు.

గీ. చూపుతాఁకునఁగందునే సొబగుఁదనము
మాటవినుకలిఁగరఁగెడి మానసంబు
గలదియీసుకుమారి నాపలుకుఁజేసి
వదనపద్మంబునీటులు ప్రొవ్వాళ్లుసేసె.

సీ. మావిచిగుర్లు గుమ్మోవి కదలఁబల్కి-
యెలగోయిలలను గూయించుఁగాదె
కమ్రగాడ్పులచేతఁ గదలుముంగురులచే
మించుతుమ్మెదల నాడించుఁగాదె
కెలసంపుమధువాను క్రేఁగంటిచూపాన్చి
వలరాజుచేవిల్లు పఱుపుఁగాదె
అలవిశారదమైన యాస్యంబుపై కెత్తి
యిందుచేజ్యోత్స్న కాయించుఁగాదె

గీ. కూయవిప్పుడుకొంతేనిఁ గోకిలములు
ఆడవిప్పుడు కొంతేని యళికులములు
పఱపఁడిప్పుడు విలుకొంత పంచశరుఁడు
కాయఁడిప్పుడు వెన్నెలల్ కంజవైరి.

క. అందముకల వస్తువులవి
వందుఱునేనియును జూచువారికి నేదో
యాఠం [illegible]కతీరగు నా
నందంబుదయింపఁ బోలునాకుంబలెనే.

వ. అని తలపోయుచుండ నంత.

మాయునో! పంకేజదళసమంబులు మోవఁగ
మాయునో! కాయలుకాచునో?
యీయదది యుప్పదియ మీకు నెందులకుశ్రమల్.

క. అనుచితుల శముని ముంగల
గను జని యతఁడీయ సందుకొని చాతుర్యం
బుఁ మాటలఁగ సంపాదిం
చిః మాదిరి సంతసంబు చేకూర్చుకొనెఁగ.

వ. తదనంతరంబున ముక్తాలతంగాంచి యామలయనేఁ

సీ. కూరుచున్నారు నీకోసమై చెలులెల్లఁ
జలిఁదక్కి పసిఁడికంచములముందు
వేఁచుచున్నాఁడు నీవేసంబు సవరింప
దర్జియతండు సౌధంబునందు
చూచుచున్నాఁడు నీశుభదర్శనంబుకై
యగిసాలెవాఁడు రేపాడినుండి
కాచుకొన్నారు నీకై కొందఱుకుములు
గలపరించుచు నెత్తపలక పట్టిచి

గీ. ఎంతమధురిమ యెంతటి ఋజిమ యెంత
యెంతనాధిమ యింకను నెంత యెంత
పండితిమ కలవారలో వారు, మూతి
ముడుకటించితి వోరంతప్రొద్దునుండి.

వ. అని పలుకుచు శమునిదిక్కు మొగంబై

ఉ. నేఁటనె మీసమక్షమున నేత్రము సల్పుట మాత్రకాద యే
పాటను మీజపంబు నెఱపుంజుఁడి భక్తిగ నాకొమారి యే
తోఁటనుజూడ మీపట మెదుర్పడు పూజలఁగొంచు నేటికిఁగ

మాఁటుమఱుఁగుననియవిశమా! కుసుమాయుధునానకాన్పమా!

వ. అని మఱియు నేమోపలుకంబోయిన

క. కినుకొని యామక్తాలతి
చనుదెంచుచు నుంటిఁగాదె సత్వరముగ నో
జనని! యేటపలుకఁగ వల
యునో తెలియద యెంత్లు వచ్చియున్నను నీకున్.

వ. అని పలుకుచుఁ గటకటంబడి మలయసేనతోఁ జనుదెంచిన దాసిఁ బిలిచి

ఉ. ఇంపెసలార మాలకరి యింతియుఁ గ్రుచ్చిన పూలదండ వే
యింపుము సుందరంబుగను నేనిక పైఁడపు వోలుపందుఁ, బా
యింపుము గంగసింధురము నేనిక పాముసయందు వేగ రా
నింపుము మేఘమట్లముగ నిప్పని మాపటివానిచే నోపన్.

వ. అని చెప్పపంచిన సంతఁ గృష్ణాస్నానంబు నిర్వర్తించి యలంకృతయై.

సీ. కటకటఁకటి నొచ్చి పటకనార్చినభంగిఁ
గాంతిపుంజంబు నల్గడలఁబాఱ
రాకాపరార్ణాంతరవిశజాంకులరీతి
బంగారుగంటలిర్వంక మెఱయ
కాలకాకోదనోద్వేల స్ఫటయసంగ
నెత్తి పట్టినతొండ మింపునింప
అంజనాద్రికిఁ బైని నరుణబింబముఁ బోలె
జంబువాచోడోలు చొకళింప

గీ. స్థూలముక్తాలతోరు వక్షోజములకు
మచ్చరంబునుజూపు కుంభస్థలంబు

అభ్రవీథికయందు దీపారుచుండ
వచ్చె నొయ్యారముగ మత్తవారణంబు.

ఉ. వచ్చినదానిఁగాంచి యలవారసతీమణి దాసియోర్తు పె
న్నిచ్చిన మావటీనికిని నేర్పలరారఁగ మేడనుండి యం
దిచ్చిన భద్రబాహుఁడయితీయుచు నాచతురంతిఁడోలికన్
గ్రుచ్చియుఁబట్టి నాశమునకుంజను మార్గమనర్గళంబుగాన్.

వ. సమనంతరంబున నాశముఁండు వారి నమస్కారంబు లందికొని యీశ్వరానుగ్రహంబున మంగళంబుకావుతమని యాశీర్వదించి మేడపై నుండినిశ్చలంబుగానడచియేనికగున్నపై నధిష్ఠించెనంత

సీ. పాదవిన్యాస సౌభాగ్యంబు వీక్షించి
యబలాజనం బట్టు లభ్యసింప
సౌవర్ణఘంటికా స్వానంబులాలించి
నెలఁత లాగతి పల్కునేర్చికొనఁగ
కర్ణికాకౌశల్య గరిమంబుకాంచి స్త్రీ
లాగతిఁ గౌశల్య మలవరింప
శాంతిమైన మొగంబు సంపత్తిచూచి స
త్సంఘంబు లెల్ల శిష్యత్వమొంద

గీ. నడల సొబగులు గంటల నాదములును
గర్ణికాకౌశలంబు మొగంబుడంబు
చూపుచునునేఁగె గజము ఘంటాపథంబుఁ
గడచి ముక్తాలతాకట కములుదాఁటి.

ఇది

శతావధాని శివనామకవి ప్రణీతంబయిన
ముక్తాలత యను ప్రబంధంబున
రెండవ యాశ్వాసము.

# ముక్తాలత.

## మూఁడవయాశ్వాసము.



సీ. ప్రతిరాజభవనంబుపై నాకసంబంటి
యెత్తు జెండాల గుంపెగురుచుండె
ద్వారదేశములందుఁ బార్శ్వరంభాభిరా
మంబులౌ జలకలశంబులుండె
బంగారు నగలచే రంగారురాట్కన్య
కలు జరీ గాఁగరాల్ గట్టినారు
క్రొమ్మావి మేలియాకుల తోరణంబుల
గుజ్జుపుంబీఁటలఁ గ్రుచ్చినారు
గీ. ఆపణంబుల విపుల ఘంటాపథముల
నగరులందునఁ జేయుచున్నారు పెక్కు
కర్మకరులెల్ల నూత్నసంస్కారములను
ధరణి కోట పురీ వరాంతరమునందు.
సీ. దిగుచునున్నారు చెందిరికపాగాలతో
నేలికల్ మేలిమోసాలముందు
చేయుచున్నారు మిశ్రిత వేదఘోషముల్
బ్రాహ్మణుల్ కొబ్బరిపాకలందు
వార్చుచున్నా రెల్లవంటగుండిగెలఁ బెం
డ్రాళ్లతో రాజసత్రంబులందు

కూడుచున్నారు మిక్కుటముగా విటులు వా
రాంగనా క్రీడా గృహంబులందు
గీ. పాటలాధర లోయలఁపాటఁబాడి
యానుచున్నారు నారికేళాసవంబు
అరఁటి దోప్పలయందు నిండారనించి
వల్లభులతోడ నుద్యాన వనములందు.
గీ. ఇన్ని చోటులయందున నిన్ని విధుల
టంచు నేలన్ని చోటుల నన్ని విధులఁ
గ్రాలుచున్నది చాల శృంగారరసము
పెంచి శృంగారయోని సృష్టించినటులు.
వ. ఇటులు ప్రతివ్యక్తియుఁ బరిత్యక్తసుఖంబును, ఆసక్తసుఖంబు
నునై యుండ, మలయకేసయుఁ గృష్ణానది యావలినుండి
యీవలికిఁ దోరణంబులు మొదలయిన నూతనాలంకారంబులఁ
జేయించెఁ గ్రీడానౌకల నిలిపించె మఱియు
శా. ఎత్తించెన్ శిఖరంబులన్ గసటునన్ సీటార్చి జెండాలొగిన్
మొత్తించెన్ మృగనాభి పంకములచే మేడల్ సమగ్రంబుగా
హత్తించెన్ మణిమాలికల్ వరుసగానాయాయి కుడ్యంబులన్
ముత్తోనుండి గడించువస్తువులకున్ ముచ్చట్లు చేకూర్చెన్.
వ. ఇటులు తన యింటనే పెండ్లియగు చందంబున నంతయుఁ
జైసేసి విలాసంబుగా నొక్క మృదుశిలాతలంబునఁ గూరు
చుండి యొక బందుగుఁ బిలిచి ముక్తాలత యేమి చేయుచున్న
దో చూచిరమ్మని యానతివెట్ట నదిపోయి కొంతవడికిఁ దిరిగి
వచ్చి.
క. పొలుపగు నుప్పరిగెను దా

విలపిల్లి తదేక దీక్ష వీక్షించుచు న
గ్నలితో శ్రీనాథుని గా
థలఁ ద్రవ్వుచు నున్న దేకతంబగు నునికిన్.

వ. అన విని యా మలయసేన విస్మయంబొంది, ఔరా! శ్రీ
నాథుని గాథలఁద్రవ్వుట కిది విరక్తి చెందెనా యేమి? యని
స్థూలంబుగాఁ బలికిన నగి.

క. కాదమ్మా, నీకెంతయుఁ
జేదస్తము పోవలేదు శ్రీనాథుఁడనన్
గాదే! కవీశుఁ డతఁడను
వాదించెన్ గాథ లతను బలగాథలుగాన్.

వ. అనిన విని యాలోచనా యుక్తంబుగ మొగంబు సేసికొని
యా మలయసేన, మఱల 'దాని యిష్టసఖులెవ్వరు నచట
లేరా'? యని ప్రశ్నించిన విని.

ఉ. నిన్నఁట నొక్క మాదిరిగ నేఁటను నింకొక తేఱు తీరుగా
నున్నవి నీని చందములహో సుమధన్వుని దెంతకాఁక యో!
కన్నెతనంబు నింతపడిగాఁ దెమలించె నటంచు నవ్వుచున్
గన్నులు గీఁటికొంచుఁ జెలికత్తెలు పోయిరి వారియింట్లకున్.

వ. అని చెప్పఁగా విని సంశయించి దాని నెమ్మదికి నొవ్వి కలుగ
కుండునటులు, 'కరాళనిటకుఁబంపుమని' సెప్పియావలికిఁబంపి నెంచి

ఉ. తావి యెటన్ గుబుల్కొనఁగ దానికిఁ దోరణకట్టఁతు ఘ్మెదల్
పూవిలుకాని నారి యని పోలుపఁబట్టయి చెంగలించు క్రొం
బూవులదండనొండొకయిఁబూనుచుఁగూఁతునుజూచునిచ్చమై
జేవదలిర్పఁగా మలయసేన చనెన్ వడి మేడమీఁదికిన్.

వ. ఇటులుచని యామలయసేన యంగనంబుననుండి లోపలనుండి

వీఁతెంచుచుండిన యొక్క యెలుంగు నిటులు వినియె

గీ. సుఖముతో మీఁకుఁ బనియున్నఁ జూచికొండు
పెక్కువిధములఁ బ్రయతించి యొక్కప్రియుని
నెచట నెది లేనితో సుఖియింప రాదొ
అట్టియనురాగములను మీఁరిందనేల ?

వ. ఇటులు వినుచు లోనికం జని యొక్క వేదికమీఁద నానికొను
టకుఁ దాఁచిన రాతికి నాపూమాలవైవ నది జాఱుటయు
మలయనేన పైకిఁ ద్రోయుటయు మఱలనది జాఱుటయుఁ గా
నుండఁ గొంతవడికి ముక్తాలత కాంచి

కం. రాతికిఁ బూవులు ముడిచెద
వేతత్కార్యంబు చూడ నీహీకాదే
చాతుర్యము కై వలసిన
మాతా ! యొక మేకుపాతి మఱి నిల్పుమొగిన్.

వ. అనిన విని యమ్మలయనేన

కం. ఈకాలపు సంగతులవి
నీకుం దెలియవ కౌమారి ! నిర్మలకుసుమా
నీకంబులనున్ రాతికె
చేకూర్తురటంట వినయ శీలము లొప్పన్.

వ. అని మఱియు, నయ్యది నాచేతఁగాదు నీవెయటు లొనర్ప
మనినఁ దెలిసి నగి యాముక్తాలత ' అగును; రాతికెకూర్తు '
రనిన మాఱుమాటాడ కుండునంతి

ఉ. కాయము పండి ప్రత్తివలెఁ గాంతులచేఁ దెలుపారియుండినన్
రాయియనన్ జెలంగెను కరాళ యరాళవిలాసలీల వా
త్స్యాయన కోహళాదులగు నయ్యల భావము క్రొత్తగీతిగా

మాయలమారి వేశ్యలకు మాటిచి చెప్పుచు వచ్చెనచ్చుగన్.

వ. ఇటులు వచ్చిన కరాళిం గాంచి మలయకేతన యాదరించి యొక్క పీఠంబు నెట్టె కూరుచుండఁజేసి మిగులువారల సముచితంబుగా గౌరవించి కరాళి దిక్కు మొగంబై

ఉ. కాయజుఁ గన్నవాని మెడ కౌస్తుభమైనను దెచ్చి యిత్తు వ
ధ్యాయములైన సంగతుల నెన్నియొ చెప్పఁగఁ జాలు నీవు వా
త్స్యాయనకోహళాదులకు, నంత చమత్కృతి కల్గు నిన్నునన్
మాయురె! నన్నుఁ బోలునొక మానిసిస్తోత్రముచేయఁజాలునే.

వ. అని కొండాడి ముక్తాలతకుఁ గరాళి బుద్ధి నైశద్యంబు కొంత యెఱుకపఱిచి తానేదో యొకపని కల్పించుకొని క్రిందికిం జనియె నంత నాకరాళి ముక్తాలతం గాంచి కొండొక యుపోద్ఘాతంబు సెప్పికొని యిట్లనియె

ఉ. అందము చందమున్ వలపు యౌవనదర్పము పేడి నేత్రవి
స్పందవనోవిలాసయయి వారవిలాసిని కామిలోకమున్
జందన మాకువక్కలనె సత్కరణం బొనరించి పాడి యా
నందము వెట్టె నొక్కములు నాఁచికొనన్ వలెఁ దెల్విదేటలన్.

వ. అని యిటు లుపన్యసింపఁ బోవుచుండ

సీ. పుష్పాడి మైపూసి పూనీట జలకంబు
సలుపంగ సరియైన సమయమాయె
చాకిత తెచ్చిన జలతారుగాఁగరా
తడిపి యారఁగ నైచి దాసి వేచె
వేంకటేశ్వరపాద విన్యాసమొనరింప
నైష్ఠమోత్తముఁ డదే వచ్చు వాఁడు
ప్రతిమలఁ బూజింపఁ బరిశుద్ధుఁడై స్నాత్క

శేఖరుం డిపుడె విచ్చేయఁ గలఁడు

గీ. అమలకృష్ణాసముప్రవాహంబు నుండి
దిగుచున్నది మరనుండి తియ్యనీరు
చెఱువులోనికి, దాని వీక్షింప నిన్నుఁ
గోరుచున్నాఁడు భటుఁడు విచ్చేసి యుండు.

వ. అని తెలిపిన విని కొంతసడి యూరకుండి మొగంబు విప్పా
ఱిన కెందమ్మి ననుకరింపఁ గరాళిం గాంచి యమ్మరాళగమన
కడునెమ్మదిగా నిట్లనియె

శా. నేనే మీశుభదర్శనంబు మదిలో నిక్కంబుగాఁ గోరుచున్
దానుండంగను మీరె వచ్చితి రపారంబైన యానందమున్
బూనం దానలమయ్యె నాకు నిదియే పుణ్యాహమిన్నాళ్లకున్
గానన్ వస్తురె! మిమ్ముఁబోంట్లిటులు వక్కాణింపఁగా నింక్లకున్.

క. అపచారము సహియింపుము
కృపతో, నాచేయవలయు కృత్యంబులు కూ
రుపు చెందియున్నవి పౌన
ర్భవాంశు నెడలంగ వలయుఁ జూనె కరాళా!

వ. అని పలికి తా నాసనంబునుండి దిగ్గన లేచినఁ గని సంభ్రమం
బుతో లేచి యందఱు నాకరాళునితోఁ జనిరంత నాముక్తాలత
యుద్యానసంబులోనికి మంథరంబగు గమనంబునఁ బోవ దాసీ
జనంబులును జుట్టుకొని పోయి రచట

గీ. అమలకృష్ణాప్రవాహంబు నందునుండి
చెఱువులోనికి నీరు రాఁజేయుపట్టి
మరల నొక్కఁడు చూపింప మదులఁ దనిసి
యెల్లవారును నాశ్చర్య మొగసికొనఁగ.

వ. ఇటులు చూచుచున్నంతె

ఉ. మేఘములన్ని యెంతయు సమేఘములై పొలుపారి యున్ననున్
గోలగఁ గూయు కూఁతలనుఁ గొక్కొరబిక్కొరమై వినంబడన్
డాలగు తెప్పుటల్ గలసి డాంకృతు లీనఁగఁ, జూచు పొంతు ము
క్తాలత మేడపై కరిగె దాసికలందఱు సెంట సంటఁగన్.

క. ఒక గుంపు వచ్చుచుండెన్
గొకబికిగా, రమ్మ తోలుకుప్పను నిమచున్
లేక తేర నెండ నైచినఁ
దికమకగా నెగురు కరఁశీఁ దెగక యెగురుచున్.

వ. ఆగుంపున మఁందు.

ఉ. మొత్తఁదనంబు లేదొకట మేఁగల యంగములందునన్, ఘృణా
యత్నము కాదు చిత్త, మగురా! యనిపించెడువాఁడొకండు పెన్
గత్తెనిఁ జేతఁబూనిలయకాలునిఁ బోలఁగవచ్చుచుండె 'నా
పత్తు నొసర్చు నీతఁడ' సిసాధ్యాలు పై నులుసుసుఖ మొందఁగన్.

వ. ఆగుంపు మధ్యమ్మునందు.

సీ. కృష్ణలంకల పెరింగిన పండుమట్టిలోఁ
జెలువారు క్రొత్త పచ్చియల నూపి
ముప్పొద్దులను మూఁడుపోట్టులఁ బ్రత్తిగిం
జల మెత్తతవుడు చిట్టులను బెట్టి
నలుపుకాంతుల మీఱు నల్లపాషాణంబు
వలె నున్న నలుతఁ బూవులను జుట్టి
నున్నఁదనంబుగా నూనియ రాచి క్రొ
మ్మెఱుఁగు దేఱఁగ గవ్వమెఱుఁగు పెట్టి

గీ. మొగమునందునఁ బసుపార్చి బొట్టుఁ దీర్చి

వదులుగా జన్పనారక్రొంబలుపుఁ గూర్చి
దున్న నొకదాని నేనుంగుగున్నఁ బోని
దానిఁ గొని వచ్చుచుండె భూజానిభటుఁడు.

వ. ఇటులా జనప్రవాహం బా కృష్ణాప్రవాహంబు సొచ్చి నిలిచి యుండ నొకఁడు.

గీ. కాసరంబును గంపదన్నుంబులైన
జలములను నిల్పి యొక లోహశంకువునకుఁ
గట్టెఁబలుపును జార్చి శృంఖల యమర్చెఁ
జెలఁగె నది యప్పు డొకనీటియేనుఁగనఁగ.

గీ. దాని పింగ నొకఁడు పెత్తనము చేయు
చుండె ముంగలఁ గత్తి చేసూని యొకఁడు
మలయుచున్నాఁడదెంత యమాయికంబొ
కొంచె మొఱఁగఁగ నీరమ్ముఁ గ్రోలుచుండె.

వ. ఇట్టి యీ విపరీతవృత్తంబు కనులారఁ గాంచుచు ముక్తాలత 'యిదియేమి'? యని యడిగిన నొక్క దాసి

ఉ. శ్రీరమణీయమై యెసఁగు సింధులవంశమునందునున్న యా
చారము మాకుమా కనువిచారము పుట్టెను బెండ్లిముందు వి
స్తారము జియ్యఁబట్టు మహిమప్రభు నొక్కనిఁ దెచ్చి నీటిలోఁ
గూర్చి లోహశంకువునకున్ బలియిత్తురు కృష్ణవేణికిన్

వ. ఇంతియె కాక తొల్లి మానవులనే బలియిచ్చువారుగా నుండఁ గొంతకాలముముందు వారు తిరుగఁబాటుసేయ నిప్పుడీ యాచారంబు పాటించుచున్నారని తెలిపిన విని ముక్తాలత,

చ. అనవసరమైన యప్పుడు నిరంతరమున్ వచియింతు రెల్లనూ

సవ్వులకుఁ దేటతెల్లముగ నాయకు'లేలినవారెచెయ్యువో
ప్పవ'ని జనంబులుఁ దిరుగుపాటొనరింతురు, నోరులేని జం
తువులుకదా! వచింపఁగను నోరుకలాఁడొకఁడేని లేఁడొకో.

క. ఈపాపకృత్యమునకే
నోపనువిన్నందులకును నుపవాసంబుఁ
జేపట్టవలయు నటులా
జ్ఞాపింపుముదాసి! వంటచావడిలోనన్.

క. అనుచుండ మలయసేనయు
చనుదెంచుచు విని యిదేమి చాపల్యంబో
[illegible]! [illegible]'! యని
యనుదానన్ బలియసంగ నపచారంబే!

వ. అనిపలుకుచు ముక్తాలతశిరంబు చుట్టు ముమ్మారులు త్రిప్పి
చిటికరించుచుఁ ద్రిప్పినఁ గని సైఁపలేక ముక్తాలత

క. ఔరా! పాపపుఁగర్మము
క్రూరులు పరికింపఁ జూడఁగూడదు కృష్ణా
తీరంబులలో దీనికి
మారకుఁడై నాఁడు నృపతి మాలవిధిఁ జదిన్.

వ. అనిపలుకుచుఁ గృష్ణాసలిలజలకాంతితోఁ గలసి యొప్పరింపరాక
యున్న కాసరంబును జూడక దృష్టి నుపసంహరించికొనను
లోనికేఁగను దలంపుఁ గొనుచుండ.

ఉ. గుంపులుగుంపులైన జనకోటులు కన్నులు మూసిమోవులన్
గంపము పెంపులింప ననుకంపతలిర్పఁగ మెల్లమెల్లఁ జే
రింపాలయంగ ధ్యానమున సింగిరి, యాఁగిరి కృష్ణసీట, నా
డింపరు కాలుగేలా కదు డిక్కౌను నేనియు భక్తిపెంపునన్.

వ. అట్టి జనసంఘంబుం జూచి ముక్తాలత, బకధ్యానంబువలె వీరి యీధ్యానంబేమి యని యడుగ దీనిఁ జంపువాఁడు కనులు మూసికొని కొట్టును, అది సరిగా నమరుటకు నిట్టిధ్యానంబు చేయుదురని తెలుపునంత

ఉ. వాయి యక్షఃస్థలంబునకు వాలుగఁ బెంపొనరించి నాలుకల్
గ్రోయు మెఱుంగుగుంపులు విలోలములై సమకూడి గీష్మదం
ష్ట్రాయుతమైకసంబడ దృఢంబగు చేతను కత్తినెత్తి కం
దోయిఁ మూసి ఘాతకుఁడు నోవఁగ నేయఁ దలంపుపొందినన్

వ. ఆయెడఁ గాసరంబు సవనయించి శముండు తన క్రొమ్మొడ వంచియున్నఁ జూచి కంపితాంగియై డబ్బాటుపేరెలుంగు సేసి ముక్తాలత

గీ. వలదు వలదు మాఁగుము పాపఁజూడు
మోయి పాతకుఁడా! యంచు నొక్కపట్ట
నోలమెట్టుచుఁ బెను చంద్రశాలనుండి
క్రింది కుఱుకంగఁ బోఁ దల్లి యందిపట్టె.

వ. సమస్తరంబున నెల్లవారును నాచిచూచి వలదుడుగుము వలదుడుగుమని యాక్రోశించిన, ఘాతకుండు అచ్చవడి బాహువేగంబునుపసంహరణంబు కావించి కనులు దెఱచి చూచుచుఁడు

గీ. జందె మొక ఘ్రాలమాలయై సంఘటింప
విప్ర చెఱచిన క్రొమ్మొడ విశదమాయె
శముఁ డటంచును వాఁడుపసంహరించి
యొదిఁగె బ్రాహ్మణతేజ మిం తొప్ప నొక్కొ.

వ. ఆయెడ నా కాసరపోతంబు నీరమాయుకంబువలెఁ గానంబడుచు నెవ్వరికిఁ బట్టుకొన నలవి గాక కృష్ణాజలంబులఁబడి

సుదూరం బీఁడికొనుచుఁ బోయెఁ దదనంతరంబ, జనులు
గుంపులు గుంపులై శముఁ డింత కరుణామయుండే యను
వారును, బల్యర్థంబైన పశువు పాఱిపోవుట యశుభసూచకం
బను వారునుగా నుండ నా మలయసేన విస్మయంబొంది
యొడలు మఱచి

ఉ. ఇంతటివాఁడటంచు శము నేను తలంపఁగ లేదుసూ, దయా
వంతుఁడు బుద్ధిమంతుఁడు ప్రభాపటలంబుల పెంపుఁజేసి భా
స్వంతుఁడు హృద్యవిద్య లను సైంధవముల్ నడిపింపఁజాలు కే
వంతుఁడ టంచు నగ్గణిక బట్టువలెన్ బొగడెన్ మహీసురున్.

వ. అందొక దాసి యాశముని గాంచుచు

గీ. కాసరప్రాణములఁగాయు కోసమితఁడు
పాఱఁజూచుచుఁ దనయైదుప్రాణములను
బాటిసేయఁడసూ! తృణప్రాయముగను
ఇతనిజన్మమె సార్థకం బీధరిత్రి.

వ. అనిపొగడుచుండ లోలోపల సంతసించుచు ముక్తాలత.

ఉ. ఆసమయమ్మునందు మెడయందు నెసంగెడు రత్నమాలికన్
దీసి జలంబులందు గుఱుతించిన ఘాతకు కంఠసీమలో
భాసురతమై తగన్ విసరివైచెను దానినిఁ జూచి వాఁడునున్
భూసురుఁడున్ దటంబులను బొల్చిన వారును సంతసింపఁగన్.

ఉ. చంకలబంటి లోఁతుగ వెసన్ నిలు నాశముఁజూచి కంధరా
లంకరణంబుగాఁ బరిమళమ్ములఁ జిమ్మెడు పూలమాలగుం
పింకనునింకనుం బయికి నెట్టులవైచె నటుల్ శముండు దా
నింకనునింకనుం బఱపె నీక్షణమాలికలన్ మృగాక్షిపై.

గీ. వైవుఁ డింకను నింకను వైవుఁడంచు

మలయ సీస ముదంబున నూసరిల్ల
సరసి ముక్తాలత సఖీసహస్రములకు
నాసయిడె మాడలను గుంపుపైనిఁ బోయె.

వ. మఱియు నాముక్తాలత యొక్క దాసిచేత నూతనకౌశేయవస్త్రయుగంబుఁ దెప్పించి జాతివాసనావాసితంబును సుగంధద్రవ్యపూతంబును హరిద్రాయుక్తంబునుగాఁ జేసి ఘూశమునకుం గట్టఁ బనిచె నంత నవ్వార్తసింధురంబునకుఁ దెలిసె నంత నాతని సంపుఁ గొండలు వచ్చి రంధపు వోకఁడు.

శా. ఓరీ బ్రాహ్మణఘాతకా! యిందుబలిన్నైయున్నట్టి యీమన్ననున్
స్వైరంబుం గొనిరించినాఁడవు ధరాపాలాన్వయాంచత్పురా
చారంబుం బరిహాసఁజేసికొని, నిక్ జాఁగోటినక్ యుక్తమా,
నేరం బీయెడ ఏనులార విని మన్నించెంక స్మరించునే?

క. 'మేమే మోకమమేధా
భూమికలమ' టంచుఁ దలఁచి పొగరుంబోతుల్
భూమిని రాజులకును దల
గాములుగా వఱల వారెఁ గట్టికుమపకేఁ?

క. అని యధికారి విలక్షణ
తను జూపుచుఁ గోపపడఁగఁ దాలిమి శమునే
మన లేదుకాని ఘూతకు
మునికనుఁగొలుకులను నీరు బొటబొటఁగారెన్.

వ. అపుడు శమునడు వానిం గాంచి

క. ఘాతకుఁడా! దీనికె యి
త్యాతురతన్ దుఃఖపడెద వాహా! కనుమా
పోతును ఛేదించిన దో

భీతిల్లునో! చావ నెంత వెలవెలఁ గనునో!

ఉ. మేసి బలాన్వితంబయిన మేనుగలట్టి మృగాలకుత్తుకల్
గోసి వధించుపట్లఁ గనుఁగొంటివె? వానిమొగాలచందముల్
మాసెనొమాఱెనోచనెనొమానుమునాబతిమాలెనో యెటుల్
దూసెనొ, వేఁడెనో, కనెనొ, దోసిలిమొగ్గెనొ, తత్తరించెనో!

వ. అనిన విని యుపలక్షణంబయిన ఘోరాకారంబును నతిశయితం
బయిన యనుతాపంబును బరిస్ఫుటంబయిన దయారసంబునుఁ
బొదల నాఘాతకుండు

ఉ. భాసురమైన ఘోరకరవాల మపారణవేగభాజితమై
తీసి బిఱ్ఱాన గోఁతయిన దేశముపంపఁగఁ బాఱనైచె 'నీ
చేసినపాతకంబులవి చెల్లెను గో' యనుభంగి శిరముల్
పోసెనుమీఁదికొక్క మొగిఁ బ్రోఁతలు స్రుక్కుచుఁ గృష్ణపెల్చనః .

ఉ. ఆయెడ నెల్లవారలును నాసనముల్ వికచామలాంబుజ
శ్రీయుతముం గొనర్చుచుఁ బరిస్ఫుటగాత్రములన్ జెలంగుచున్
'గో' యనిమూర్ఛగాశమునిఁ గో యనిఘాతకుమోముఁ జూచియా
చ్చర్యయునఁ బొందుచుఞ్ విశదమైనదయారసమానసేయుచుఞ్.

క. తెలతెలఁబోయిరి యీలో
పలఁ రాచటెకంబు చూపఁ బడిపోయినయ
ట్టుల వచ్చు రాజభటులు వి
కలమానసులౌచు శముని ఘాతకుఁ గనుచున్.

గీ. ఏమి యనినను బ్రజ లెల్ల నెదురువార
టంచు మదులందు మిక్కిలి సంచలించి
యేమి యనలేక భటులెల్ల నేఁగి రాజ
సన్నిధినిఁ జెప్పవారైరి చరితమెల్ల.

వ. ఇటులు వారు వెనుదిరిగి పోవఁ గాంచి యాజనులెల్ల నేమి యాపద సంభవించునో యని బెగడొందు వారును జనులెల్ల నేకీభవించి చెప్పఁదమను వారునునై యుండ

ఉ. కాలము మాఱునో! విధి వికారముచెందునో! లోకమెల్ల శూ
న్యాలయమై కసంబడునో! యార్యులపున్నెము సన్నగిల్లునో!
యేలిక కార్యపై నిఁగను నీరసయెత్తునో! యేమొయంచు ము
క్తాలత చాలఁ జింత లను తంతువులం దగుల్కొంది యుండఁగన్

వ ఇటులు శముండు జలంబులందక యుండి యెల్లవారికిఁ దేటతెల్ల మగునటు లహింసాప్రశంస యుపన్యసించుచుండ నెల్లవారును నానందనిమగ్నులై యొడలెఱుంగక ప్రొద్దుపోక లెఱుంగకుండిరి. బౌద్ధులు జైనులు నెల్లరు పరవశులై తాండవం బొనరించుచుండిరి.

క. ఆయెడ మఱలన్ జనపతి
రాయిడి పెట్టంగఁ బనుచు రాజభటతతుల్
మేయెఱుఁగక వినుచుండిరి
వాయడరింపకయ శముని పలుకుంబడులన్.

వ. అచందంబెఱింగికొని సింధులుండు మంత్రిపుంగవునిఁ బనుప

శా. ఆరీతిన్ విని మంత్రిపుంగవుఁడుతా నాయాయి సేనానులన్
ఘోరాకారుల వెంటఁబెట్టుకొని పెన్ గుట్టంబుపైఁ బోయి వాః
పూరంబందు నుపన్యసించు శమునిన్ బోధాన్వితున్ సారవా
గ్ధారాధాతునిఁ జూచె సర్వజనతాంతర్వర్తి సన్మూర్తినిన్.

క. వినుచును మెయి మ్రాన్పడు వా
రినిఁ దనవచ్చుటలు తెలియురీతులు లేకుం
డినవారిని నలవారినిఁ

గనుఁగొనియెన్ మంత్రివరుఁడు కనుఁ జిత్రముగన్

క. జను లింతలుగా నీతనిఁ
గనుఁగొనుదురె! జనుల బలము గాదే రాజున్
ఘనుఁ జేయు వీనిఁ బట్టిన
ననుఁ బట్టుదురేమొ యంచు నలిరేఁగి మదిన్.

వ. అతని యుపన్యాసాంతంబువఱకు వేచియుండ సేనానుల కాన యిడి యామంత్రి నిలిచియుండె. అనంతరంబ కొంతవడికి

గీ. శముఁడు బోధముఁ జాలించి శాంతి తోడ
ధరణిపతిమంత్రి కడను శుద్ధముగ నిల్చె
జనము కాంచుచునుండ విస్మయము చెంది
యల్ల ముక్తాలతియు మదిఁ దల్లడిల్ల.

వ. అపుడా మంత్రి తన మనంబున సుదూరం బాలోచించి శము నింగాంచి మొదట వచ్చిన సమంతభద్రున కనుయాయి వైతి వట్టె? అదితగునే? అని యిట్లనియె

ఉ. శుద్ధులు సర్వపూజ్యులు విశోధితచిత్తులు బ్రాహ్మణుల్ కదా!
శుద్ధమతావలంబివయి బాధలఁద్రుంపఁగలాఁడవే? యనా
రాధకభావిలాసులు పరస్పరమున్ నచియించుకొంద్రుఁగా
కిద్ధము శుద్ధమంచు వచియింతువె? నెవు వివేకహీనుఁడా?

సీ. ప్రకృతి యీమనోజంబు వికృతి యీజీవితం
బనుచు నార్యసులంబు లరయలేదె?
సుఖదుఃఖభాగులివ్వోటఁగల్గు మానవు
లలటంచుఁ బెద్దలు తపలేదె?
తిర్యగ్గడంబు లెంతే దుఃఖభక్తంబు
లనియు మునీంద్రులే యనఁగ లేదె?

లోకంబునను సుఖం బాకీర్ణముం జేయఁ
జేతఁ గాదని వారె చెప్ప లేదె?
గీ. కాన నీకింక జ్ఞానంబు కలుగుఁగాక
సారమైన పురాతనాచారములను
బాముచేయఁగ రాదింకఁ బలుకకుండు
మిదియ నాశాసనమ్ము సుమ్మింకమీఁద.
చ. కరుణ గలాఁడ నౌనెడలఁ గన్నుల గంతఁదగిల్చికొమ్ము కా
సరములఁ జూడఁ బోవకుము జాగ్రదవస్థను గొందు మీ ధురం
ధరమగు రాజుపట్టనమునన్ నివసింపక లేచిపోయి ము
మ్మఱితనుపీడనాడుచునిఁకన్ 'మొగులూర' వసింపుమీయనెన్.
వ. ఇటు లని మఱియు ' నిది ప్రథమప్రమాదము కావున నీయం
తట నీవు ముప్పదివేల మాడలిచ్చి యీనగరమున నివసించు
నది '; ' ఇది రాజునానతి ' యని సేనానులకుఁ జెప్పి తాను
సవేగుండై గుఱ్ఱమును మరలించి పోయినఁ గని జనులు కట
కటంబడి కొంతిప్రొద్దునను 'నీ యానతివలన సంతిప్యాపద
యిపుడు లేదుకదా'! యని శాంతులై మూకుండై నశమునకు
మోఁకరిల్లుచు వారివారి నివాసంబులకుఁ జనిరి. అంత
ఉ. ఏలిన వారి యానతుల నిట్టులు వించును మేడనుండి ము
క్తాలత క్రమ్మరించె లలితంబుగ ముప్పదివేల మాడలన్
దాలను నున్నవారు కని దండమ్ము పెట్టుచునుండ, గాని, భూ
పాలుఁ డనాదరించె నని వార్తలు వచ్చెను వెంటవెంటనే.
వ. అంత నా సేనానులు ముక్తాలతాకటాక్షంబులతో నాశమునిఁ
గొంపోక చోటక నవసయింప నాస్థలంబు శూన్యాటవీ
భాగంబు ననుకరించె.

**ఇది శతావధాని శివరామకవి ... మూఁడవయాశ్వాసము.**

# ముక్తాలత.

## తురీయాశ్వాసము.



శా. ఏనుంగొక్కటినిల్చియుండె యువరాజే తెంచునంచుం గనుం
గానంబుంబచరించుచుండెను తిరం గాణిక్య ముద్యోగులున్
ధ్యానింపం సమకట్టి రెల్లరును బ్రాచ్యాలోకన వ్యగ్రులై
తోనం వచ్చె జయంతునొక్క తటికిం దుర్వార వేగంబునన్.

మ. దిగధీశుల్ మహితానురక్త వశవర్తిత్వంబునుం జెంది సె
న్నగలం గాన్కల నీయఁ జేకొని మహానందబునం శౌర్యపా
రగతం వేగమ వచ్చి సింధుల మహారాజాత్మజాతుండు తా
దిగుమాత్రంబున మిన్నుముట్టిన వమందీభూతమోదార్భటుల్.

శా. పారావారముఁబోలెఁబొంగిపౌరలం బంధువ్రజంబుల్, భటుల్
మేరన్ నిల్చి పరాకుపాడఁ దటభూమిం బ్రేక్షకుల్ గూడ, రో
నారుల్ ముంగల నాడ నెల్లజనులుం దర్పించి వెఁటాడఁ గ
న్గో రమ్యంబగు దంతిపైఁ జనె జయుతుం డాజయంతుండనం.

గీ. బందుగులఁ గిందుగులఁ గాని బంటు గింటుఁ
గాని తాఁ జూడకున్నను మానెఁ గాని
ప్రాణమిత్రుండు తనసహాధ్యాయుఁడైన
శముఁ డెచట? నంచుఁ బ్రశ్నంబు సలుపఁడతఁడు.

చ. ఎఱుఁగను రాట్టుమారుఁ డిటు లేఁగుచునుంటెనటంచు బంధులం
దఱు చనుదెంచి ప్రేమభరితంబుగఁ గూడను వచ్చువా రటం

చూడుము యుగోలు మద్దెలలమెచ్చు బెలుఁగులివంచుఁగంతుపెన్
గుబ్బములునాటుకొన్న యెదఁగ్రొవ్విదమై మొలకెత్తుచుండుటన్

గీ. ఏనిక సఖులమై యెకిమీసి మేలి
మోసలకు నేఁగి మెల్లఁగా మోఁకరిల్ల
దిగియె నచ్చట నెటులో దిగ్గేశరాజ
రాజికోభయపార్శ్వంబు రాట్సుతుండు.

వ. ఇటులు దిగి హృదయంబునుగొంత పదిలపఱిచికొని కూడఁ జనుదెంచు రాజపుంగవులతోడను బంధుజాలంబులతోడను మంత్రికులంబులతోడను బ్రవేశించి వినయవినమితుండై సింధులమహారాజునకుం బ్రణమిల్లిన నాతండు గ్రుచ్చి కవుంగిలించికొని యానందపరవశుండై

సీ. కుశలమే? యతినిరంకుశపరాక్రమసమా
క్రాంతమౌ నీదు రాజ్యమునకు
క్షేమమే? సకలదిగ్దేశసంభరితరా
జన్యమూర్ధన్యసౌజన్యములకు
ఫలితమే? సకలభూభాగంబు పచ్చపై
రుల మీఱి సింధు పంటలఁ జెలంగి
నివసింతురే? జనానీకంబు సొంపొందఁ
బరిచితి స్నిగ్ధ భావంబు కలిమి

గీ. ఎచటఁ జూచిన నారోగ్య మెసఁగు నొక్కొ?
ఎన్ని పురములు నీ మది కెక్కినంచుఁ
బెక్కు ప్రశ్నల నడుగ నాదిక్కుఁ జూచి
పలికె యువరాజు వినయంబు పరఁగ నిటులు.

సీ. ఉపనిషత్సార సంగ్లపిత సంసారబం

ధామయూసుఁడై ద్విజుం డాడికొనును
అరిభీకరక్రమోద్ధురబాణ సంపాతుఁ
డై రాసుతుండు చెన్నారుచుండు
పరభీతి శౌర్య మందర హృద్వినోదియై
తనరి నైశ్యుఁడును వర్తకము సేయుఁ
బన్నులచీతులోఁ బడక శూద్రుండిల
రకముగఁ బచ్చఁ బోరణముకట్టు
గీ. నిటుల నేజాతి కాజాతి యింపుమీఱ
హావములు లేక రాష్ట్రి మేపారుచుండె
నేల నాలుగుఁ జెఱఁగులఁ గ్రాలుచుండెఁ
బంటచే నెల్లఁగుత్తుకబంటి గాఁగ.
వ. అని పలికి యాతనిచే సంభావితుండై జయంతుండు తన
సౌధంబున నేకాంతంబుగా విశ్రమించి
శా. ఆముక్తాలత చూచుగోలె ననురాగాయత్తచిత్తాబ్జుఁడై
భూమీశాత్మజుఁ డుండెఁగాపునను నాపూఁబోఁడి నేకాంతమా
భామిన్ భావనఁజేసి సంతసపడున్ బోరాడి చుట్టంబవన్
గాముల్ కట్టుమనుగ్రహించాదె యలయాకాశంబునన్ మేడలన్
శా. దూరంబందున నున్న యప్పుడు జయంతుం డంతరంగంబునం
దూరంజొచ్చుచు నిత్యసన్నిహితగా నున్నట్టు లూహించుఁదా
దూరంబందున లేనియప్పుడు మహాదూరప్రదేశంబునన్
నారీరత్నమదుండి నట్టుల నెదన్ భావించుఁ గామార్తుఁడై.
వ. ఇటులు తనలోఁ దాను గ్రంథమియఁదగుచు ముక్తాలతాగ్ర
హంబునకు నేఁగ నాలోచించి వివిధమార్గంబుల నెఱుఁగు
నొకదూతి మలయసేనాప్రాసాదంబునకుఁ బుచ్చి వెడలఁ బ్రతి

క్షించుచుండె.

సీ. కంటకంబులు లేవు కార్ముకంబులు లేవు
విచ్చుపూవానుపే గ్రుచ్చుకొనియె
శత్రురాజులు లేరు సాధనంబులు లేవు
విపులభావంబులే వెన్ను సజచె
కటికచీఁకటి లేదు కడిఁది గంతలు లేవు
కసటుఁ గ్రొవ్వాలపుతాఁ గన్నుఁ బ్రామె
మందుమాకులు లేవ యింద్రజాలము లేద
మానసం బది తానె మూర్ఛనైచె

గీ. యోగధారణ లేదు విరాగపూరి
తాత్మబోధము లేదు దృఢానురాగ
మతని నిశ్చల సద్భక్తై కాగ్రచిత్తుఁ
గా నొనర్చె విచిత్రంబు గలదె యింక.

గీ. ఇనుఁడు గ్రీపించి యపర మహీధరాంత
రితుఁడు కాఁజూచి సంజ సంప్రీతిఁ బొంది
× రాగ కలశ మహాంత రీతి రక్త నూనె
నినునిపైఁ దనకుఁ బ్రేముడి యెంత లేదొ.

ఉ. ఆశచినాథు దక్కు తిమిరావళిచే సనులిప్త మాయె నీ
పాశకరాశ సాంధ్యపరిపాటి గభస్తుల నెత్తుఁ బాపె నా
కాశ మిటుల్ పృథగ్విగవకాశముచేఁ బొలుపారి యద్ధనా
రీశుని రూపసంపద వహించుచునున్నది దర్శనీయమై.

వ. తదనంతరంబున నాజయంతుఁడు వార్చె క్రోడి కట్టె పూసి
ముక్తాలతా ప్రాసాదంబునకుఁ బోవ నెంచి

గీ. ఏకతమ పరిగ్రహమున కేఁగ వలయుఁ

× రాగ. కల. శమ, హితకలి అనియు భేదము.

జేయఁ దగు మంత్రణంబు ద్వితీయుతోడ
సమర మొనరింపఁ దగు బహుజనులఁ గూర్చి
యంచు నిది శాస్త్రనిర్ణీత మాయుఁ దొల్లి.

వ. అని యాలోచించి రాత్రిచారంబునకుఁ గొంత సందిహానుం
జై మానసంబు బిగ్గఁబట్టి పరాక్రమంబుఁ జెంది

ఉ. కొందఱు మాత్రమే వలచుకొన్నటువంటి పరాక్రమంబునుం
బొందుచు రాగలోభమదమోహములు గాత్రులయందు సంచరిం
పందొరకొందు రెందులను 'పౌరుషసాక్షి' యటంచుఁ బెద్దపే
ర్పొందిన రాత్రిచారము తిరుగ౯ గష్టముగ నైనసుఖంబునై.

వ. అని యిటులు తలంచి యుండె నాయెడ

మ. పలునిద్రం జనముల్ల మోహపడె గర్భస్థుల్ వలె౯ హర్మ్యముల్
తళుకొత్తె౯ సుఖసుప్తమూకజనమై ధ్యాసించుచున్నట్లు కొం
డలు చీఁకట్లఁ దినంగఁబడ్డ యటుల౯ స్వర్గాను మేయంబులై
తలచూపె౯ జగమొ ప్రపంచమయియంతర్ధానముం బొందెనా౯

గీ. ధ్వాంతములఁ బాఱు నటులుండె దారినదులు
పులినములు వెలితె నేడలు పోలుపు మీఱ
దెసలు పది చీఁకటి మునుంగు తెలుఁగు దోఁచె
నంధకారము పొల్చె నావ్యం బనంగ.

వ. అట్టి యంధకారబంధురంబయిన రేయిని జయంతుండు వడి
గా నడచి ములయునా ప్రాసాదంబు సమీపించి గాంధర్వ
విద్యను సోనలార వినుచు సన్నద్ధి చూచి

చ. పలు విపులంబె నైనను విభాగముచే మితరూపసంపదు
జ్జ్వలితములై క్రమోన్నతిని భాసుర మాచుఁ బెరింగి దట్టమై
తోలఁ కెనఁ హర్మ్యమాలికలతో నుత మాభవనంబు మించి భూ

స్థలమునందుండి యూకసను చాయలం బోయెను నాఁ జెలంగెనుఁ

వ. అని యిట్టుల వర్ణించుచుఁ బ్రాంగణంబుం బ్రవేశించిన **మల**యసేన సపర్యాద్రవ్యంబులతో నెదురువచ్చి తగుగతిఁ బూజించి లోనికిఁ దీసికొని పోవఁ బ్రథమద్వారంబున నుభయపార్శ్వంబుల గ్రువ్వఁబడి యున్న ప్రాచీనకవుల కవితాశిల్పంబులఁ జూచి

ఉ. **దేవతలున్** సురాదులును దేరఁగ వచ్చిన బంతికూళ్ళకున్
సేవల **మాఁగుచున్** గడుపు నింపుకొనంగనుగాదు **కావినె**
**మ్మోవిసుధారసమ్ము**నకు మోదముఁబొందిరొ **యట్టి** మోహినీ
**దేవి** నుపాస్తిఁ **జేయుచుఁ** బదింబదిగా జనులార! మ్రొక్కుఁడీ!

ఉ. శ్రీపతి పేరురంబునొగిఁ జెంది **యటన్** విపరీతరీతులన్
జూపుచుఁ బేర్మికాని సొగసుందనముం గని కోలుపోయి యా
లాపన **మూని మానసతలంబున** భక్తినిఁ బొంది మోహిని
రూపమునుం దలంచెను సరోరుహగేహిని యిచ్చు భద్రముల్

వ. ఇటు సదివికొని చని మఱియొకద్వారంబున

గీ. శిల సీసప ఖలాస్త్రాగ్ని గోళ మందుఁ
బుటముఁ బెట్టిన శుద్ధినే పొందుచుండు
మేలి బంగా రసంగ నమేయ గుప్తిఁ
నోఁచు పరిశుద్ధమౌ ప్రేమ దుర్లభంబు.

మ. వరిఁగొల్వంగనుమాని కెంగొనిభయభ్రాంతాత్ముఁడై సేద్యగాఁ
డిరవుం జొక్కుపుగబ్బిగుబ్బ గవయుం దేపొంది యొయ్యారమౌ
నర పాబిల్లికి సమజోడగుచు జవ్వం బయ్యెఁ గొంపారుడౌ! ఉర
లన్ వ్యాధి యిదేమొకో యనుచుఁదా నూహించుచున్నాఁడహో

వ. అని చెప్పుచుం బోయి యింకను గాలయాపన **మాచరింప**

లేని యాతని చందంబు గుఱుతించి మలయసేన మెల్లగాఁ బ్రాసాదాగ్రంబునకు నాతనిఁ దీసికొని చనినఁ జూచి యా తండు

చ. రతనము-తోడి మానికపురాతుల సంచలు సండెఁ బిల్లికన్
రతనము ముత్తియంబుల నొనర్పఁబడెన్ సికతాప్రతానముల్
జతపడె మేల్ప్రవాళముల స్తంభము లిమ్మెయి నేల వేలువా
క్ర్తతులు! మణీంద్రకాంతులను గాజులువాఱెను నెల్ల దివ్వియల్

వ. అనుచు ముదంపడి మలయసేన ముందు నడచి చనఁజన ము క్తాలత యేతెంచి యొక్క పీఠము నెట్ట జయంతుండు కూరు చుండె నామెడ మలయసేన క్రిందికి దిగిపోవ నంత జయం తుండు ముక్తాలతం గాంచి

ఉ. సూనశరాసనుండు సొగసుందన మొప్ప సృజించినట్టి నిన్
గానఁగ ముచ్చటింపఁగను గల్గెను రీతిఁ దలంచుచుండు నీ
గానము నాటకేట వినఁగాఁ గనఁగాఁ జెవికోసికొందు చం
ద్రానన! సంఘటించిన వివన్ని యు నేఁట ఫలాను భూతికై.

వ. అనిన విని మాఱుపలుకక తలవాంచికొని కూరుచుండిన,

గీ. చెలియ! పెచ్చుపెరింగెను సిగ్గువీడి
యలఁతిగా నెత్తిచూపుమీ! యూననేందు
వొందు నాకేల? ' జాయాజితుండ 'టంచు
యశము వ్యాపించి జగతి నిండారుఁగాక.

వ. అని పలికిన విని యనాదరంబునొంది చూపు కొండొకటకుం ద్రిప్పినఁ గాంచి రాజసుతుండు ముక్తాలతం డగ్గఱఁ బ్రయ త్నించినఁ గాంచి

మ. అతిశుద్ధుండు శముండు నీహితుఁడు తా నల్లుండు మాతల్లికిన్

గుతుకంబొందఁగ నాశరీరము నోరిఁ గోన్నాఁడు ప్రేమప్రమా
న్వితనై యాతని కీశరీరము నెరఁ నే నమ్ముకొన్నాను రా
ట్పుతుఁడా! నీచెలికానిభార్యయిదియు చోర్చెఁజూడుమా నెమ్మదిన్

వ. అని ముక్తాలతపలికిన విని యిదియేమి విపరీతంబు! శముని
యెడ నీచంపంబు నేనెన్నఁడుం గని విని యెఱుఁగ; ఇది సన్ను
వంచించుటకుఁ గాఁబోలు నీరీతిఁ బల్కుచున్నది, అని యెంచి
వలపునఁ గూరి జయంతుండు.

శా. రాకాచంద్రముఖీ! నెమ్ముంగను భువికిఁ దానే నే! సద్బ్రాహ్మణ
శ్రీసూనోతని నెట్టులన్ పలతువే? సిగ్గయ్యెడున్ జెప్పఁగా
నాకై కన్నది నిదుకంబికి నినున్ నాపూర్వపుణ్యంబునన్
నీకై కన్నది నాకు నంబిక నినున్ నీపూర్వపుణ్యంబునన్.

చ. అని విని నాయకకేకి నవ్వుచు నాట్పుతు మాముఁగాంచి యో
జనపతిపుత్త్ర! నే వినఁగఁ జాలను, రాజవు నీవు నాదుపం
పును గొనుమింతియే మనకుఁ బూర్వచితంబగునేఁ దాపచేపెం
డ్లినిఁ బొందించుకోఁ దలఁచు లీల గలాఁడ వికెట్లు నాయనే!

గీ. వేఁగిదేశపురాజ వివేకధనుఁడు
అతని కూఁతు స్వయంవర యామెవిడునే!
నాప మాయానుబంధంబుఁ బాపికొలు
పారదారికుఁడవు కాఁగఁ బాతకంబు.

సీ. ఒకకన్ను సౌందర్యమకరాకరంబు రెం
డవకన్ను శత్రుపాటనహారంబు
ఎనయందు నొకసాలు మదనునిప్రోలు రెం
డవసాలు వీరరసాతిరేకె
ఒకకేలు మరునిపూనికిఁ బెంచు లతిక రెం

డవ కేలు ద్వేషిశిక్షాపహారి
ఒక కాలు సింగార మొలుకు నసంటి రెం
డవ కాలు నైరవిహారహారి
గీ. యగుట శృంగారవీర రసాయనమ్ము
నెనసి నిన్నును నర్ధనారీశుఁ జేయఁ
నగ్నిసాక్షిగఁ బెండిలియాడఁ బోవు
నా మనో తలఁపుఁ గొనుమ్మ జయంతి! యింక!
వ. అని పలికిన విని నెమ్మిగొమ్మ తనను మారాడుచూ ...డను లేక
కొంతవడి సిగ్గువడి మాటల ధైర్యముఁ దెచ్చికొని స్వస్తిక
నడిచి యోచించి జయంత కిట్లనును
ఉ. పెనులు సరాహిరాంచేసుపు వి...ప్రతిఁ గాంచఁగ నాదు నాకు సి
పీనిది నాదు పెండిలి వివేకమునై గ్రహియింపు మింక స
ద్దానిది పెండ్లి యెట్టులని దర్శను నిలుచుఁగాగ నీకె? ఓ
మానవతీ! కళంకముల మానుచు నుర్విఁగఁ బంపుమింపుగన్.
వ. అనిన విని కొంతవడు కొంతుంబుఁ గాంచి ముద్దుగుమ్మ
ఉ. 'పీనిది నాదు పెండిలి వివేకమునై గ్రహియింపు మింక స
ద్దానిది పెండ్లి' యంచనుట తెప్పిది ప్రేమమునందు నొక్క కో
చానను బ్రేమతత్త్వములచాయ లెఱుంగని నీవు గోరుటల్
మానుము మానసంబునను మాన్చికొనంబ్రయతింపుమింపుగన్.
వ. అనిన విని పల్లటిల్లి యప్రతిభుండై జయంతుండు
మ. కలికీ! క్రొన్ననవా! నెమ్మలికి! నాకందోయి పెన్నివిందు! యెం
గుల కీర్తిని నేడిపించెదవు నన్నున్, నిన్ను నే తక్క నొం
డుల నేఁగోరనివాఁడఁ గాను మదిఁ గన్గొమ్మింక నావంక నీ
కలవింకారవ యింకఁ జేయకుము నాకై యంకరత్యపుం జేతనై.

చ. విధి యెటులుండెనో యెఱుఁగవేఁడెద నే నికమీఁదనుండి నీ
యధరమునందు బిందువును నత్రిపయిన్ మణిమాల పేరెదన్
బుధితముగా శశపుత్రకమున్ రచియింపఁగ నెంతు గోర నో
మధుమిళితాధరా! ప్రియునిమానసరీతిఁ జరింపఁ గోరుమా

వ. అనిన విని ముక్తాలత చిఱునవ్వు నవ్వి

ఉ. ఘట్టకుటీప్రభాతముగఁ గానఁబడెన్ భవదీయచర్య యి
ప్పట్టున రాకొమారుఁడ! కృపారస మూనుము దీనిపై నిన
ట్టెట్టనఁ బోకు మాశమునినే యెదయందు వరించు దాన నే
కట్టడి కేన్నిఁ బాత్రమను; గాఁదలఁపన్ మదినొక్క దీనికిన్

వ. అని పలికిన విని భ్రమనుపడి ముక్తాలతకేసి చూడ మోము
రాక కొంతవడి కారఁగూరిన పేరిమి నడఁచుకొని యుబికికొని
వచ్చు క్రోధోద్వేగంబు నాఁగుకొనలేక యధరంబు కంపింప
నాజయంతుం డిట్లనియె

ఉ. రాజసుతుండు తానె యనురాగము తాలిచి నీగృహంబులన్
శ్రీజనియింప వచ్చినను జేసితి విట్టుల మేజువాణి య
వ్యాజమ్మృదూక్తులం బలికినందులకా? వెలిచూపుచూపితీ
పై, జరుపంగఁ దగ్గ పనిపాటలు చూచు మిఁకేను పోయెదన్

క. అన విని తాలిమి మాలిమి
దనమున వదనమునఁ దేజు తళుక్కొత్తంగాఁ
జని సదనములోనికి నొ
య్యన నాకులుఁ బోకలైన వన్నియుఁ దెచ్చెన్.

వ. ఇటులు తెచ్చినఁ జూచి జయంతుండు

క. ఆకులుఁ బోకలు సున్నము
మాకును గలవో మృగాక్షి! మది మాఱినచో

నాకులుఁ బోకలు సున్నము
లేకున్నను బెదవులం దలిర్చెను నెఱుపుల్.

మ. అనుచున్ దిగ్గన లేచిపోయెఁ బటుపాదాఘాతసంశ్వద్ఘటీ
స్వనమై కంపిత వల్లరీ ఘటిత భాస్వత్కాయమానంబునై
జనితోద్వేగ పరంపరా చటుల వాచాటాఖిల ద్వారమై
యనిదంపూర్వ కఠోర తార రవమై యామేడ వాపోవఁగన్.

ఉ. ఈగతి లేచిపోవు ధరణీశకుమారుని విభ్రమంబు ను
ద్వేగముఁ గాంచి యావిలమతిన్ వగపూని సుతామతిప్రభా
శ్రీగృహయాళినై మలయసేన వికారముగాఁగఁ బిల్చె 'ము
క్తా!గతినై చిరమ్మిటుల'ంచుగృహంబదిమాఱుమ్రోయఁగన్.

క. పిలుపును విని ముక్తాలత
పలుకులుచున్ జిన్నమోము పెట్టుకొని కుమా
రిలు తల్లికడకుఁ బోయున్
మెలమెలగా మేలిమేడ మెట్టులు దిగుచున్.

వ. ఇటులు చేరవచ్చిన యాకుమారిం గాంచి మలయసేన

ఉ. రూపమునెత్తు కోపమును గోయఁగ నైనది నేఁడు నాకొగిన్
గాపురుషుండు పోలె వడిగా దిగిపోయిన వాఁడు దుర్మదో
ద్దీపితచిత్తవృత్తుఁ డయి తేరి కనుంగొన రాక, యూరియే
యూపదమూఁడునో తెలియనయ్యెదనింకనుముందుఁగూఁతురా!

వ. ఇటులు పలికిన విని స్వాంతంబు శాంతంబొనర్చికొని యా
ముక్తాలత

ఉ. వీలును జాలులేక యవివేకముగాఁ జరియింపఁగూడదం
చేలినవాఁడు నీతి వచియించినవాఁడు గదా ! మదంబ ! ము
క్తాలత కెట్టి భీతి 'సహీ' తాలిమిఁ జెందుమి యీశ్వరుండెతాఁ

పాలనఁ జేయువాఁడు పరిపాలనఁ జేసెడు వారి నేనియున్.

వ. అని పలికి యామెను దేర్చి స్వస్థానంబున కేఁగి యేకాగ్రచిత్త
యై యీశ్వరుని ధ్యానించుచుఁ గలఁత విడువం గూరి

క. కానుతుఁడు వచ్చినటులును
నీవును బ్రకటించినటులు నెంతయు హానిన్
జేసేఁత సేయునటులును
గానటునీసటుగఁ గాంచెఁ గలలం బెక్కుల్.

వ. ఇటుల రాత్రిభాగ శేషంబగు రేయి నెంతయు జాగరజాగరూక
నయనయై కడపి ప్రేపకడ

క. శమునుండున్న తావునకుఁ బో
సమకట్టుచు వలయునట్టి సన్నాహమ్ముల్
సమకూర్చి తల్లి వద్దకు
గమనంబొనరించె సెలవు గైకొను మదితోన్.

వ. ఇటులు చని మలయసేనకు నమస్కరించి విన్నపం బొనర్పఁ
జేర్చి తాపంబు తెలియనీయక, యమ్మలయసేన, సలలిత
తోచ్చారణంబులతో దీవించి పుచ్చిన, ముక్తాలత పరు
లెఱుంగకుండ నుపాయంబునఁ బ్రయాణంబు గావించి మొగ
లూరు ప్రాపించి కొండటి లెంకల శమనివాసంబుం గనుం
గొనఁ బంచి మరలి వచ్చిన యాలెంకలచే

ఉ. ఊరికి నెల్పటన్ వెలయుచుండిన జీబురుచెట్లలో నసా
ధారణమైన మట్టికడఁ దాలిమి మాలిమిఁ జేసినట్లు చె
న్నారు శముండటంచుఁ దెలియంబడి నెంబడి దుఃఖితాత్మయై
చేరెఁడు కన్నులన్ జలము చేరఁగఁ జీరఁగఁ బోవ నెంచుచున్

ఉ. దయ్యమువోలు చీఁకటికిఁ దాభయ మొందకయాశముం గనన్

నెయ్యము సూపు నెమ్మదికి నెమ్మదిఁ గూరిచి చుట్టుకాఁపుగా
నొయ్యనఁ గొందఱిన్నిలిపి యోరిమి కూరిమిఁ జెంది ప్రేల్మిడిన్
బయ్యెరగూడిదై చనియె భామిని యామిని జాగరూకయై.

వ. ఇటుల చని విశాలమైన యొక న్యగ్రోధతలంబున,

సీ. చలన మెఱుఁగని మనసు నిశ్చలమొనర్చి
ధ్యానమున నున్న శముఁ గాంచి దండమనఁగఁ
జాఁగిలంబడుచును నమస్కారములను
సలిపె ముక్తాలత వినయసక్తయగుచు.

ఉ. చేరువఁ దన్నుఁ గోరు వెలచేడియ వచ్చి పదంబుఁ దా నమ
స్కార మొనర్చె నంచు నెఱుఁగండు శముండటు కొంతగాలికిన్
జేరఁగరాని పోటుఁ గలశిగతదీపము పోలె నిశ్చలా
కారతఁ గ్రాలుచుండె నెసకంబెసఁగన్ వటవృక్షసీమలోన్.

గీ. శముని గాంచుచు నాలేమ చాలసేపు
నిలువఁబడి యుండె నెదురుగా నిదుర లేక
కొంతసేపటి కాతఁ డొక్కింత తెలిసి
వెలఁది నెట్టెదుటం గాంచి విస్తుపోయి.

శా. ఏకాంతంబుగ భీకరంబయిన రేయిం జీఁకటుల్ గ్రమ్మఁగా
నాకై వచ్చితివేల? యాపదలకుం దావుల్ గదా చీఁకటుల్
నీకై కొంకెద వచ్చుటాపదగదా నీకున్ మఱి నాకునున్
రాకాచంద్రముఖీ! తలంపు మొదలో రాగంబు పోకార్చుచున్

వ. అనిన విని యాముక్తాలత

శా. రాగంబుం బెడఁబాయు టెట్లు? పరమార్థ ప్రక్రియం జూచినన్
ద్యాగంబుం బొనరింపరానిదగదా! తథ్యంపుఁ బ్రేమంబు ను
ద్వేగం బెట్టుల నాఁగికొందు సఖుఁడా! విశ్వంబుతో మేఘముక్

ప్రోగ్గై నన్ నది యంబుధింగుఱించి తాఁ బోకుండఁగా నోపునే?

వ. అని యిటులు వినయంబుతోఁ బలికి జయంతుండు వచ్చు
టాదిగాఁ గల సకలవృత్తాంతంబు డగ్గుత్తిక పడిన పలుకుం
బడిని నెఱింగించి

ఉ. నాకయి రోసముం బెనిచినాఁడు మహాపదఁ జేయఁబోవు నా
రాకొమరుండటంచు మది రాయిడిఁ బొందను దీనికోసమై
నీ కెటువంటి యాపద జనించునో యంచుఁ జలించుదాన నం
చాకడఁ గౌఁగిలించుకొని 'యావురు'మంచును నేడ్వఁ బెల్చనన్

వ. ఇటు లువందుఱిన నోదారిచి యథాస్థితఁ గావించి,

ఉ. నవ్వి యొకింత యాశముఁడు నాతి! భయంపడఁబోకు నాకునై
పువ్వును బోలెఁ జూచికొను భూపకుమారుఁడు నన్ను నింతకున్
దవ్వగ నున్నవాఁడిఁకను దాపునకుం జనుదెంచి ముచ్చటల్
ద్రవ్వ మహాపరాధమని తానె వచించి ననుం గ్రహింపఁడే?

వ. ఆతనివలన నీకు నిసుమంత భయంబు లేదు; కరుణామయుం
డగు నీశ్వరుని యనుగ్రహంబున నాతనికిని వేగమ వృత్తిమా
ఱఁగలదు; నేను కొలఁదినాళ్ళలో నచటికి రాఁగలవాఁడ విశ్వ
సింపుమని పలికి నీవు నారాకఁ బ్రతీక్షించుచుండు మని చె
ప్పిన విని ముక్తాలత యాలోచనగ్రస్తయై కూరుచుండుతఱి
భటుం డొక్కఁడు వచ్చి శమునకుఁ గేలుమోడ్పు జేసి ముక్తా
లతతోడ నిట్లనియె.

ఉ. దూరపుభాషణల్ చెవుల దూఱఁదొడంగెడు మిశ్రరీతిగా
తూరుపు తెల్లవాఱు ననితోఁచును రేకలుతీరుచుండె శృం
గారముగా సభంబను నగారమునం దటుకాన వెంటనే
తీరుపఁ దగ్గ కృత్యము మదిం బరికించి తటానఁ జేయుఁడా!

వ. నా విని శముంగను

ఉ. ఆలస మేల చేసెదిఁక నాదటవోవని చూపు చాలు నాల్
జాలును మేలుకొంటి వలచక్షువు లొచ్చెల! యెట్టిఁబాటె నా
కేలినవాని నుండి విను మెల్లియె వార్తలు వచ్చుఁజుమ్మ! ము
క్తాలత! పొమ్ము నాకెదురుగాఁ జనుదెమ్మట కేను వచ్చెదన్

వ. అన విని పోవలేక పోవలేక గూఢసంభాషణశ్రవణంబున నెట్ట
కేలకు లేచి వందనంబొనరించి యాశీర్వాదంబొంది గూఢంబు
గా నా ముక్తాలత చనియెనంత

క. వినతతొలిచూలు గనుకొన్న వేఁడినార్చి
నులవ గుగ్గిళ్ళఁ దెచ్చి నోరూరఁ బెట్టి
గుట్టముల నేమ తేరుచఁ గూర్చి తోతె
నుప్పరంబునఁ గోరశాను ద్రిప్పికొనుచు.

ఇది
శతావధాని శివరామకవి ప్రణీతంబయిన
ముక్తాలత యను ప్రబంధంబున
నాలవ యాశ్వాసము.

# ముక్తాలత.

ఏడవయాశ్వాసము.



గీ. అంత భటుఁ డొకండు వచ్చి 'దాసోహ' మనుచు
జాఁగిలంబడి మ్రొక్కి యాశమునిఁ జూచి
రాకొమారుండు పనుచు కిల్లాకు నిచ్చి
సెలవు గొనిపోయె మఱల వచ్చిన విధాన.

వ. అంత నాశముండు జయంతునివ్రాలతోఁ జెలువారు నాకమ్మఁ గాంచి యిటులు సదివికొనియె.

శా. సంతాపంబును జెందినాఁడ సఖుఁడా! సఖ్యంబె సాఖ్యంబుసూ
మంత్రుల్ చేసిన మోసమీయది పరామర్శించి నీచెంత దం
డింతుర్ వారిని వారినెల్లరను దండ్రిం గూడఁ బాటింప, నే
తెంతుర్ నీకడకెల్లి నేను భవదాదేశంబు పాలింపఁగన్.

వ. ఇటులు సదివికొని యాశముండు

క. సంతోషించెను భూమీ
కాంతుతనూజుండు వ్రాయు కమ్మను గని తా
సంతట నీరపుటూడల
క్రంతలలో గ్రుచ్చె దానిఁ గడుభద్రముగన్.

వ. ఈరీతి నాకమ్మను గ్రుచ్చి యాశముండు శమకలితుండై యీశ్వరనిష్ఠంబైన చిత్తంబున నకళంకంబైన యానందంబుఁ బొందుచుఁ గ్రాలుచుండె నంత

గీ. అగరుపుల్లల కట్టలో నగరువత్తి
కొనను గ్రహియించి మెల్లగాఁ గొనెడురీతిఁ
బ్రాణికోటుల యాయువునందు నొక్క-
దినముఁ గైకొనెఁ గాలుండు తెలియకుండ.

వ. ఇటు లాదినంబు కడచనిన నామఱునాఁట ధ్యానపరాయణుండై శయ్యుండు కనులు మొగిచి చిత్త మేకాగ్రంబుసేసి కొంతవడికి లేచి సికతిలంబగు నొక తలంబు సమంబుగావించి వ్రేలితో నీరీతి వ్రాసికొనియె.

శా. 'జీవుల్ దుఃఖవికారదగ్ధులు పరిక్షీణాత్మవిజ్ఞాను లీ
చావుంబుట్టుల కాలవాలములు హింసాకారులంచుః దయా
భావుండై కనుచుండలేక నయనద్వంద్వంబునుః మోడ్చె నే
దేవుం డాతని బుద్ధునిం దలఁచెదన్ దీపించు బోధంబునన్.

గీ. ఆత్మదర్శన మందని యట్టివారి
కడవి గ్రామంబునా భేద మలరుచుండు
నాత్మదర్శన మందెడు నట్టివారి
కగు నివాసంబు లావివిక్తాత్మ యందు.

క. తన తనువుఁ బోలు నొక పర
తనువు నచేతనముఁజూచి తజ్జ్ఞేతరుఁడా
తనువుఁబరాత్మాధిష్ఠిత
మునుగా నెఱుఁగకయు, భిన్నముగ నూహించుః.

చ. ఎఱుపగు చేలఁ గట్టుకొని 'యెఱ్ఱనివాఁడ' నటంచు నెల్ల రూ
పఱు పుటముంధరించి 'తన యాకృతి పోయె' నటంచుఁబెంజరీ
నెఱికనుదాల్చి నేను ధరణీపతినంచుఁ దలంపనట్లు వే। రెఱుపు
నుమూపుమేలుగలయూమెయియాత్ముఁడుకాఁడు చూడుమా!

క. సఖభావితమగు జ్ఞానము
సుఖసన్నిధియందు వాఁడు చూపును గానన్
సుఖమును గోరక కస్తికి
సఖుఁడై పరమాత్మ నెఱుఁగఁ జాలఁగ వలయున్.

వ. ఇట్టులు వ్రాసి చదివికొని మఱల నామఱ్ఱినీడఁ జేరి యుపవాస శుష్కంబైన శరీరంబు నూడల కాన్చి ధ్యానపరాయణుండనై నివసించి యున్నంత సూర్యుని కిరణంబులు పరిపక్వంబులై తేజోవసానమును సూచించె నంత

ఉ. గోత్రము చాటుచేసికొని క్రోల్పులి చందము దాఁగె మెల్లఁగా
మిత్రుఁడు రాగరక్తముఖమిశ్రితుఁడై విగళత్కరుండు కా
గాత్రములందునన్ దిమిరకాండము ఘూసెనునాఁ జెలంగె సా
య్యాత్రికులౌ జనంబులు నివాసములన్ వసియించి రల్లెడన్.

వ. ఆయెడ నాశముండు బలం బెడలిన శరీరంబు నేలపయి నిడి కనులు మొగిచి

సీ. అలరు జొంపంబుల నలరారి యొంపొండఁ
గలయు క్రొమ్మాఁకు కానలకు నేఁగి
వలిగాలిఁ గదలెడు సెలయేటి తరఁగల
తెలిసీటఁ దడియు తిప్పలకుఁ బోయి
తెలిద్రాచు పడగల వలె లేచు నలలచేఁ
దనరు సందరపుఁ బెందరికి నరిగి
ఇసుకతిన్నెలచేత నెలరారు చిట్టడ
వులకు వెన్నెల బయలులకుఁ దఱలి

గీ. ధ్యానముం జేయుమోయి దయాస్వరూపుఁ
డైన భగవంతు సహారాది యందు నిదురఁ

ఘూరు వేళలఁ గాయమ్ము పారవశ్య
కలితమై పోవఁ బులకలు గ్రమ్ము దేవ.

వ. ఇటులు తలంచుచుండు నంత

మ. పొదరింటన్ వసియించు క్రోలుపులి యాఁబోతున్ సమీక్షించి
యం। గదచే నెత్తిన యీరసంబున నఖాగ్రద్యోతితంబై యరుం
తుదమై మీఁదికి దూఁకు రీతిని జయంతుం డాసురప్రక్రియల్
పొదలంగా శమిమీఁదికిన్ దుమికె దుర్బుద్ధిన్ విడంబించుచున్.

ఉ. కన్నుల నెత్తి చూచు శశిఁ గాంచఁగ నీయకచీరనై చిక్రొం
బన్నుగడన్ గమించి పటుబాహుబలంబునఁ గంధరంబునం
దున్న నరంబులం బిసికి యూర్పులు పుచ్చఁగ వీలులేమి వ్యా
పన్ననిఁ జేసినైచి చనెఁ బాహుపాలంబులదారిఁ బట్టుచున్.

వ. ఇటులుచని కృష్ణాతీరంబునకేఁగి

శా. ప్రాసాదాగ్రమునందు నిల్వఁబడి నిద్రాహీనయై సహ్యజా
దాసిం జోతె విలాసవైభవములన్ దర్శించు ముక్తాలతన్
దోసంబొప్పఁగఁ గాంచియార్తి నిజయాతుండూష్మలంబౌనటుల్
నాసానాళములందునూర్పు లెగువంగాఁదొట్రుపాటొందుచున్.

గీ. ఎవని ప్రాపునఁ జేసి యో యిందువదన!
రాజరాజాత్మజుఁడు యువరాజుఁ గూడ
నిచ్చ కిసుమంత యేనియు నచ్చలేదో
వాఁడె శశుఁడు శమించె మేవేఁడే పోయి.

వ. అనిన విని భ్రమానపడి కూలి కొంతవడికి లేచి యశ్రువదనయై
రోదనస్వరంబు సేసి

సీ. పాల మున్నీటిలోఁ బాలన్నియును దెచ్చి
కడిగిన నీచేతి కసటు వోదు

కమలారిబింబంబు కళలన్నియును గూర్చి
గచ్చుచేసినను నీమచ్చ చనదు
తేజరిల్లుచునుండు త్రేతాగ్నులను దెచ్చి
సంస్కరించినను నీసడులు పోవు
పరిపక్వమైన త్రిపాద్విభూతినిఁ దెచ్చి
నీలోసి కిచ్చిన మేలు రాదు
గీ. ఒంటిపాటున వసియించి యున్న వానిఁ
జీఁకటులఁ బొఱఁదోలు మైచెలువు వానిఁ
బ్రాణమిత్రుని శము సహాధ్యాయు నట్టి
వాని నేమి యొనర్చితో పాతకుండ !

వ. అని యఱచుచుఁ గ్రిందికిఁ జనుదెంచుచున్న సవ్వడిఁ గనుంగొని జయంతుండు జంఘాలుండై పాఱిపోవ నంత

క. క్రిందికిఁ జని ముక్తాలత
యందునఁ బొడగాన కాజయంతుని దుఃఖ
స్యందన మెక్కుచుఁ జనియె న
మందంబగు గతిని మట్టి ప్రమాని కెలనికిన్.

వ. అనంతరంబా ముక్తాలతాముక్తకంఠధ్వనినిఁ గొంద ఱాలించి లేచి చూచి వగచుచున్న మలయసేనం గాంచి సర్వంబు నెఱింగి తామును వగపుఁ బొంది రంతఁ గర్ణాకర్ణికగా నా వార్త పురం బంతయు వ్యాపించిన.

ఉ. గుంపులుగుంపులై ధరణికోటపురంబున మానవుల్ సమా
కంపితచిత్తులై శమునిఁ గాంచు తలంపునఁ బోయి రెల్లరున్
'చంపునె? రాజరాట్సుతుఁడు, చాలెనె? చేతులు, మానసంబులో
నింపితమాయెనే!' యనుచు నేపుమెయిన్ భువియీనినట్టులన్.

క. చని యంద ఱచేతనుఁడ
య్యును జేతని వోలెఁ గాంతి నొందిన శమునిన్
గనుఁగొనిరి వటమహీజం
బున క్రింద నమేయ శోక పూరితు లగుచున్.

క. కాళులకు దాపునంబడి
యాలిఁగి సౌందర్య మింక నినుమడి కాఁగన్
గ్రాలుచు నుండిన యాము
క్తాలతనుం గాంచి చాలఁ గరుణాలయులై.

క. శోకం బాఁగుకొనంగా
లేకెల్లరు పాంసుకణమలీమసతనులై
శోకించిరి యొండొరు నా
లోకించుచు హృదయములు విలోలమ్ములు కాన్.

వ. ఇటులు వగచివగచి యువరాజింత ఘాతకుఁడే? యనువారును సింధుభుం డింత యంధుండే? యను వారునునై, 'దేవాలయంబుల కేఁగి ప్రార్థనంబులు సలిపి యేమి యొనర్ప మది నిశ్చయించునో యటుసేయువార' మని తలంచి యందఱును మఱలఁబోవుచుండ నాజనసమూహంబునుండి సమంత భద్రుండను లేచి,

శా. ఆలాపంబులు మాని కొంచె వినుఁడయ్యా! మీరలున్ మీరలి
ట్లేలా పోయెదువారు? దేవగృహమందే యీశ్వరుం డుండునే?
శీలోన్మీలితులై కనుంగొనుఁడు వాసిన్ దేహగేహంబులన్
గ్రాలున్ సర్వమునందు నెల్లెడల 'నీనా' భేదముల్ రూపఱన్

మ. శమిమూర్ధన్యు శమున్ దయామయునిఁ దాఁజంపెన్ జయస్తుండు ని
క్కము ముక్తాలతకూడ నీల్గినది తత్కార్యంబునంజేసి పీ

రుమహాబుద్ధి కలట్టివారలు కుబేరుం గెల్చువా నొక్కంత రో
క్కముచే వీరినె యిట్లు చంపినను వీఁకఁ లోకమిం కాఁగునే?

ఉ. ఇండిఁక నిండుకలఁ ధనము లిండు గృహంబుల నిండు పంటలఁ
బండు పొలంబు లిండు పరిపక్వములై తగు తోఁటలిండు చెం
బిండు పటంబు నిండు పెరుఁగిండిటు వేయును నేల? మీా
కుండున దెల్ల నిండు మఱియుఁ మఱియుఁ యువరాజు చేతికిఁ

ఉ. నోరొక యింత లేక కడు నొవ్వనిఁ గూరిన కాసరంబు వాః
పూరమునందుఁ బెండిలికిఁబో బలి నిచ్చుట కాదు వీని దు
ర్వార మదాతిరిక్తపు వివాహముకై యిటు రెండు దేహముల్
చేరిన వీధరిత్రిని నిషిద్ధములై నవి వీనిఁ గాంచుఁడా!

ఉ. కుత్తుక నొక్కనో! మఱియు ఘోరబలంబున రాక్షసుండునా
మొత్తెనొ! యేమిచేసెనొ! సమున్నిషదంబుజనాథు కాంతికిఁ
గ్రొత్త యొసర్చువాని శముఁ గోలుమసంగినవాఁడు చాల దు
ర్వృత్తుఁడు; వచ్చునే? శముఁడు వీఁడు జగంబులు ధారపోసినఁ

ఉ. ఏలెడువాఁడ నేనుచు నేలిద మైతిని నీకటంచు ము
క్తాలత చెంత వావిడిచి కన్నులు గానక ప్రాణమిత్రుఁ బు
ణ్యాలయమైన యీశముని నంత మొనర్చినవాఁడు క్రూరుఁడై
స్త్రీలెటు లీస్థలంబులఁ జరింతు రిఁకఁ గడు నిర్భయంబుగఁ

ఉ. స్త్రీలకు నెల్లవారలకు సేసలుపెట్టఁగ వచ్చు నట్టి ము
క్తాలత చూడుఁడా! గణిక కాదిది మేలి పతివ్రతావళీ
మాలకు నగ్రరత్న మిది ప్రమాన్పడియున్నది ప్రమానిక్రింద నా
యేలికచంద మెట్టిదని యెంచఁగ నేర్తును మీారెఱుంగుఁడా!

మ. అని యీరీతినిఁ జెప్పి యంతకును ముక్తామత్త్రి పేరూడలం
దున నేపారెడు చీటిఁ బట్టుకొనియే దుఃఖించుచున్నాఁడు కా

వృస దానిం బయికెత్తిచూపెజనముల్ ప్రోవాచుఁజూడంగ వె
చ్చనినిట్టూరుపులూరుపుల్ నిగుడ నాస్యంబుల్ నిగారింపఁగాఁ

వ. ఇటు లందఱకు నాచీటిం జూపి యాతండు

శా. చేయంగాఁ దగు కార్యముఁ వినుఁడు హింసింపంగరా దెవ్వరిఁ
నాయంబొప్పఁగ ముట్టడించి యవనీనాథాన్వయం బంతయుఁ
స్వాయత్తంబుగఁ జేసి యేలుబడి పాయంజేసి వేఁపోక్కనిఁ
జేయంగాఁ దగు రాజు గాఁగ ధరణిం జెల్వారఁ బాలింపఁగఁ

వ. అని యెల్లరకుఁ దెలియఁజెప్పి

గీ. రాష్ట్ర మందున నివసించు ప్రజల కెల్లఁ
జెప్పి యీయవినీతుని చేఁత లెల్ల
నందఱును బ్రోవుచేసి యమంద గతుల
రావలయు మీరుమీర లూర్జస్వు లగుచు.

వ. అని బోధించిన విని యాజనంబులు

క. ధరణీపతి సుతు కృత్యము
పరమ భయావహము దుఃఖ పరిణామమ్మౌ
పరిపాకము నొందుటచే
నరిగిరి యందఱకుఁ దెలుప నపరస్పరులై.

క. అంతట నాపురుషుఁడు భూ
కాంతుని సేనానులకును గల జనములకుఁ
గాంతామరణమ్మును శమ
నంతముఁ దెలుపంగఁ బోయె నతివేగమునఁ.

శా. వ్యాపించెఁ వడిమైన గాలివలె దుర్వారంపు వేగంబునఁ
భూపాలాత్మజుఁడుద్ధతుండగుచుఁ దాభూమీసురుం జంపుటల్
తాపాలింగితరూపమై నృపతివాతప్రాప్తి ముక్తాలతా

దీపం బాఱుటయుఁ మహీపతిదురుద్దేశంబు దేశంబునఁ

గీ. ముట్టడింపంగఁ బ్రయత్నమ్ములను జేసి
రాష్ట్రమందున నివసించు ప్రజలు కోప
కలితులును దుఃఖదగ్ధులై కాఱుకొనిరి
కృష్ణ పొడుగున రెండవ కృష్ణ వోలె.

వ. ఈరీతిం గూడుకొన్న జనంబులు వ్యూహంబులు వ్యూహంబులుగా విభక్తులయి ధరణికోటచుట్టును గోటవెట్టి రయ్యెడ

శా. సేనానుల్ తమసేనలం గని సమీచీన ప్రకారంబుగా
నానల్ వెట్టిరి యాయుధం బొకఁడు చే నందంగఁ బోరాదిఁకే
వానిన్ హింస యొనర్పరాదు ధరణీపాలుండు శాసించినం
గానీ రాష్ట్రమునందునం బ్రజలనుం గాఱింపరాదంచొగిన్.

క. ఈయానల విని సేనలు
నాయుధముల నెల్ల నేరి కగపడకుండన్
జేయును దగుగతి నానో
పాయములను బొట్లు పడిరి పదిలము తోడన్.

వ. ఆయెడఁ దమ యభీష్టంబునకు సేనానులు తోడుపడ నెల్లవారు నత్యుత్సాహభరితులై ముందునకుఁ ద్రోసికొనిపోయి రంత

ఉ. కాలము మాఱిపోయి పలుకష్టము మీఁదికి నేఁగుదేఱఁగాఁ
గాలరు లాజయంతుఁ గనఁగాఁ జని చెప్పిరి యొక్కపెట్ట ము
క్తాలత మైదొఱంగుటయుఁ గ్రన్నన లోకులు ముట్టడించుటల్
చాలిన సేన లన్నియును శస్త్రములన్ విడనాడి పోవుటల్.

వ. ఇటులు కాలరులు ముక్తాలతావసానంబు చెప్పఁగా విని వారినిం బుచ్చి రాజయంతుండు

గీ. ఒంటిపాటునఁ గూర్చుండి యుమ్మలించి

కనులు గాయములై పోవఁగా జలంబు
వలువ లన్నియుఁ దడుప రాపడి విలోల
హృదయుఁడై తల్లి గడవెట్టి యేడ్పు మీఱె.

క. మిసమిస లాడెడు కాంతులఁ
గసిమస పడుచుండు వెండిగలఁతియ యందున్
మసృణంబుగఁ బూరించుచు
విసుమానముగా నతండు విసమున్ మెసఁగెన్.

వ. ఆయెడ పెచ్చుపెరిఁగిన జనంబులందఱు ప్రాకారంబు నిర్భ
యంబుగా దాఁటి సింధులుఁ బట్టుకొనిన నాతండు సైఁపలేక

ఉ. పట్టుఁడు వీరి నందఱను బాపులఁ బట్టి వధింపుఁడోరి యి
ప్పట్టున నేమి చేయఁగను బాల్పడు? సైనికులార! నన్నుఁ జే
పట్టుఁడు శస్త్రసంపదలఁ బాడఱఁ జేయకుఁడోరియంచుఁ దాఁ
దిట్టుచుఁ దిమ్ముచున్ గతమతిన్ జడిపించె జనంబులందఱున్.

వ. ఆయెడ నాజనంబులు తదీయ ఘోరకృత్యంబు లన్నియు
గ్రుచ్చియెత్తి పేర్కొనుచు

ఉ. నవ్వ నృపాలుఁడా! యిఁక ననాథుఁడ వీవయినావు పాలనం
బెవ్విధిఁ జేయఁగా వలెనో యించుక నీవెఱుఁగంగలేవు దా
దవ్వుల నుండు మింకఁ జరితంబుల మంచిగఁ జూచికొమ్ము తా
నివ్వసుధన్ భరింపఁగల యేలిక కొండొకఁ డేఁగుదెంచెడిన్.

గీ. సైనికులుఁగూడ నీదు దుశ్చరితములకు
సైఁపలేక త్యజించిరి శస్త్రములను
నైనఁ గాసిమ్ము నీకేమి యధిక భీతి
లేదు నీమేనికినిఁ గస్తి లేదు చుమ్ము.

వ. అనుచుఁ బలికి యంత యువరాజాగారంబులోనికెంజనఁ బ్రయ

తించి తలుపులు రాక యుపాయంబులఁ గొని యెట్టకేలకు
లోఁబ్రవేశించి రంత.

శా. కానంగాఁ బడె రాజసూతి లలితాగార ప్రదేశంబునన్
బ్రాణంబుల్ విడనాడి కృష్ట రసనా పర్యస్త ఘోరాస్యుఁడై
నానారీతి వికార విస్తృతి కృతా సంత ర్భవ ద్భావుఁడై
దీనత్వ ప్రతిపాద కేంద్రియ తతి స్థిత్యావిలాకారుఁడై.

వ. అట్టివానిం గాంచి జనంబు లాక్రోశించి చేయంగాఁ దగు
కృత్యం బాలోచించి

గీ. శిల్పులను బిల్చి మానవ కల్పముగను
బుద్ధదేవుని ప్రతిమను బొనరఁ జేయ
నాన యిడి వారలట్లు చేయంగఁ దెచ్చి
ధరణికోటను నొకచోట దానినునిచి.

చ. పదపడి సింధులానుజు నపత్యము నొక్కని రాజచిహ్నా కా
స్పదముగఁ జేసి గద్దెపయి వానిని నుంచి సమంత్రకంబుగా
నుదకముఁ దెచ్చి శీర్షమున నుంచి జనం బభిషేకమున్ బదిం
బదిగ నొనర్చె నయ్యెడల వాదిదముల్ వెదచల్లె వర్షమున్.

క. అటుపిమ్మట జనతా సం
ఘటిత ప్రేమమ్మునన్ 'సుగతు' పేరిట నా
'వటు' నామ భూమి పతి యా
పుటభేదన మందు నుండి పుడమిని నేలెన్.

ఇది
శతావధాని శివరామకవి ప్రణీతంబయిన
ముక్తాలత యను ప్రబంధంబున
సర్వంబును బంచమాశ్వాసము
సమాప్తము.

# టుప్ టీక.

## ౧ ఆశ్వా.

5. పుట సౌహిత్యము=తృప్తి 6. తోష్టూయ్యమాణుఁడు=మిగుల నుతింపఁబడువాఁడు 7. పులకరించు=రమ్యమగు। రేరాణితీఁగియ=దీని నింగ్లీషున Night queen అందురు। విసబొద్దియలు=దీనికి సంస్కృతము పాత; లాటిను Gloriasa Superba 9. చాతుర్వర్ణ్యము=నాలుగువర్ణములు। 11. బాఁగు=లెస్స; దీనియందు అరసున్న కలదు. కన్నడము బాంగు। 13. స్థూణంబు=స్తంభము। శతవ్యామ=నూఱు, బారలు। ఉత్తకామ=పోటీ కట్టి। తారకా...మై=నక్షత్రములు అను, మొగ్గలచే, లోఁగొనఁబడిన। విధు...విద్ధమై=చంద్ర, బింబముచేఁ, గ్రుచ్చఁబడిన। ప్రతివేశము=ఇరుగు పొరుగు ఇల్లు। 15. వాఃప్రవాహము=ఉదకప్రవాహము। కవోష్ణము=గోరు వెచ్చ। 16. ఆయసపాత్రము=ఇనుపగిన్నె। 17. సద్యో...శ్మశ్రుండు=అపుడు గొఱుగఁబడ్డ తల, గడ్డము, నందలి కెంద్రుకలుకలవాఁడు। బోధివృక్షము=మఱ్ఱి। మాయాదేవి పుత్రుండు=బుద్ధుఁడు। కేతన...తులు=జెండా, కాంతులు। తుహిన...దుగ్ధములు=చంద్రుని కాంతుల, గుములు, అను పాలు. ముహు...పూరితమై=మిగుల, నెక్కుడగు, కాంతులచే, నిండిన। ప్రవహణము=నౌక। 20. తాయి=స్థాయి। పద్దడము=మిద్దె। 21. బయకారులు=గాయకులు। 10. ఓతప్రోతములు=పడుగు పేకలు.

## ౨ ఆశ్వా.

22. కుప్పసము=కుబుసము। కృష్ణవెణ్ణా=కృష్ణవేణి. "వేణీ" అనిసం. "వెణ్ణా" కన్నడశాసనములలో నిటులు ఉన్నది। పరి...మసీషుఁడు=వీఁడినబాణములయందలి పెచ్చుఇచ్చుగలవాఁడు। దధి...మిష=పెరుఁగు, ద్రచ్చుటచేఁ, గదలు, వెలఁదుల, గుముల, (వేణి) జడ, అనుమిషచే। కృపాణఖురళి=కత్తిసాము। భువన...రుష=లోకుల, ఉద్గతిని, జయించు, నిచ్చచేనైన, రోషముచే; చూ. బాలభారతం (అమర) "దధిమథన"। 23. ఆకాశ...ఫలంబు=ఆకసమను కల్పవృక్షపుకొమ్మయందలి చిన్నపండు। ఔత్తానపాది=ధ్రువుఁడు। సప్తగవము=ఏడుఎడ్లతోఁగూడిన। శ్వసన...గంధ

ద్యై=గాలి అను నెత్తావికలదయ్యె! అంబరాంతమ్ము=వలువతుద, (ఆకాశము తుద అని శ్లేష) 24 పల్లొత్తు=పంటక్షతము! గోరొత్తు=నఖక్షతము! 25. శంకు=మేకు! సహ్యజాత=కృష్ణ! 27. రేపాడి=ప్రాతఃకాలము! 29. పింపిళ్లుగూయు=చప్పుడుచేయుచు ఆడు! 30. అవటుదేశంబు=ముచ్చిలిగుంట! 30. సుప్రాతము=మంగళమైన, ప్రాతఃకాలముకలది. [చూ...మాఘ ౧౦ సర్గ. తుదిశ్లోకము] 31. శా॥ "నాకున్నంతటి" పామునకు, కాళ్లులేవుకాన, ఎలుకయు అసత్యమని తాత్పర్యము! 32 అభిసంధి=ఉద్దేశము. 33. కొఱ్ఱమీనుతాకట్టు: కొఱ్ఱమీనునీరినుండి పైకిఁదీసి బయటనుంచిన వెంటనే చచ్చును. అప్పగొన్నవానికి మఱలనది యిచ్చుట దుశ్శకము. 34. సీ "మావిచిగుర్నగు" మోవికనలఁబల్కువలయునక్కరములు. ఉ, పవర్గము, ఃకః పలు! ప్రకృతమున, పకారముకై కొనఁదగు. పకారము పంచమమునకు గుఱుతు, అని భావము. (పికఃకూజతిపంచమమ్) మధువు=తేనె, [వసంతము అని శ్లేష] అల, విశారదము అనియు, అలవి, శారదమనియు భేదము! ౩5. డొంగ=దొంగ! 36. నెత్తపలక=జూదపుబల్ల. [మధురిమాదులు ఇమనిజంతములు. "పృథ్వాదు"లలోనివి. ౫-౧-౧౧౨ చూ] ముఱకటించు=త్రిప్పు! 37. మాలకరి=పూమాలగ్రుచ్చువాఁడు చవుడోలు=అంబారి. [చతురంతడోలిక] రాకా...రీతి=పూర్ణిమనాటిసాయంకాలమున సూర్యచంద్రులవలె! కాల...స్ఫుట=నల్లత్రాఁచు పెనుపడగ! 38. కర్ణిక=తొండముతుద

౩ ఆశ్వా.

39. కర్మకరులు. జీతముపుచ్చికొని పనిచేయువారు. [కర్మణిభృతౌ. ౩-౨-౨౨ చూ] 40. ఓయలపాట=పూలఁగోయునపుడు పాడుపాట! ముత్తో=ముత్తవ 41. గాథలు=చాలఁగవులుచెప్పిన గాథలను శాతవాహనుఁడు ఒకపుస్తకముగాఁ గూర్చెను. శ్రీనాథుఁడు వానిని తెలిఁగించెను. 45. రమ్మ=సారా! 46. పింగళి=పార్శ్వము! 47. వీతనయ=పోయిననీతికలది. 48 మాయుకము=గజవిశేషము, 50. రాజులు=ప్రభువులు; చంద్రులు అని శ్లేష తలగాములు=ప్రాంతవస్తులు; రాహుగ్రహములు అని శ్లేష!

౪ ఆశ్వా.

56. గుఱుములు=బీజములు. 59. నావ్యంబు=ఓడచేదాఁటఁదగినది! 60. సరోరుహగేహిని=లక్ష్మి! "వరిఁగొల్వంపగు మానికెంగొని" అనుటచే,

పామరత్వము సూచితము. "అరజాబిల్లికి నీడుజోడగుచు జన్యంబయిన వ్యాధి" నఖిక్షతము. దానింగాంచి తాను పామరుఁడగుట వ్యాధియని తలఁచుచున్నాఁడు. చూ "ఆర్యాసప్త" 61. పిల్లికన్నతము=వైదూర్యము. 64. బిందువు, మణిమాల, శశప్లుతకము, ఇవి గోరొత్తులపేరులు చూ. కుట్టనుతమ్. "అధరే బిందుః——"। ఘుట్టకుటీప్రభాతము=పయనమైపోయి తిరిగి మఱల బయలుదేరినచోటికేవచ్చుట. "క్రీత్వా కశ్చి త్పణ్యే వస్తూని ప్రార్యాం। శుల్కం హృత్వా గన్తుకామో నిశాయాం। తుర్యే యామే౽గచ్ఛ డారో త్క్రమాం...। గత్వా ఘుట్టకుట్యాం ప్రభాతమ్" 65. పటు... ప్పవనమై=బలమైన కాలితాపుచేఁ ప్రీలెడు (పూల) కుండులచప్పుడు। కంపిత ...కాయమానంబునై=కదల్పబడ్డ, తీవలచే, కూర్పఁబడిన, మేలిపందిరి। జనిత...పాదమిన వేగముల, సముదాయముచే, కదలునవియు, మ్రోయునవియు అగు ద్వారములు। అనిదంపూర్వ=అపూర్వము। 67. నైయగ్రోధ=మఱ్ఱిసంబంధము వినతతోలిచూలు=అనూరుఁడు। 68. అగారము=ఇల్లు

౧ ఆశ్వా.

70. కల్లాకు=చీటి। 72. గోత్రము=పర్వతము; వంశము। మిత్రుఁడు=సూర్యుడు; చెలికాఁడు। విగళత్కరుండు=పోయినకిరములుకలవాఁడు; జాఱుచేతివాఁడు. సంపరము=సముద్రము। 77. అపరస్పరులై=ఎల్లపుడు, ఎడతెగక. [అపరస్పరాః క్రియాసాతత్యే ౬-౧-౧౪౪ చూ] 80. కృష్ట...ఆస్యుఁడై=లాఁగబడిన, విపరీతము భయంకరము అగు మొగముకలవాఁడు। నానా...భావుఁడై=పలు, రీతులయిన, వికారముల, యొక్క-దువనముచే, కాఁబడిన, లోదాఁగనిభావములుకలవాఁడు। దీనత్వఆకారుఁడై=దైన్యమును, తెలుపు, ఇంద్రియావళియొక్క, స్థితిచే, కలుషమైన, ఆకారముకలవాఁడు. సుగతుపేరిఁట=బుద్ధునిపేరిట। పుటభేదనము=పత్తనము.



మంజువాణీ ముద్రాక్షరశాల, ఏలూరు.

# శుద్ధపత్త్రము.

| పుట పఙ్క్తి | | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 7 | 3 | క్రొక్రమ్మావి | క్రొమ్మావి |
| 19 | 9 | పెఱుఁగు | పెరుఁగు |
| 28 | 7 | బోధకౌన స్త్రీ | చెప్పుచునుండు |
| 29 | 4 | ... | ... |
| 30 | 7 | సుప్రాతమై | సుప్రాతయై |
| 35 | 13 | సత్కృతయాయొఁదొల్లి | కదకొన్నదిమెలపుతోడ |
| 38 | 5 | తీయుచు | ఎత్తుచు |
| 63 | 21 | వాని | విల్లు |

# పాత్రములు.

## పురుషులు.

౧ బల్లహుఁడు - రాజు

౨ వీరదేవుఁడు - బల్లహుని దండనాయకుఁడు

౩ సోమదేవభూపాలుఁడు - రాజు

౪ పేమనీఁడు - సోమదేవుని తమ్ముఁడు

౫ మాధవభట్టు - విద్వాంసుఁడు

౬ విధుశేఖరుఁడు - మాధవభట్టుని కొడుకు

౭ సైంహికేయుఁడు - ఒక బ్రాహ్మణుఁడు

౮ మాధవవర్మ - సోమదేవుని కొడుకు

౯ సూర్యదేవుఁడు - బల్లహుని కొడుకు

కంచుకి పారావాంద్రః - మొ॥

## స్త్రీలు.

౧ సిరియాలదేవి - సోమదేవుని మహిషి

౨ మంజుమతి - బల్లహుని మహిషి

చెలులు - మొ॥

# శోధనపత్రము.

| పుట. | పంక్తి. | అసాధువు. | సాధువు. |
|---|---|---|---|
| 2 | 10 | న్యాయ్యము | న్యాయము |
| | 11 | అన్యాయ్యము | అన్యాయము |
| | 16 | యులవరిఁచి | యులవరించి |
| | 21 | కలుపుగోలుతనము | కలుపుఁగోలుతనము |
| 8 | 9 | కుఱియము | కురియము |
| | 10 | అరుగబోలు | అరుగఁబోలు |
| 6 | 9 | ఒండొండఁగ | ఒండొండక |
| | 20 | పరాభనము | పరాభవము |
| 7 | 7 | ప్రా | ప్రాఁ |
| | 10 | తేరిచి | తేఱిచి |
| | 18 | గాటులు | కాటులు |
| 8 | 1 | ఆది | ఆది |
| | | దూఁబ | దూబ |
| | 7 | గ్రోల్ మసఁగు | క్రోల్మసఁగు |
| | 16 | పెనుచప్పుడు | పెనుజప్పుడు |
| 9 | 11 | మెదడుఁదాచి | మెదడుతాఁచి |
| 10 | 8 | వెలుక్కరి | వెలుక్కఱి |
| | 15 | లేపుదుకడఁగి | లేపుదుఁగడఁగి |
| | 16 | వెలుకురఁం | వెలుఁకుఱం |

| పుట. | పంక్తి. | సాధువు. | అసాధువు. |
|---|---|---|---|
| 11 | 24 | పోఁకుమర | పోకుఁదుర |
| 12 | 10 | కానుపించి | కానిపించి |
| 26 | 17 | ,, | ,, |
| 47 | 2 | ... | ... |
| | 12 | ... | ... |
| | 13 | ... | ... |
| 51 | 17 | ... | ... |
| 70 | 9 | ... | ... |
| 12 | 20 | తఱగి | తఱిగి |
| 13 | 1 | మూగఁ | మూఁగ |
| | 12 | అపద | ఆపగ |
| 14 | 11 | నెగనె | నెగసె |
| | 12 | తాపృ | తాఁపు |
| | 13 | నేలఁటూ | నేలటూ |
| | 20 | దడదడఁగా | దడదడకా |
| 15 | 12 | వాచి | వాఁచి |
| 18 | 8 | పోఁవుడా | పోవుఁడా |
| | 16 | వైరి | వెఱి |
| | 22 | వఁలు | వఱలు |
| 1[illegible] | 3 | పూఁడి | ఫూడి |
| | 5 | వేలు | వేరు |
| | 12 | ఖండ | వర్ష |
| 20 | 12 | సాగుతూంది. | సాగుతూంది ! |
| 21 | 23 | ఓరిమిదూరి | ఓరిమిఁదూఱి |

| పుట. | పంక్తి. | సాధువు. | అసాధువు. |
|---|---|---|---|
| 26 | 12 | వేఁగుల | వేగుల |
| 41 | 1 | ... | ... |
| 42 | 9 | ... | ... |
| 26 | 22 | ఎఱ్ఱఁబాఱి | ఎఱ్ఱవాఱి |
| 27 | 2 | తటతటఁగా | తటతటకా |
| 30 | 2 | చులక | చులుక |
| 31 | 15 | పాలా— | పా గా— |
| 35 | 2 | బూసం | బూనం |
| 37 | 16 | నిచ్చలు దిరుగాఁడు | నిచ్చలుఁబడి తిరుగాడు |
| 42 | 22 | చేకూఱిన | చేకూరిన |
| 44 | 6 | తోఁపించు | తోఁగఁజేయు |
|  | 14 | జుట్టువారు | జుట్టువాఱు |
|  | 18 | నాఁథుడు | నాథుఁడు |
| 46 | 2 | శార్ఙ | శార్జ |
| 49 | 10 | ఏర్పఱింప | ఏర్పరింప |
| 64 | 18 | ... | ... |
| 50 | 22 | ఎండమావి | ఎండమావులు |
| 51 | 1 | ... | ... |
|  | 6 | దేరి | దేఱి |
|  | 22 | తూఱి | తూరి |
| 70 | 7 | ... | ... |
| 52 | 12 | తువు ఱి | తువులఞ ఱి |
| 57 | 2 | చెవ్వను | చెప్పను |
| 60 | 9 | గని ట్టైనా | గనిపట్టైనా |

| పుటం. | పంక్తి. | సాధువు. | అసాధువు. |
|---|---|---|---|
| 62 | 18 | సీర దేవులు | సూర్య దేవులు |
| 66 | 5 | పరీక్షితు | పరిక్షితు |
| 67 | 28 | కాఁట | కాట |
| 70 | 16 | సాగిలుమింటి మొగంపు | సాగిలిమిన్ను లఁదన్ను |
| 76 | 7 | కాఁడు | కాడు |
| | 16 | అదర్భ | అదభ్ర |
| 77 | 14 | పాలించెదన్ | పాఁలించదన్ |

# మాధవవర్మ.

---

[నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించును]

సూత్రధారుఁడు—

ఉ. శ్రీధవళాయతాక్షి యెద, శీతమయూఖుఁడు సూర్యుఁడుం గనుల్
భూధరసాగరాదిపరిపూర్ణజగత్తతి కుక్షి, చేతనుల్
ద్వైధముగాని యాత్మమయతత్త్వపుఁబ్రోదినినుంగు లేని కా
మాధవుఁడెల్లవారుఁ బరమంబగు కర్మఫలంబు లీవుతన్.

[పరిక్రమించి] ఆర్యమిశ్రులకొకవిన్నపము. [వినుట అభినయించి] ఏమది ! నేను విన్నపించుకొనఁబోవుచుండఁగా నేదియో వినవచ్చుచున్నది ! ఆలకింతుఁగాక !

[తెరలో]

అహా! బల్లహుని కల్లువిందు !

సూత్ర—ఆఁ. తెలిసినది.

గీ. సోమదేవమహీపాలు, శూరవరుఁడు
పేరునీనినిఁ జల్లఁగాఁ బిలువనంపి
కల్లువిందునుగాఁబోలు బల్లహుండు
చేయుచున్నాఁడు చెడుపని చేయఁదలఁచి.

[నిష్క్రమించును]

స్థాపన.

## శుద్ధవిష్కంభము.

[అంతట కంచుకి ప్రవేశించును]

కంచుకి.— అహాహా బల్లహుని కల్లువిందు! [చింతచేఁ గలిగిన యలసట నభినయించుచు నిట్టూర్చి] కటకటా!

ఉ. కన్నులు కానఁగాఁబడక కాళులలో జవలేక మోమునన్
వన్నె యువాసిలేక తుదివాతిని బింకము చాలఁ దూర్పులం
దిన్నఁదనంబులేక కటులో తిన్న దిజీర్ణము కాక మన్కిఁ గై
కొన్న ఫలంబదేమగునొకో! వ్యసనంబులఁ బొందఁ దక్కినన్.

[దుఃఖముతో] నేను బల్లహుని కొలువుకూటములోని వాఁడనైనను న్యాయ్యము చెప్పవలసినపుడు సోమదేవభూపాలుని పక్షమునకె చేరుదును. ఏలన, అన్యాయ్యముగా నాలమందల నపహరించిన దండనాయకులనోర్చియు అపరభీష్ముఁడనందగు పేర్మినిమాట వినుకలిచే విడుమరకావించిన సోమదేవభూపాలుఁడు న్యాయవేత్తకదా! పిదప మాబల్లహమహారాజును, ఆతని సాధుత్వమునకు లోనయి రాయబారమంపి యాతని మైత్రి యలవరిచికొన్నాఁడు. మంచితనమ్ము ఎంతచెట్టనైనను దనవైపునకుఁ ద్రిప్పుకొనుననుట కిదియే తార్కాణ. నేఁడు మా మహారాజు సోమదేవభూపాలునిఁ బేర్మినిఁ దన కతిథులఁగాఁ గొనివచ్చి విందులు నడుపుచున్నాఁడు. ఈవిందుతన ముభయరాజ్యములవారికి నెంతయో కలుపుగోలుదనంబు సమకూర్పఁజాలు

నని యందఱు తలపోఁత. ఈ రేయిఁ గల్లువిందువలెఁ గను పట్టుచున్నది. ఏలన అన్ని దేశాలయందును గల్లుతాపు లీను చున్నది. రాజుల కిది వ్యసనములలో మునిమొదటిది. అగుఁగాక. ఇఁక నా యాయుశ్శేషమును సేవకవృత్తినుం డి తొలఁగించుకొనులోపుగా మహారాజుఋణము సరిగాఁ దీర్చికొనఁ దత్సేవకై యరుగుదుఁగాక. [నడచి, చూచి] ఓహో! ఈ చీఁకటికి ఈ కాఱుమబ్బు తోడగుచున్నది. ఔరా! ఈ మెఱుఁగుఁదీఁగ కనులమిఱుమిట్లుగొలిపి కాలికిఁ జుట్టవైచుకొనునట్లున్నది. ఇఁక వానయుఁ గుఱియుచో నాపని యిచటనే తుదముట్టును. ఇఁకఁ దత్సేవ కరుగ బోలు.

[నిష్క్రమించును]

శుద్ధవిష్కంభము.

---

[తరువాత బల్లహుఁడు శస్త్రపాణియై ప్రవేశించును]

బల్ల.—[కలయంగాంచి] బలే! ఈ ప్రకృతియంతయు నా ప్రయత్నమునకుఁ గడుననుకూలముగా నున్నది.

సీ. కాలాంజనముతోడఁ గలసి చీఁకటిగుంపు
ప్రకృతి కాంతయుఁ బూఁత వైచుఁగాక
కాళిపెన్నెలులతోఁ గలసి కార్మబ్బుగుం
పాకాశమంతయు నల్లుఁగాక

క్రొవ్విసంబునఁ బెనఁగొన్న వాయువు లెల్ల
వీథులఁ జెలరేఁగి వీచుఁగాక
అజ్ఞానభరమునం దణఁగి యీజగతి సం
పూర్ణంబుగాఁ గన్ను మోడ్చుఁగాక
గీ. తనపయింగూర్కెఁ జెందిన జనములకును
మేలుకనుశక్తి భూమి పోఁద్రోలుఁగాక
జ్ఞానమయమైన చైతన్య శక్తికూడఁ
బెల్చ గాఢ జడత్వంబుఁ దాల్చుఁగాక.

[నిర్దేశించి]

ఉ. కొంచెపుదూడిపింజెలనుకోఁదగి గేదఁగిఁబోలివచ్చు నీ
మంచుతుపానుగాలి 'కనుచూలపు దయ్యపుఁబెట్టురూపు సం
ధించి కడంగి ఓయి నడతెంచుచునున్నదియేమొ' యంచుఁ గా
న్పించుచునుండెఁ జూపఱకు బెట్టిదమైన భయంబుఁగొల్పుచున్.
గీ, కాఱుమబ్బులలోపలఁ గలసిపోయి
యంధతమస లగత్పరమాణుసమితి
భీరులంజూచి పేర్వెట్టి పిలుచునటులు
పొలుచుచున్నది భీకరముద్రతాల్చి.

ఎవండయినను సాక్షిమాత్రుఁడుగానుండ, ఈ రాత్రియే ఎంతఘోరకార్యమునైనను జేయింపఁగలదు. నాకు సంపూర్ణముగ ననుకూలమయిన ప్రకృతి నేమని కొనియాడుదును!

సీ. పిటికిపందలకుఁ గ్రొన్నెఱులు వ్రేలాడ వ
ల్లాడెడు మాయదయ్యాలవిధాన
పోటుబంట్లకు భయంబులఁబాయఁజేయు నీ
శ్వరవిశ్వరూపదర్శనము భంగి

పరిశీలకులకాత్మ పరిపోషణ మొనర్చ
దైవారఁ బాలిచ్చు తల్లిరీతి
తత్త్వవేత్తలకు సంతతసచ్చిదానంద
మహితమై యొప్పు బ్రహ్మంబువోలె
గీ. ప్రాఁబగలు తీర్చికొనునట్టి వారి కెల్ల
కరణిఁ గులదైవమో యన, ఘాతకులకు
నిష్టదేవతవోలె నీవెసఁగుచుందు
ప్రకృతి! నీకంటె వేఱె దైవంబుకలదె?

ఓయి సోమదేవా! పేర్మిఁడా! నిద్రింపుఁడు. నిద్రామాత్ర మేకాదు. దీర్ఘనిద్రఁ జెందుఁడు. [ఆలోచించి] రాజనీతిపారంగతులగు వీరు నా కతిథులుగాఁ జనుదెంచుటయుఁ విడిగా నేర్పఱిచిన డేరాలయందు నిదిరించుటయు, మైక మొదవించు కల్లుద్రావుటయుఁ జూడ విజయము నాదెస నే ముల్లు సూపుచున్నది. అన్నివిధముల నీశ్వరునకు జిగీషుల యెడఁ బక్షపాతము మెండు. [చిఱుగంటచప్పుడు నాలకించి] బలే! సరిగా అటులు మ్రోఁగవలయును. ఈ సంజ్ఞ సీరదేవునిది కావలయు. అతని హృదయము గాఢముగాఁ బరీక్షింతును.

[సీరదేవుఁడు ఖడ్గపాణియై ప్రవేశించును]

సీర — [నమస్కరించి] ఏమి సెలవు?

బల్ల — నీవింతపని చేయఁగలుగుదువో లేవో యని సందియము కలుగుచున్నది.

సీర—[తెగిన వెంట్రుకలఁ జూపించుచు] దేవా ! వినుము.

మ. "వలదోయీ ! వలదోయి ! సోదరుఁడ ! జీవశ్రేణికింబూతహాఁ
దల ; యద్దానిఁదిరస్కరించుట యనాత్మజ్ఞత్వ, మాచేఁత మం
గలి చేయందగినట్టి దట్లగుట నుగ్రంబౌ ప్రతిజ్ఞన్ విడన్
దలఁపంబాడి ప్రతిజ్ఞలిట్టివి యనిత్యంబుల్ విసర్జింపుమీ".

అని సోమదేవుఁడు నివారించుచున్నను వినక,

"సీ. పలుదెఱంగులగు పూవులనూనియలతోడఁ
ప్రియమార ముద్దుగాఁ బెనిచి పెనిచి
ఒంటొండఁగలియక యుండఁ జిక్కుందీసి
తొలుకాడ నున్నఁగా దువ్విదువ్వి
మెలుపారఁగాఁజుట్టి మేలుకుచ్చుం బోల
నొకమూలకొనగా నొత్తియొత్తి
అఱచేతఁదిగిచి వేఱుచేతఁ దెమలించి
వట్రువగా ముడి వైచివైచి

గీ. పెనిచినాఁడవు పాపమీ వెంట్రుకలను
నీవు బూనిన ప్రతినపై నేనుపూను
ప్రతిన పరిపాలనముచేయ వలయుకతన
వాఁడి కత్తినిఁ గోయంగ వలసె నేఁడు".

అని పలుకుచు దుష్టుఁడై పేర్నిఁడు ఈ శిరోజములఁ గోసి వైచినాఁడు. ఈ పరాభవమును నేను తీర్చికొనక జీవింపఁ జాలను. మీసందియము నన్నేమిచేయును?

బల్ల—[తనలో] ఈతని నింకను బరీక్షింతుఁగాక. (పైకి) ఓయీ ! ఈ పరిభవమునకుఁ దగిన పరిభవమే యొనరింపఁ గలవు గాని ప్రాణముల హింసింపఁగలవా ?

సీర—దేవా ! నాకీపరిభవమొనర్చుటకన్న నన్నుఁ జంపినఁ జాల సంతసింతును. తలకొట్టుటకన్నఁ దలదీయుట పవిత్రమైన పని.

బల్ల—అటులయిన నీవ యిందుల కర్హుఁడవు కాని సమర్థుఁడ వేనా ?

సీర—(చేతులొగ్గి)

ఉ. ఏలినరాజులొద్ద నొడలిచ్చినబంటులు మాకొలంపుఁ బ్రా
ణాలులు, వారి నెత్తురులచుక్కలు నా పెనువాడులందునన్
జాలువుగాఁగ జాలుకొనఁజాలినచోఁ గనుమూయునంతలోఁ
దేలికగాఁ ద్వదాజ్ఞఁ గడ తేరిచివచ్చెద వారి నిద్దఱన్.

మఱియు,

ఉ. ఉల్లములందొకించుక యపోహము లేక గళంబు దాఁకఁ బెన్
గల్లును ద్రావి మత్తుఁగొని కాయము సర్వము శక్తిదూరమై
చెల్ల శవంబునా నిదురఁజెందినవారినిఁ జేరి యమ్మనేఁ
జెల్ల! వధింపఁజాలనె ? యిసీ ! యిటువల్కన మేనునొచ్చెడిన్.

(ఉద్రేకముతో)

గీ. నా సెలుల వెన్ని తెగియెనో వాని మేన
నన్ని గాటులఁ బొనరించి మన్నిఁగొందు
నచటి బయలెల్ల నేనయి యాక్రమించి
చదురుగాఁ బాడుచంపు చంపుదు గమించి.

(అసి పోఁబోవును)

బల్ల—[ఆఁపి] ఆలకింపుము. ఆ ధ్వనియేమి ?

సీర—(ఆలించి)

ఉ. అదియొక గూబదాఁ బవలె నార్చుచున్నది జాముజామునం
గొదవయొనర్పఁ బోక యిటుగూయుట దానికి నైజమయ్యెడుం
గద కడుకొంచుయామములు గాఁదగునిప్పుడు మంచికాలమై
వది వివశాత్ములై నిదుర వక్కు విరోధులనుఁ వధింపఁగన్.

ఓ యులూకవరా !

శా. విశ్వంబంతయు నీవయై యొసఁగి యూర్వీజంబునం బిట్టలం
త్యశ్వాసల్ విడనాడఁ గ్రోల్మసఁగుటల్ తాఁజూచి యారేయి న
య్యశ్వత్థామయుఁ బాండవేయులను సంహారంబొనర్చెన్ గదా
యాశ్వాసంబును బొందువాఁడ నిను నే సాలోకనం జేయుటన్

(అధికారము నటించుచు)

ఉ. ఓసి యులూకమా ! యిఁకను నోర్వను నీరవళిన్ వినంగ నో
ర్మూయుము మౌనవృత్తి శుభముంగన నాకు జపించుచుండుమీ
కోయఁగఁ బోదు వారి పెనుగొంతులు, అంతులఁమానుమింక నీ
కూయికి వారికూయి కొనగూడు ఛిదల్ కనిపట్టఁబోవుదున్.

బల్ల—[తనలో] చాల నుద్రిక్తుఁడయి యున్నాఁడు. [పైకి]
ఈ పెనుచప్పుడేమి ?

సీర—ఇది యీఁదగాలి.

సీ. మలయాచలమునందు మలయు గంధపుఁజెట్ల
వెలయు పెంజిలువ క్రొవ్విసము ద్రాపి
ఆకాశమున యంతు నారయఁగాఁబోవు
కడలి శేంద్రాదుల కల్లుత్రావి
తాఁకినమాత్రఁ జైతన్యంబు సడలించు
మూఁదపంచుల సీతుతోఁడఁగూడి

జముని బెట్టిదపు టాస్థానంపుసీమలోఁ
బరఁగు కాఠిన్యంబు భద్రపఱిచి
వచ్చు ఘూతంబు నా గాలి వచ్చుచుండె
దీనితోఁగూడ నేనేఁగి తీఁడిరించి
వాటిలోపల నల్లాడు శ్వాసములను
గలికి మే వ్రచ్చి దీనిలోఁ గలిపివైతు.

ఓ విషపుగాలీ !

చ· వడివడి నీవుపోయి పరువంపుఁదెరల్ బలు నేలకట్టు లు
ల్లెడలును నున్నచీరలుఁ దలిర్చెడు చప్పరమందుఁ గల్లుత్రా
వుడుమెయిః పాము పచ్చినటువోలెఁ బరుండిన వారి పెందలల్
దడవి దృఢంబుగా మెదడుఁ దాచి విసం గలుషీకరింపుమా !

బల్ల—ఓయీ ! ఒకవాయువేశాడు.

సీ. ప్రకృతికంతటికి నుపాదానకారణం
బగు పరమాణువు లన్ని కలసి
కినుక యంతర్లీనతను బొల్చు రౌద్రర
సంబు ; తదధిదైవతంబుఁ గలసి
వారియిర్వురకున్న పరమవిశ్వాసంబు ,
మద్దీర్ఘరోషధూమంబుఁగలసి
పేర్మిఁ దొనర్చిన పృథులపాపవిపాక
కార్యంబు , నీకున్న కసియుఁ గలసి
వారిపాలిటి మృత్యుదేవతగ వెలసి
చయ్యనంబోయి క్రోలుమసంగుఁగాక
నీకు నాకును మోదంబు నిండుఁగాక
నూటిగా గెల్పు పైనుండి దూచుఁగాక.

సీరదేవా ! ఇంతకంటె మనకు సరియగు సమయము చిక్క-
దు. ప్రకృతియు నీసమయమునకుఁ జాలఁ దోడయియున్న-
ది. నిమిత్తమాత్రముగానుండు సర్వము నీప్రకృతియె నెఱ-
వేర్పఁగలదు.

సీర—(రోమాఞ్చముతో) అగును.

ఉ. జానులఁగ్రుచ్చి డొక్కల బుజంబుల గొంతుకపట్టునుల్పి నె
మ్మేనఁగలట్టి నెత్తురులు మిన్నులఁదన్నఁగ గోళ్ళఁబ్రచ్చుచుం
బీనుఁగు వెంటలైబడిసి వెల్వరిపోవఁగఁ జేసిచేసి పే
ర్మినిని సోమదేవునిని నేలపయిం బొరలించి వచ్చెదన్.

ఇఁక ననుజ్ఞయిండు. [అని పోఁబోవును].

బల్ల—(ఆఁపి) ఓయీ ! వారు మెలకువఁగనినచో గంట మ్రో-
యింపుము. నేను వచ్చి కలియుదును.

సీర—ఏమది ?

గీ. మెలకువను మాయఁజేయఁజుమీ గమింతుఁ
గాని మునుముందు లేపుదు కడఁగి వారిఁ
బెలుకురంజేసి చంపుదుఁ బిదప సాఖ
శాయనికుఁడగుఁగాక యా జముఁడు వీఁక.

బల్ల—ఓయీ ! ఇపుడాక్రమము విచారింపఁ బనిలేదు. ప్ర-
కృతియె యన్నిక్రమముల నేర్పఁగలదు.

శా. నీమేనంగలయట్టినాడులవి యుష్ణీభూతరక్తచ్ఛటా
ధామంబై యలరారుఁగావుతము నీద్రాఘిష్ఠమౌ శ్వాసలున్
భీమంబై యలవారిగుండియలనున్ వేధించెడుం గావుతన్
నీమార్గంబులు సర్వముల్ కడుశుభాన్వీతంబులౌఁ గావుతన్.

సీర—(ఉద్రేకముతో)

సీ. నాతిలపోఁతకన్నను మునుముందుగా
నడువంగఁ జూచుఁబో నాదు మేను
నాదు నెమ్మేనికన్నను మునుముందుగా
నడువంగఁజూచుఁబో నాదుచేయి
నాదు వెంజేతికన్నను మునుముందుగా
నడువంగఁజూచుఁబో నాదుకత్తి
నాదు పెద్దగత్తికన్నను మునుముందుగాఁ
దరలంగఁజూచుఁబో దానివాయి
దానివాదరకన్న ముందరగఁ బోడవఁ
దరలుఁబో దాని మొన యింకఁ దడయఁజాల
నంతకునకును గూడ నే నంతకుండ
సీరదేవుండఁ దీర్చివచ్చెదను బోయి.

(అని నిర్లక్ష్యముగా రౌద్రముఖుండయి నిష్క్రమించును.)

బల్ల—(సీరదేవున కేసి చూచుచు ముందునకుఁ బరిక్రమించి).

ఉ. ప్రాణముతీయఁగాఁదగు నుపాయములార! కడంగి సీరదే
వానుగతంబులై చనుఁడీ కచ్చటనున్నవి రెండులక్ష్యముల్
వానిపయిన్ గమించి పరిపాకము తెచ్చుకొనంగ నెంచుచోఁ
గానఁగవచ్చుచున్నయవి గావున నుండు త్వరాపరీతతన్.

సీ. మూయుమూయుమురా! తలుపులు రెండుఁగూడఁదీ
సినరానియట్టులో సీరదేవ!
రాకురాకుఁడుర! దీర్ఘముగాఁగ గోండ్రువె
ట్టినను నేడ్చినను నో జనములార!
పోకుపోఁకుఁడుర! మీర్మ్రగియునందాఁక నో
విషవాయుసహిత దుర్వ్యాప్తులార!

ఆఱుఁడాఱుండు స్నేహముచూపె నేనిఁ బె
న్వత్తులులేని దీపంబులార!
జముఁడుచొచ్చెడుఁ గాలపాశములతోడ
నతులబలమైన మహిషవాహనముతోడఁ
బ్రబలతరరోషరుష్టులౌ భటులతోడ
నిల్లిడె కాచియున్నాఁడు బల్లహుండు.

(గాలినిఁ దాఁకిచూచి) బలే! వీవుమువీవుము. ఆఁగకు మాఁగకుము! సీరదేవా!

సీ. లేపినపిదప సాలాపంబుమాని భీ
కరముగా వారికిఁ గానుపించి
గాయంబొనర్పఁగాఁ గడఁగినతరువాత
నఱికివైవంగ మానకుము వేగ
దొసఁగు నిబ్బరముగాఁ దోఁపంగఁబలికి ప్రే
మింపకు మలనీతి మిడుకఁబోయి
నీపగ యొక్క పేర్మి నిమీఁద నెయైన
సోమదేవునివీఁడఁ జూడఁబోకు
దారుణకృపాణ తీవ్రఘాతము నొనర్చి
యపునరావృత్తి యగునటు లాచరింపు
ప్రాణములఁబాసిపోవు దేహములనుండి
శిరములను బిట్టు తఱిగి తీసికొనిరమ్ము.

[తెరలోఁగలకలము]

బల్ల—అదిగోఁజప్పుడు ప్రారంభమయినది. ఇఁక నేను మాట లాడక వినవలయును. (ఆలకించును).

[మూగ సైగలు]

—వారు లేచి చూతురేమో! ఇరువురదప్పుడే వినవచ్చుచున్నది కాని మూలుగుచప్పుడు విన వచ్చుటలేదు. ఈలోపుగా వాతఁడు లేచి కలయఁబడఁడుకదా! వారిద్దఱు. ఈతఁ డొక్కఁడు. ఇంత యనాత్మజ్ఞతగా నాతని నొక్కనినే పంపితినేమి? (అను, భావముల నభినయించుచుఁ గ్రోధ ముఖుఁడై పరుపెత్తి నిలిచి) ఆఁ! తొందరవలదు. లేచినను గల్లుమత్తుచే నేమియు నొనర్పలేఁడు. (పరిక్రమించి ఆలకించి)

లేపఁబడినవాఁడును మాటలాడుటలేదే! ఏమి! గొంతు నొక్కియుండును. అదిగో! గొంతు వినఁబడుచున్నది. ఈ గొంతునను రెండవవాఁడు లేవఁడుకదా! ఏమగునోకదా!

(అని ఆలకించుట యభినయించి)

ఈ గొంతు క్షీణమగుచున్నది. ఒకచోటనుండి యీశబ్దము వచ్చుటలేదు. ఆతఁడు తల పట్టి యీడ్వఁబడుచుండఁబోలు. (అని అభినయించి) ఈతఁడు సీరదేవుఁడే కాఁడుకదా!

(అని పరువెత్తి) అపద తటస్థించుచో గంట చప్పుడుచేయుమంటినిగదా (అని యభినయించి, పరిక్రమించి ఆలకించి)

మఱల బిగ్గఱగ గొంతు వినఁబడుచున్నది! ఈ గొంతు రెండవవానిది కాదుకదా! (కొంచెము సేపు నిశ్శబ్దత) కాదు. ఆధ్వనియు ఈధ్వనియు నొకటియే.

(ఆలకించి) కృశించిపోయినది. ఈతఁడు మరణించినాఁడు. ఇఁక సంశయము లేదు. ఈచప్పు డెవరిది? ఇది రెండవవాని గొంతుకవలె నున్నది. మత్తుచే నీపలుకు ఈడిగిల్లఁబడుచు న్నది. (అని యభినయించును.)

[తెరలో గంటచప్పుడు వినఁబడును. బల్లహుఁడు పరు గిడును. సీరదేవుఁడు పరుగిడివచ్చి బల్లహునిఁ బట్టుకొని యావలికిఁ గొనివచ్చును.]

సీర—[రొఁజుచు] క్రూరముగాఁ బేర్నినివధించితిని. అంతలో సోమదేవభూపాలుఁడు లేచి కలవరించినాఁడు.

బల్ల—అయ్యయో యేల విడిచి వచ్చితివి? వడిగాఁ జెప్పుము.

సీర—[రొఁజును]

బల్ల— అలయికచే విడిచివచ్చితివా ?

సీర—[తలయూఁపును]

బల్ల—[తనలో] పేర్శని బలదర్పములు శ్రుతపూర్వములు.
[పైకి] ఓయీ! నేనేఁగి యాతని భ్రమందించివచ్చెదను.

సీర—[తలయూఁపును]

[బల్లహుఁడు వడిగా నిష్క్రమించును]

సీర—[రొఁజుచు, కూలఁబడి కోసిన వెంట్రుకలు తీసి, సంతోషముతో] తొల్తటనే గుడ్డ గ్రుక్కి చేతులఁగట్టితిఁ గాని లేకున్న నాకె చావు మూఁడియుండును.

సీ. కలుద్రావియున్న నబ్బలియుండు పుడమికిఁ
దిగిచుంగఁబడియును దిరుగఁబడియె
డొక్కలో మోఁకాల డొంకియు వెలకిలఁ
బడక డీకొంచు నాపైకి నెగసె
కాలితాపున డొంకక కేళ్ళు డొంకెన
నోలెఁ జొన్పి శిరంబు నేలఁదూఁచె
నూఁచినలేచి నేనొరయుఁదెంచఁగ మత్తు
చేఁ ద్రుళ్ళిపడి సొమ్మచెందియుండె
నంత నా మొలలోనున్న యాయుధంబు
పెఱుకుచును రెండుచేతులు నఱకివాఁడ
గోండ్రుపెట్టిన వెంట్రుకల్ కోసి వడిగఁ
బాఱుతెంచితి నెట్లో జీవంబుతాల్చి.

నాగుండియలు దడదడఁ గొట్టుకొనుచున్నవి. కొంచెము లేవను గాళ్ళు మల్లామడియగుచున్నవి. ఇంతయవస్థనూ బల్లహుఁ డనుభవింపవలసి వచ్చునేమో! ఆలకింతును. (ఆలకించుట నభినయించి) ఒక కొంచెమేనియు శబ్దము వినవచ్చుటలేదే! (సోన్మాదముగా లేచి)

ఉ. భారతసంగరాంతమునఁ బార్థతుఁ జంపఁగఁ బోవు ద్రౌణి, య
వ్వీరునకుం గనంబడుచు విక్రమ ముగ్రత నేర్పుగూడయున్
శూరత తెచ్చికోల్గఱపు శూలియు శక్తియు వీరు నల్వురుం
జేరుచు సోమదేవుపయిఁ జిందులు ద్రొక్కుచు నుండ్రు గావుతన్.

(అని కూలఁబడి యాలకించును)

ఇల్లిదిగో! ఇటు వచ్చుశబ్దము వినవచ్చుచున్నది! (అని చూచును)

(బల్లహుఁడు నఱికిన సోమదేవుని తలతోఁ బ్రవేశించును.)

సీర—దేవా! జయము. జయము.

బల్ల—(సోన్మాదముగా)

ఉ. మత్తునఁ గన్నులన్ మొగిచి మంజుళశయ్యబరుండి యెంతయున్
మిత్తికి మోమువాచికొని మింటికెగంబగు నుత్తమాంగమున్
గత్తినిఁ గోసి తెచ్చితిని గాఢముదంబెసఁగంగఁ జూచితిన్
జెత్తను జేర్పఁగాఁదగు నిసీ! యిఁక దీనిఁ బరిత్యజించెదన్.

(అని విసరివైచును)

(సీరదేవునకేసి చూచి) ఓయీ! ఇఁకముందు చేయఁగాఁదగు పనులు పెక్కులు కలవు. పోదము లెమ్ము.

సీర—చిత్తము. (అని కష్టముతో లేచును)

ఇరువురు నిష్క్రమింతురు.

ప్రథమాంకము.

---

ప్రవేశకము.

(ఇరువురు చేటులు ప్రవేశింతురు)

ప్రథమ—బల్లహుఁడు ఎంతనమ్మించి గొంతుకోశాఁడు? చేసిందికాక సేనలని ధ్వంసంచేసి పట్నంకొల్లకొట్టి మహారాణీ వారినికూడా పట్టుకోవడానికి పన్నుగడ వేశాఁడు

ద్వితీయ—'బలిమిచే పాలైనా తాగించలేము; చెలిమిచే విషమైనా తాగించచ్చు.' అని వినలా?

ప్రథమ—ఓరి పీఁడికడుపుకాల! తనపెళ్లాముకూడా చూలు మోస్తూఉండఁట. ఆవెణ్ణికూడా దేముఁడు ఈలానడిపిస్తాఁడులే.

ద్వితీయ—ప్రతిమ చెప్పింది.—'ఎఱుక దేవుఁడితో ఈసంగతి అంతా చెప్పి అక్కడ దాఁగి ఉంటానికివీలుచేయమని'

ప్రథమ—ఔను. మనం తొందరగా వెళ్లాలి. లేకపోతే ఈ పట్నంనుంచి పోనియ్యకుండాను, పైవాళ్లుపట్నంలోకి రానియ్యకుండానూ, కాఁపలా చేస్తారని తెలిసింది.

ద్వితీయ—ఇదికూడానా!

ప్రథమ—ఔను. ఐతేఏమిలే. మహారాణీగారు నిండుచూలాలు అవడంచేత ముందు ఎల్లాపోయి ఎల్లావస్తుందో అని ప్రతిమ కోటలోని మహాబిలంగుండా అరణ్యంలోకి తీసుకోపోయింది. వారికి ఇఁక ఆట్టేఇబ్బందిలేదు. బతికితే తెరువు దొరక్కపోతుందా యేమి? ఐంది ఐపోయ్యింది. ఇఁక ఎఱుక

దేవుఁడు దాఁగిఉంటానికి ఏదో ఉపాయం చేస్తాఁడు. ఏలాగో పాడుబతుకు బతుకవచ్చు. తలపోయిన మొండెం ఉంటే యెంత ఉండకపోతే యెంత?

ద్వితీయ—ఆలా కాదు. ఈచూలు ఫలించి మొగకుఱ్ఱాఁడు పుట్టఁగూడదా? అతగాఁడు మళ్లీ రాజ్యం సంపాదించుకో కూడదా? ఏమో లే. ఈశ్వర చిద్విలాసం ఏలాఉంటుందో! దానికేమిగాని అసలు ఎఱుక దేవుఁడు చేరుస్తాఁడో చేర్చఁడో అదేసం దేహం.

ప్రథమ—ఇటువంటప్పుడు ఎంత కర్కోటకుఁడైనా కాఁపాడఁడా? ఆలాఐతే వాఁడు మనిషి.కాఁడన్న మాట.

ద్వితీయ—అదృష్టం ఎల్లాఉందో! కనుక్కుందాం పద!

ప్రథమ—ఔను. తొందరగా ఎఱుకు దేవుఁడి దర్శనం చేయాలి పద.

(నిష్క్రమణము.)

---

## ద్వితీయాంకము

(ప్రతిమయు సిరియాల దేవియుఁ బ్రవేశింతురు.)

ప్రతిమ—అమ్మా! భాషా దాసుఁడు బాఁగుగా శిక్షించినను గ్రామ్య భాష నానోటవారలునని భయపడుచుంటిని. శత్రులు దాన మనలఁగనిపట్టనోపుదురు. కావున మీరునన్నుఁ గాఁపాడుచుండవలయును.

సిరి—ఇంక నేమిమాటలాడిన నేమి? ఎఱుక దేవుని సాహ్యము లేదుకదా!

ప్రతి— ఇంకను నాకాశపోవలేదు. మనము కోటదాఁటిచాల దూరము వచ్చినను మఱల నేఁగి మనమై కనుపట్టినచో నభయహస్త మీయఁగలఁ డనుకొందును.

[తెరలో]

ఉ. సంగరరంగమందు నతిసాహస ధైర్యబలంబులన్ జయిం
పంగను లేము దుర్జయుని బల్లహు; నింతియ కాక మేము చే
యంగల మేలు మీరు శరణార్థినులై యిటు వచ్చినారటం
చుంగథియింపకుండుటయె చుండదటు కావున లేచిపోఁవుడా!

సిరి—(విని దిగులు నటించును).

ప్రతిమ—(కూలఁబడిసల్లై)

గీ. కాలమా! యెంతయడియాస కనఁబఱచితి?
వినదైపోవఁగాఁ దలనేని యొకట
దాఁచికోవీలులేదు దుర్దైవమకట
పాలనీబల్లులను బట్టి పాఱవైచె.

(క్రోధముతో పత్తనపు వంకలఁజూచి)

సీ. వెఱఁగితి రేల? పెన్ వారితలల్ గల తోఁట
కూరవాఁగను గోటగోడలార!
నిలిచెద రేల? పెక్ దేహంబులంబోని
పొలుచు తలల్ వోలె బురుజులార!
కోటచుట్టును వెసంగుదు రేల? పాడుబొం
దల చందమునను గందకములార!
వరలుచుంటిరి యేల? పాఁతియుంబీఁకిన
గూటంబులంబోలెఁ గోటలార!

చెలఁగుదువిదేల తురకమసీదు నాఁగఁ
బాడుపాపిష్ఠిపురమ! దుష్పాపధరమ!
విఱిగి, తెగి, ద్రూఁడి, పడిపోయి, విహతమగుచుఁ
బాడుపడిపోవఁజెల్లు నీపాటికల్ల.

ఉ. తూలుఁడుతూలుఁడోక్క మొగిఁ గూఁకటివేఁటులతోడ మాడువుల్!
కాలుఁడుకాలుఁడిప్పుడ నగళ్ళులు! ప్రోదిపుణాదితోడుతన్
గ్రాలుమిగ్రాలుమీ! తెసను మానవనాథకులంబ! యెల్లయున్
వ్రీలుమివ్రీలుమీ! పుడమి! వీనిపురంబును లో నిముడ్పుమీ!.

మ. అరరే! పుట్టినవాఁడవెల్లెటుక దేవా! పుట్టుపోకాలు! నీ
పురుషాకారము బూడెనుంగలియు! (బోపో! పాడుచండాలుఁడా!
శరణన్నన్ విడనాడు పాతకివి నీచా! నిన్ను నుంబోలి యీ
భరతాఖ్యంబగు ఖండమందునను నెవ్వాఁడేని జన్మించె నే?

ఇంక నీవు బ్రదికియుండుచో నీకులజులంద ఱట్టివారే కాఁగలరు. ఇఁక నట్టి భీరువుల యుత్పత్తి లేకుండుకొఱకు నీవు చావుము. లేదేని,

క. వంధ్యత్వము నీభార్యకు
వింధ్యమువలె నడ్డుపాటు వెక్కసముగ రాఁ
గం ధ్యానించెదఁ బ్రాతః
సంధ్యల నధిదైవతముల సద్భక్తి మెయిన్.

సిరి—ఓయీ! 'కసిపోక మసిపూసికొనుట యేటికి? మన దురదృష్టమునే నిందించుకొనుట లగ్గు. ఈతఁడు మనకు ఉపకృతియె చేసినాఁడు.

గీ. వ్యాఘ్రజిహ్వాగ్రమునకంద కవలజాతి
కటికవానికి నందదుకాదె గోవు

కాతరిల్లినవాఁడిట్లు కడకుఁదోలు
నింతియేచాలు నుపకారమిదె తలంప.

(ఆకసముదిక్కు మొగంబై) అయ్యా ! ఆలకింపుఁడు.

గీ. గోవుకూడను నవ్వానితావుఁ జేరి
యాపదలపాలుచేయద యదియడంగు
నొండె; నెట్లేని జీవించునొండె ; భీతి
వలద యాగోవు త్రొక్కద వాని నేల.

(ప్రతిమతో) రమ్ము. ఈతని నేలదాఁటి జీవింతమొండె ;
లేదొండె ; వడిగారమ్ము. (అని నడచును)

ప్రతి—(వెంబడించుచు)

[తనలో] ఎలుక దేవుఁడికి ఉపద్రవం లేకుండా చేయడా
నికి ఈమె యెంతవడిగా సాగుతూంది. అలవాటు లేని యీా
మె కాళ్లు చాలా నొస్తున్నయి. ధైర్యంపోయిన నాకు ఈ
మె చాలా ధైర్యం తెస్తూంది. ఈలాగే నిండుచూలాలైన
బల్లహుని రాణీనికూడా యీశ్వరుఁడు ఎప్పుడు నడిపిస్తాఁ
డో కదా !

సిరి—ఆ కానంబడు నలుపు ఏమి ? (వ్రేలితోఁ జూపును).

ప్రతి—(విడివిడిగా నిర్దేశించి) అది హిడింబాశ్రమము. అల్లది
అనుమకొండ.

సిరి—మనమెచటికేఁగుదము ?

ప్రతి—అనుమకొండకేఁగుచో మన కాశ్రయము దొరకఁ
గలదు.

సిరి—(అధైర్యముతో) మనకింకను ఆశ్రయమా? ఎటుక దేవుఁడే భయపడఁగా నింకొకఁ డెవఁ డాశ్రయమీయఁ గలఁడు?

ప్రతి—అమ్మా! అటులనఁదగదు. ఈ యనుమకొండయందు సకలనిగమములయం దధీతియు, వశీకృతసకలరాజన్యుండును, గరుణాలయుండును అగు నొక బ్రాహ్మణుఁడు కలఁడు. ఆతఁడు మనకాశ్రయమీయను దనను రక్షించికొనను సమర్థుఁడు.

సిరి—(పెదవి విఱిచి) చతురంగబలసమేతుఁడే భయపడఁగా శ్రోత్రియుఁడగు బ్రాహ్మణుఁ డేమిచేయఁగలఁడు?

ప్రతి—అటులుకాదు. రాజసుండగు రాజెక్కడ? శాంతుండగు బ్రాహ్మణుఁడెక్కడ?

శా. నిండుక్ నిండుసమాధిఁ జిత్సుఖమునం దిద్ధంపు డెందంబునం
దుండుక్ వాక్పరిశుద్ధి నిత్యకృతకర్మోపాసనం జేసి వి
ప్రుండే రక్షణసేయఁగాఁగలఁ డటుల్ భూపాలుఁ డింతే సమ
ర్థుం డైనక్ శరణార్థిఁగావఁగ నశక్తుండౌను ముమ్మాటికిక్.

సిరి—ఆఁ.? కల్పన మితిమీఱుచున్నది. ఆతఁడు శక్తుఁడే కానిమ్ము. ఇఁక మన మొకనిపంచ కేల చేరవలయును?
(ఆవేశముతో)

ఉ. బల్లహుపంపుచే నెవరువచ్చిననేనియుఁ గుంతియేని భీ
తిల్లను రాణివాసములు తీయకతాల్చెదు కత్తిచేత నా
ప్రల్లదునీలుగంబొడుచుఁ గ్రమ్మఱి యీల్గుదు నొండె నింక నే
నొల్లను నొండ్లపంచలను నోరిమి దూఱి వసించు చందముల్.

ప్రతి—అమ్మా! బ్రాహ్మణాశ్రయము నింద్యముకాదు. అది యట్టుండఁ బరాక్రమించుచో గర్భహనన పాతకమునకుఁ దావీయవలసివచ్చును. కావున మాధవభట్టారకుని దర్శనము మన కావశ్యకము.

సిరి—(ఆలోచించి) సరియె. దారి తీయుము.

(ఇరువురును బరాక్రమింతురు)

ప్రతి—(తొట్రుపాటుతో) పాదవిన్యాసధ్వని వినఁగుచున్నది!

సిరి—(ఆవేగముతో) ఏమి? (కత్తిపెఱుక నుంకించును)

(తెరలో)

ఉ. క్రొత్తమనుష్యులెవరయిన రోయుచు వచ్చువిధంబు తోఁచినన్
మొత్తఁదనంబులేక కలమేగకుఁ జాలఁబరీక్షసేయు దు
ర్వృత్తుఁడు బల్లహుండు సెలవిచ్చినయట్లు పురాకుపుట్టె మా
సత్తరువాశ్రయం బిడును జయ్యనఁబోవుఁడు పారదేశికుల్!

సిరి—(మెల్లఁగా) ఈమాయోపాయముకూడ బల్లహునిది కాదుకదా! (మేలిముసుఁగు వైచికొనును)

ప్రతి—(మెల్లఁగా) అయియుండదు. ఈసత్తరువు మాధవభట్టారకునిది. అందు బల్లహుని మాయకుఁ దావుండదు.

(సుబ్రహ్మణ్యుఁడు ప్రవేశించి)

సు—(ఉ. 'క్రొత్త.........అనుపద్యమును మఱలఁ జదువును.)

ప్రతి—అయ్యా! ఆసత్తరువును మాకుఁ జూపఁగలరా?

(తెరలో)

సుబ్రహ్మణ్యుఁడా సుబ్రహ్మణ్యుఁడా! క్రొత్తవారెవరైన నున్నచో వడిగాఁ బ్రవేశపెట్టుము. వంట చేయువారు తొందరపడుచున్నారు.

సుబ్ర—అమ్మా! ఈలాగు రండు. ఈలాగు రండు.

(మూవురును గొంతపరిక్రమింతురు.)

(మాధవభట్టు విధుశేఖరులు ప్రవేశింతురు.)

ప్రతి—అయ్యా! మాకు సత్తరువుతో నంతగాఁ బనిలేదు. మాధవభట్టారకులవారి గృహముఁ జూపించి పుణ్యము కట్టుకొనుఁడు.

సుబ్ర—వీరే గురుచరణులు.

ప్రతి—ఆచార్యదేవా! నమస్కారము. (అని నమస్కరించును)

మాధ—(ఆశీర్వదించి, తనలో) వీరు కులకాంతలవలెనున్నారు. బల్లహునియాజ్ఞ క్రూరముగానున్నది కావునఁ గొంచెము త్రొందరింతును (పైకి) అమ్మా! మీరువడిగా రావలయుదురు. (సుబ్రహ్మణ్యునితో) ఓయీ! వీరినిసత్రమునఁ గాక మనయింటఁ బ్రవేశపెట్టుము.

సుబ్ర—చిత్తము. (స్త్రీలతో) అమ్మా! ఇటువిచ్చేయుఁడు.

ప్రతి—అయ్యా! భయగ్రస్తలకు గృహప్రవేశమేల?

మాధ—భయము పోవుటకే.

ప్రతి—గృహప్రవేశమాత్రమునఁ బోవునా?

మాధ—(తనలో) వీరుకులకాంతలు. నిస్సహాయలు. సోమదేవభూపాలుని రాణివాసమునవారేమోయని తోఁచెడిని. ఇతరలయినను దగినంత భయకారణములేక పురుష సాహాయ్యమునుగూడ లేక యిట్లొంటరులయిరారు. అగుఁ గాక. వీరికభయమిచ్చుటకన్న గొప్పయుపకృతి యేమి

యుండును? (పైకి) అమ్మా! మీకు భయములేదు. నిర్భ
యముగా నాగృహముఁ బ్రవేశింపుఁడు.

ప్రతి—బ్రాహ్మణవాక్యమువింటిని. ఇఁక మీరు మాభీతినిఁ
బోఁగొట్టినను బోఁగొట్టకున్నను సరియె.

మాధ—సుబ్రహ్మణ్యా! వీరిని మీయాచార్యకుఁ జూపుము
లోనికిఁదీసికొనిచనుము.

సుబ—చిత్తము (స్త్రీలకేసి) అమ్మా! ఇటుపిచ్చేయుఁడు.

విధు—(ప్రతిమతో) అమ్మా! మీకు సందియమువలదు. మీ
కెవరివలన భీతి?

ప్రతి—కారణము చెప్పుచో మీరును సందేహింతురేమో!

విధు—అటుకాదు. వినుఁడు.

శా. సందేహంబనుమాటలేదు వినుఁడా! సంపూర్ణమౌ కారణం
బుం దెల్పందగు మిమ్ముఁ జోరుఁడెవఁడే మోసంబుపాటించుచుఙ్
బందీభూతలఁ జేయ నెంచెనో! జనోపాయంబపాయంబులం
జెందంగాఁదగు రాజవిప్లవమునం జిక్కేమి వాటిల్లెనో!

ప్రతి—దానికి మీరు సందేహింపరు.

మాధ—(తనలో) ఈమాటవలన వీరు సోమదేవభూపాలుని
రాణివాసమని తోఁచుచున్నది.

విధు—మీరు సోమదేవభూపాలుని రాణివాసమనుకొందును.

సిరి—(విచారము నటించును)

విధు—(ఆవేశముతో)

సీ. భాలలోచనమహో భాలసీమలనుండి
చిచ్చుఱకన్నె విచ్చేసెనేని

ప్రళయమహాబ్ధి గర్భప్రదేశమునుండి
బడబానలంబె తా వచ్చెనేని
యమరాజమహిత వాహద్విపద్రైవేయ
ఘంటాధ్వనులుమ్రోయఁ గడఁగెనేని
పాకశాసనహస్త పర్యంతముననుండి
వజ్రంబె తా నెత్తివచ్చెనేని
సకలసామంతభూపాల సంఘములను
జేర్చుకొని బల్లహుండు తాఁ బేర్చెనేని
ఎల్లలోకంబులును నెదురేచునేని
యంతగాయంబుకల్పించి యాఁగువాఁడ.

ప్రతి—అయ్యా! మీరే వాక్రుచ్చితిరి, బల్లహుఁడే భయకారణము.

మాధ—(తనలో) ప్రమాదముచే నింతవట్టుసంభాషణ మీడి గిలఁబడినది. (పైకి) సుబ్రహ్మణ్యా! వెంటనే వీరల మీయాచార్యకుఁ జూపింపుము. సత్వరము తీసికొని చనుము.

సుబ్ర—చిత్తము. (స్త్రీలతో) అమ్మా! ఇటులుదారి, ఇటులు దారి.

(ప్రతిమ, సిరియాలదేవి, సుబ్రహ్మణ్యుఁడును నిష్క్రమింతురు)

మాధ—విధుశేఖరా! చూచితివా! ప్రమాదముచే సంభాషణ పొడవైనది. ఎల్లర యాప్సితార్థంబు లొసంగు కల్పలత మనల నభ్యర్థింపఁ జనుదెంచినది. బల్లహునివలన నపాయమేమియు రాకుండఁ గాఁపాడవలయుఁ గదా!

విధు—అగును.

మాధ—(చెవిలో రహస్యము చెప్పును)

విధు—(తలయూఁపి) ఈయాలోచన సరిగానున్నది.

[తెరలో]

ఉ. ఆలమునందు బల్లహు మహావిభుచేఁ బడె సోమదేవభూ
పాలుఁడు వానిదేవి తనపత్తనపున్ దరినుండి యేడ్కతో
తాళకపాటిపోయెడిని దానినిఁబట్టుఁడి ! యగ్రహారముల్
నాలుగు పారితోషికమనంతరమందున మీరుపొందుఁడీ.

ఏమనుచున్నారు ! ఏమనుచున్నారు !

మాధ—పాపముశమించుఁగాక. ఆలమునందఁట ! బల్లహుని చేనఁట ! సోమదేవభూపాలుఁడు పడెనఁట.

(తెరలో మఱల నాపద్యము)

మాధ—విధుశేఖరా ! చూచితివా ! వేఁగులవాఁడు కాఁబోలు మొఱఁగుచున్నాఁడు. అనంతరకరణీయమునకు నీవు కడంగుము. నీమార్గంబులు శుభంబులగుఁగాక !

విధు—మీయాశీస్సు వృథాకాదు. (నిష్క్రమించును)

(సైంహికేయుఁడు ప్రవేశించును)

సైంహి—అయ్యా ? సిరియాలదేవి మీకెవరికైనఁ గానుపించినదా ? ('ఆలమునందు' అనుపద్యమును మఱలఁ జదివి) ఏమనుచున్నారు ! ఎవరును ప్రత్యుత్తరమీయరేమి ? ఆమెకు గుఱుతులఁ జెప్పెద వినుఁడు.

సీ. గొడిగరానేలల నడచివచ్చుటచేతఁ
బాదపద్మంబెట్టుఁ బాటియుండు

వెంట నెవ్వారేని వెంబడింతురటంచు
గుండెలు తటతటఁ గొట్టుకొనును
ఐశ్వర్యమంతయు నడుగంటుటం జేసి
మెయిదీఁగయందున మెఱుఁగుతఱుఁగు
తనచరిత్రమ్ము స్వేతరులెఱుంగకయుండ
వేఱు వేసముతోడ వెలయనోపు
ఎంత మాటిన మెయియందు నించుకంత
రాచపోలికి కనిపట్టరాకపోదు
ఆ మెసిరియాలదేవి యంచరసి వేఁగఁ
బట్టియుండతిలాభమ్ము కట్టుకొండు.

(సుబ్రహ్మణ్యుఁడు ప్రవేశించును)

సుబ్ర—(మాధవభట్టుంజూచి) అయ్యా! సత్తరువులోని కొక క్రొత్తయాఁడుది వచ్చినది. తమ నెలవున దాఁగియుండఁగోరి మిమ్ము శరణు వేఁడుచున్నది.

మాధ—ఏమది? ఎవరాక్రొత్తవారు? ఇచటికిఁ దోడికొనిరమ్ము.

సుబ్ర—ఆజ్ఞ నిర్వర్తింతును. (నిష్క్రమించును)

సైంహి—అయ్యా! సోమదేవభూపాలపట్టమహిషి పలాయితయై పోయినది. ఆమెయే యీమెయగుచో మీకు నాలు గగ్రహారములు కానుకయిప్పించెదను.

మా—నాలుగగ్రహారములే! ఎటులు? నిక్కవమేనా?

సైంహి—(జందెముపట్టుకొని) గాయత్రితోడు. బల్లహామహారాజుగారిటుల సెలవిచ్చినారు.

**మా**—ఓయీ! సత్రము వేయలేక చచ్చిపోవుచున్నాను. సత్యమా? అసత్యమా?

**సైంహి**—(తనలో) ఈతఁడు లుబ్ధుఁడయినటులు కానఁబడుచున్నాఁడు. చెప్పకుఁగాక. (పైకి) నిక్కువము. నిక్కువము. మిమ్ముల మహారాజునకుఁ జూపించి యింక నెక్కుడుబహుమతి చేయింపఁగలను.

(సిరియాలదేవి వేషముతో ముసుఁగువెట్టుకొని విధుశేఖరుఁడును, సుబ్రహ్మణ్యుఁడును ప్రవేశింతురు)

**సుబ**—అమ్మా! వీరే మా గురుచరణులు. (అని మాయాసిరియాలదేవికిఁ జూపును.)

**మాయాపె**—అయ్యా! శరణమునకై వచ్చితిని. రక్షింపవలయును. (అని పాదములపైఁ బడును.)

(మాధవభట్టు బ్రాహ్మణునకేసి చూచును. సైంహికేయుఁడు కన్నుగీటును. మాధవభట్టు తలత్రిప్పును)

**మాయా**—అయ్యా! శరణంటిని. కాఁపాడుఁడు.

**మాధ**—అమ్మా! మేము కొంబ్బరిపాకలలో నివసించు బ్రాహ్మణశ్రోత్రియులము. మే మేమి శరణమీయఁగలము? ఐనను మీ సంగతి తెలియనిది ఏమిచెప్పను వలనుకాదు కదా!

**మాయా**—(నిర్వేదముతో) అయ్యా! నాకు నాలుక రాకున్నయది. నే నొకానొకపుడు శరణార్థుల రక్షించుదానను. ఇపుడు శరణార్థినిని. నాపేరు సిరియాల—

(అని చెప్పఁబోవుచుండఁగా సైంహికేయుఁడు పట్టుకొనఁబోవును. మాధవభట్టు అడ్డగించును. మాయాసిరి-తొట్రుపడును.)

మాయా—అయ్యా! ఎవరో నాకు ఉద్వేగము గలిగింపఁబోవునటులు తోఁచుచున్నది. శరణంటిని. ఇదిమూఁడవమాఱు. సర్వము మీ యధీనము. శరణన్నవారిఁ గాఁపాడనిచో వచ్చు పాతకము మీ రెఱుఁగనిదికాదు.

మాధ—అమ్మా! తలకుఁ దగనిబరువు నేను మోయలేను. బల్లహుఁడు మిమ్ముఁగొనిపోవ నొకసేననిచ్చియొకబ్రాహ్మణునిఁబంపినాఁడు. మిమ్ము నేను కాఁపాడలేను. నన్ను మోమోటపెట్టవలదు. నేను మీతోఁగూడ నటకువచ్చి దిగఁబెట్టిరాఁగలను. ఇదియే నాచేయుసాయము.

(మాయాసిరియాలదేవి తొట్రుపాటుతోఁ బాఱిపోవనుంకించును. బ్రాహ్మణుఁడు కరతాళముచేయును. భటులు శిబిక గొనివచ్చి మాయాసిరియాలదేవిని బలాత్కారముగాఁబట్టుకొని యందెక్కించి మోసికొనిపోవుదురు.)

సైంహి—అయ్యా! మీరు గొప్పమేలుచేసితిరి. మీరును నాతోడఁజనుదెండు.

మాధ—అయ్యా! నేను గృహము చక్కఁబెట్టుకొనిగాని రావీలులేదు. తేపట బయలుదేరి మిమ్ములఁ గలిసికొందును. మీరుముందు నడువవలయుననుకొందును. నేనచటికివచ్చిన మఱువరుకదా!

సైంహి—అయ్యా! ఎంత తేలిక చేసితిరి? మాయుపాధ్యాయుఁడుకూడ నెన్నఁడు నన్నింత చులకచేయ లేదు. తప్పక త్రేపు విజయం చేయుఁడు.

మాధ—మంచిది.

(సైంహికేయుఁడు నిష్క్రమించును)

మాధ—అనంతర కరణీయమునకు నేనును గడంగెదను. నేఁడో త్రేపో ప్రసవింపఁగల సిరియాలదేవి నిచటఁ గాఁపాడవలయును. అచట విధుశేఖరునివద్ద మృతపిండము నొకటి తెచ్చి పాఱవైవవలయును. నాశిష్యులతోఁగూడ నీకార్యము సమర్థింపఁబోయెదను. ఈశ్వరుఁడే శరణము.

(నిష్క్రమించును.)

ద్వితీయాంకము.



## ప్రవేశకము.

(ఒక పారావాఁడు ప్రవేశించును)

పారా—ఇప్పుడు కొలువు మహాకష్టమైపోయింది. 'సిరియాల దేవి కొడుకును కని చచ్చిపోయింది' అని దివాణంలో మాఱుమోఁగినతర్వాత తప్పించుకొపోయిందని పుకారు పుట్టింది. ఏమిటో ఇది మాయగావుంది. తరువాత మాధవభట్టుగార్ని కొట్లోపెట్టాక మాపని అతలాకుతలం ఐపోతూంది. పెతి అఱ్ఱవెఱ్ఱప్పపాట్లకీ గీఁట్లు గీసేయంత్రాన్ని లాగుతూఉండకపోతే జరిమానాలు ఎక్కువైపోయాయి. (చూచి) అదుగో! వుల్లఁడులాగా ఉన్నాఁడు. మహావడిగ్గా పోతున్నాఁడు. పిలుస్తాను. ఏమోయ్!

(వుల్లఁడు ప్రవేశించును)

వుల్ల—నీపారాగడియ ఐపోయిందికాఁబోలు, తీరికగా కూచున్నావు.

పాలా—ఐపోతేమటుకు తీరికఏమిఏడిసింది?

వుల్ల—నీవూ ఆలాఅంటే ఆశకు మితిలేదన్నమాట. నేను మాయింటిదాన్ని చూసివస్తామంటే వీలులేకుండా ఉంది. నాగడియకు ఇంకెవళ్ళైనా బదిమాలుకుంటే ఎవ్వఁడూ ఒప్పుకోడంలేదు. 'కత్తిమీఁదసామ'ని. దేవుఁడా! ఈ పని మానుకుందామంటే కడుపు కోసుకోవాలి. ఓయి వెంగఁడా! అన్నా! బాబూ! నీకాళ్ళు పట్టుకుంటా! నీవు

ఏమియ్యమంటే అదిస్తా. ఈవేళ నా అఱగడియకూడా కొంచెం నీవు పారాచేస్తే నన్ను బతికించినట్టు.

అని కాళ్ళు పట్టుకొనును)

వెంగ—ఓయ్! ఆఁడదానిమీఁదికి బుద్ధిపాటితే తిప్పుకోడం ఎవఁడితరం? పాపం నీసంగతిచూస్తే చిత్రంగావుంది. కాని నాకూ అటువంటిపనేవుంది. మాయింటికాఁడ యిదురయ్య అనే యేదాంతి ఉన్నాఁడే ఆయన్ని బతిమాలుకుంటా నీకోసం. ఆయన మాఁవొడ్డయేదాంతి. పొద్దూఁకులు ఆ యనతోటే కాలచ్ఛేపం. ఆయన ఇటుమంటి కకుర్తి వొస్తే అడ్డుకుంటాఁడు. ఆయన వొచ్చిందగ్గిర్నుంచీ నాకు చేసే ఉపకారా లిన్నన్ని కావు. మళ్ళీ మాయింట్లో మంచీ లయినా పుచ్చుకోఁడు.

వుల్ల—తమాసాగానేవుంది. ఆయనగుఱించి అంధఱూ అల్లాగే చెప్పుకుంటారు. పోయి ఆయనకాళ్లు పట్టుకుందాంపా. నన్ను ఇయ్యాల రచ్ఛించు.

వెంగ—సరే. మంచిదిపా. మహాగుటకలు మింగుతున్నావు.

వుల్ల—ఇంకోగడియే మద్దె యెవధానం. వడిగాపా.

(నిష్క్రమణము)

తృతీయాంకము.

స్థలము—కారాగృహము.

(చేతులకుఁ గాలులకు గొలుసులు కట్టఁబడి తాళములును వైవఁబడి మాధవభట్టు కూరుచుండును. విధుశేఖరుఁడు పారాయిచ్చుచుండును)

మాధ—నాయనా! ఈమాటలసందున యంత్రములాగుట మఱవకుము.

విధు—మఱవను. (అనియంత్రములాగి) ఈతాళములకు సరిపోవు తాళపుఁజెవులను జేయింపవలయును. ఇదే యామూదము. ఇదేమైనము. దీనితో ముద్దరవైచి తీసికొనిపోవుదును. (అని సమీపించి అటులొనర్చి)

ఉ. దిమ్మలు దిద్దుచందమునఁ దీరికనంబడె లోని మేకు తాఁ
గమ్మనిఁదీసినట్టులను గానఁగఁబట్టె నవాంతరంపుఁ జం
దమ్ములు సర్వమున్ గలిపి దర్పణమందున హత్తుకొన్న రూ
పమ్ములవోలె నేర్పడియె బాఁగు సమస్తముఁ గీఁదఁ జాలుదున్॥

(పెదవి విఱిచి) శతకోటిదరిద్రములకు అనంతకోటిఉపాయములు.

మాధ—యంత్రము లాగుము.

విధు—(లాగి) తాతపాదా! ఎన్నియేండ్లాయెనో యీపారావాండ్రచెలిమి సంపాదింపమొదలిడి! నేఁటికి వీలుచిక్కినది. ఱేపటికి విశృంఖలతరాఁగలదు. ఎట్లందురా? ఱేపు కూడ ఆ వుల్లఁడురాఁడు. ఱేపటివంతునకు నేనెవచ్చెదను. తాళపుఁజెవులు తెచ్చెదను.

మాధ—యంత్రములాగుము. (విధు-లాగును) ఇది యంత గొప్పపనికాదు. బల్లహాదుర్మనః పేటికాకుంచికల సంపాదింపవలయును.

విధు—అగును. ఇవి అందులకుఁగూడ నుపకుంచికలు.

మాధ—నీవు ప్రసవించితివని వచియించిన సమయమునకు సరిగాఁగలిగిన బల్లహుని శిశువగు సూర్యదేవుని విషయముఁగూర్చి లోకు లేమనుకొనుచున్నారు?

విధు—మీరు నాకడనుంచిన మృతపిండమును దనభార్యవద్దను దనకొడుకును నావద్దను బెట్టి బల్లహుఁడే మోసపోయినాఁడు. లోకులు బల్లహుఁడును నన్ను నిక్కనముగా సిరియాలదేవియనియే భావించినారు. (యంత్రములాగి) సూర్యదేవుఁడు సిరియాలదేవి కొడుకని లోకులకుఁగలిగిన విశ్వాసమును సిరియాలదేవి నిక్కపుఁగొడుకగు మాధవవర్మ కూడఁబోఁగొట్టలేఁడు.

మాధ—మంచిది. మంచిది. ఈవిషయమే యాతనిఁజంపితీరునది. పోఁగాక. సిరియాలదేవీ మాధవవర్మలు దుర్భేదులుగా నున్నారా?

విధు—వారిని సుబ్రహ్మణ్యాదులు మిగుల జాగరూకులై కాఁపాడుచున్నారు. (యంత్రము లాగును)

మాధ—వినుము.

శా. కారాగారమునందు జీవము చనుంగా కట్టులో బల్లహుం
డే రాకాసిబలెం బయింబడి వడిన్ హింసించుఁగా కింక నీ
కేరీతిన్ హాయిఁబోయఁగాఁదగినచో వ్వేతెంచనా నేనిఁ తుండ్
వారిన్ బల్లహుఁ డించుకే నెఱుఁగకుండంజేయుమీ! పుత్త్రుఁడా!

విధు—(యంత్రములాగి తనలో) అమంగళము శాంతించుఁగాక. (పైకి) తాతపాదా!

క. ఎందులకీ యారంభము
ముందరఁ జెనుబలిమితోడఁ బూనంబడెనో
యందులకా యారంభం
బిందులఁ దుదదాఁక నిర్వహింపంబడెడున్,

ఇచట శంక కవకాశము లేదు. (యంత్రములాగి) చేపటితో మన నిగళములు నిశ్శంకముగా నూడిపోఁగలవు. ఆ పైని గార్యసిద్ధియే తరువాయి.

మాధ—ఇంక సెలవు వేళ యెంత మిగిలియున్నదో యిసుక గడియారము చూడుము.

విధు—(తలవాలిచి చూచి యంత్రము లాగి) సమీపించినది.

మాధ—నితరువాతఁ బారాయిచ్చువాఁడు వాకిటఁ బరుండి యుండును. దీపము తగ్గించి నీరూపు ఆతనికిఁ గానరాకుండునటులు చూచుకొని యాతని లేపి మఱి వెళ్ళుము.

విధు—ఇచటివిధులన్నియు బాఁగుగాఁ దెలిసికొనియే (యంత్రము లాగి) వచ్చితిని. అన్నియు సక్రమముగా నిర్వర్తించెదను.

మాధ—మంచిది. మఱల గడియారము చూడుము.

విధు—(చూచి) ఆసన్నమయినది. (గొంతెత్తి బిగ్గరగా)

గేయము.

దొంగలొస్తుంటారు జాగర్తా - దొరలూవొస్తుంటారు జాగర్తా.
యంత్రమూలాగాలి జాగర్తా - యానమూచేయాలి జాగర్తా
(అని యంత్రము లాగును)

తంత్రమూ చేయాలి జాగర్తా - తప్పించుకోవాలి జాగర్తా.
మాదవుఁడొస్తాఁడు జాగర్తా - మాపాలిదేవుఁడూ జాగర్తా.
ఓహోయ్- ఓహొయ్- ఓహోయ్- లేవాలి- రావాలి.

(అని నగారా మ్రోఁగించి వాకిటికిఁ జని దీపము తగ్గించును.)

(పారావాడు కనులు నులుముకొనుచు లేచి)

పారా—అబ్బా కుఱ్ఱకాఱుకు గోలఅంటేఇష్టం. వాళ్ల ప్రాణాలు శాంతికంటె కంగారులో తొంగుంటయ్. (విధుశేఖరునకేసిచూచి) ఓరి వుల్లఁడా! నీకింకా సిన్నతనం పోలేదురా! మాధవభట్లోరి సంగతి నీవంటి ఉడుకురక్తానికి ఏమిటి తెలుస్తుంది? సరే! నీపనినీవుచేస్కొని డోల్ బజాయించావు. ఇంకా గోలచెయ్యాక. పో.పో. నేను ఆయనదగ్గిఱ కూకుంటే ఆశ్రమంలో కూకున్నట్టు కూకుంటా. పో.పో.

(విధుశేఖరుఁడు నిష్క్రమించును)

పారా—(లోనికిఁజని నమస్కరించును)

మాధ—(ఆశీర్వదించును)

(పారావాఁడు అటుఇటు పారాయిచ్చుచు యంత్రములాగుచు)

పారా—అయ్యో! చుక్కపొడిచింది. వుల్లఁడులాంటి నడింకాఱు పారావాళ్లుచేసేగోలకు మీకునిదరట్టదు. ఇఁకమీరు కొంచెం నిదిరించే ఉపాయంచూడండి. నేను ఆట్టేకంగాళీ లేకుండా పారాయిస్తాను.

మాధ—ఏలాకో నేఁడు నిదురపట్టుట లేదు.

పారా—ఆలాఐతే ఒహాటి అడుగుదామనుకుంటుండాను. మనుష్యుఁడి జీవితాన్ని గుఱించి మల్లాకొంచెం చెప్పాలి.

మాధ—సరియకాని నాసంభాషణలో నీవు యంత్రములాగు ట మఱవకుము.

పారా—చిత్తము (లాగును)

మాధ—

సీ. మహిలోన మానవు మనుగడయూహింపఁ
గా నొక పెద్ద సాలీని గూఁడు
ఆత్మనిర్గో వ్యాలుం గాదారములనుండి
ప్రసరించి కదలు చొప్పఱచుచుండు
తాఁదెచ్చికొన్న చేఁతలఁబోసంగిన కర్మ
ఫలము నాఁబరఁగు నీఁగల గ్రసించి
తొఱుమాఱయి తుదిదాఁక నూఱటలేక
తనకు నిత్యత్వంబు తారసింపఁ
గట్టుకొను గూఁటి యేర్పాటుఁ గాంచలేక
యూర్పు నిట్టూర్పులనియెడు హోరుగాలి
చేతఁ ద్రెవ్వంగఁబడి పునస్సృష్టిచక్ర
మందు నిచ్చలు దిరుగాడుచుండు.

తెలిసినదా?

పారా—(లాగి) చిత్తం. నాకు అడగడానికి అతికారం ఉంటే ఒక్కమాటడుగుతాను. సెలవిస్తారా ?

మాధ—అయ్యో ! జ్ఞానమెంతకఱ్ఱవైపోయినది ? ఓయీ !

ఉ. నీరును గాలి యాకసము నిత్యము కావలె నెల్లవారి క
వ్వారిగ, నట్టితీరునసె బాఁపన కోమటి రాచరెడ్ల కె
వ్వారికిఁగూడ జ్ఞానములవశ్యముకావలెఁ, దన్నుఁజెప్పఁగాఁ
గోరకయుండె నేనియును గోవిదుఁడెంచి వచింపఁగావలెన్.

జ్ఞానమునకు ఒకానొక బ్రాహ్మణుడును నధికారి కాకపోవచ్చును. నామతమున బ్రాహ్మణత్వమన వంశపారంపర్యముగా వచ్చునది కాదు; జ్ఞానమునఁ జేసి వచ్చునది యీ పదవి.

పారా—(యంత్రములాగి) అయ్యో! అయ్యో! నన్నెక్కడ లోకి తీసుకోపోతున్నారు. జాతి పడిపోతా.

మాధ—పొరపాటు. బ్రాహ్మణత్వము లేక 'మేము బ్రాహ్మణుల' మనుకొనువారె జాతిపడుదురు. నినుఁబోలువారలఁ బైకినెట్టవలయు సమయమిది.

ఉ. దేశము నెల్ల 'విప్రులయధీనము జ్ఞానమ'టన్నపిచ్చియా
దేశము పాడుచేసినది దీనిప్రచారము దేవదేవసం
దేశముఁగూడి యాత్మపటుదివ్యకళామయజీవకోటివా
రాశితరంగనీరకణరంగములందున మాఱుమ్రోఁగుతన్.

సజాతీయుఁడవగు నో జీవీ!

చ. పరిణతిచేతనో యెటులొ పర్యవసన్నతఁ జెందినట్టి యీ
శ్వరుఁడను భూరిభూజమునఁ బండినపండులు కారె జీవు? లీ
శ్వరుఁడను పూవు దాలవెదజల్లెడు తావులు కారె జీవు? లీ
శ్వరుఁడను తల్లి యీను పసిపాపలు జీవులు కారె? చూడుమీ.

ఇపుడిట్టి దృష్టి నిల్పించి చూచు నెడ,

ఉ. వైరము లేద యించుకయు వర్ణవిభాగము లేద సాంఘికా
చారము లేద యెందు ననుచారము లే దలయాత్మ కెందు నీ
తీరులు సాంఘికుల్ తటినిఁ దెత్తురు నూత్తురు, కాలభూములన్
నేరుపుచుండు మార్పుల ననేకము లూసరవెల్లి పోలికన్.

శూద్రాదులకు జ్ఞానాధికారము లేదని ఛాందసులందురు కాని యోగ్యులగువారికి యాజ్ఞవల్క్యాదులు అనుగ్రహము చూపినారు.

గీ. ఎల్లజాతులవారికి నిష్టరీతి
సరిగ నుపయోగపడనట్టి జ్ఞానమేల ?
ఎల్లమతములవారికి నిష్టరీతిఁ
దగి యుపాసింపఁగారాని దైవమేల ?

ఎంతబలము అంతబరువు మోయఁగలిగినటులు ఎంత బుద్ధి అంతజ్ఞానమున కర్హమగును. బుద్ధిలో భేదముకలదు గాని జ్ఞానమున లేదు. బుద్ధి పరిపక్వమగుచో జ్ఞానమున కర్హమగును. అంతియకాని జ్ఞానమునెడ వర్ణ విభాగము లేదు. అట్లనియందఱును ఏకమగుటయుఁ బొసఁగనిపని. కూడనిపనియు. ఏలందువో?

శా. మాంసాహారము మద్యపానము కళామాత్సర్యముల్ జీవవి
ధ్వంసంబుల్ విడనాడువారలకునున్ దద్రీతికిన్ వేఱుగా
హింసాపాత్రములైనవారలకు నెట్లే పొందు చేకూరునే?
హంసల్ కాకులు నొక్కపక్షమున నీరానంగ నుంకించునే ?

పారా—అయ్యా! ఔను. మాయింటికాడ ముగ్గురముండాము. నేను నీచు తిన్ను. నాకు వాళ్లకీపంక్తికల్దు. ఇంకేటి? మాలో మాయింట్లో మాకే కలవకపోతే లోకం అంతా కల్దం ఏలాగ?

మాధ—ఈయుపన్యాస మధ్యమున నీనియత కృత్యమును మఱచిపోయినటులుంటివే! అందులకనియే నేను తఱచు మీతో మాటలాడను.

పారా—(తొట్రుపాటుతో నిర్వర్తించి) ముసలాఁడని యిది వఱకు నన్ను కనికరించడం మామూలైంది లెండి. అంతగా యిఱగకోస్తే యిఱగకోసుకోనీండి. ఇంతకంటె నాకుమంచి సందర్భిస్తుందా యేంటి?

మాధ—(దెసలఁబరికించి మూచూచి)

ఉ. పీనుఁగుకాచుకంపులను బీల్చుచునున్నవి నాసికల్ యమో
ద్యానములోన విచ్చినలతల్ నడయాడెడునట్టులుండె నీ
పైని ననర్థకమ్ములాగి వచ్చెడునట్టులఁ దోఁచు నైన నే
మౌను? సమస్తపాతకములార్చెడు నీశు భజింత మెంతయున్.

[అని కనులు మూసి కొనును]

పారా—(చకితుఁడై అటు ఇటు చూచి) ఏమీకనపడదే? (యంత్రములాగి) ఎక్కడా ఏమీలేదు. (అనిమాధవభట్టును జూచుచుండును.)

(ఒకచేతఁగత్తియు మఱొకచేత విషమునుదాల్చి బల్లహుఁడు ప్రవేశించును)

బల్ల—(తొంగిలోపలఁజూచి తనలో) అంతయునిరామయము గానున్నది. ఓహో! రాచఱికముబహుకష్టము. ఇదిగొప్ప వారిచే భరింపఁబడఁదగినది.

సీ. తొలుఁదొల్తనే తన కొలమునకుం బ్రవ
ర్తిలిన ధర్మువులఁ జింతింపవలయు
తనశక్తిచేత నెంతయుఁ బ్రెగ్గడలమతి
గతుల సంగతులను గాంచవలయు
కాలానుగుణ్యంబు కాంచుచు మార్దవ
పారుష్యములను జొప్పఱుపవలయు

వేఁగులవాండ్రురవీక్షణంబులచేఁ గ
డంగి మండలము చూడంగవలయు
దేశవృత్తాంత మెంతయుఁ దెలియవలయు
రాగరోషంబులను దాఁచి క్రాలవలయు
యత్నమునఁ దన్నుఁ దానె కాఁపాడవలయుఁ
జివ్వమొన దానికిని నపేక్షింపరాదు.

(తొంగిచూచి పైకి) ఓరీ! ఇటురమ్ము.

పారా—(తొట్రుపాటుతో నీవలికి వచ్చి నమస్కరించును)

బల్ల—ఇంత యజాగరూకతగా నుండుటకేనా నిన్ను నియమించినది?

పారా—అయ్యా! అయ్యా! అసలే ముసిలితనం. అందులో నడిరేయి. పెమాదం మన్నించాలి.

బల్ల—ఇన్నితూఱులు మన్నించినందులకే ప్రమాదమెక్కుడగుటకు హేతువు. నీకుబదులు మఱియొకఁడు రాఁగలఁడు. నీవుపొమ్ము.

పారా—మారాజా మారాజా మన్నించాలి. (అని కాలఁబడును.)

బల్ల—(తన్ని) పొమ్ము పొమ్ము నీవావలికిఁ బొమ్ము.

(పారావాఁడు లేచి నిష్క్రమించును.)

బల్ల—(తొంగిచూచి, తనలో) సిరియాలదేవి కనినశిశువును జంపింపఁ దలఁచితిఁగాని యదిమృతపిండమయినది. సొమ్మ లోఁబడియున్నయామెకుఁ దెలియనీక నా శిశువును నచట మాఱుటగాఁ బెట్టి యామెకుఁ జూపక విడిగానుంచి పోషిం

చుచుంటిని. పట్టమహిషికడ నామృతశిశువును బెట్టి బల్లహునకు శిశువుకలిగి నశించెననుసడి లోకమున వ్యాపింపఁ జేసితిని. ఇటులుకదా లోకమును వంచింపవలయును.

సిరియాలదేవి మృతిచెందినదికదా! అచట నచట 'సిరియాలదేవి బ్రదికి యెట్టులో తప్పించుకొని పాఱిపోయినది' అనిగూఢముగా వార్త ప్రాఁకుచున్నది. జంతువులయినను శిశువును, శత్రువుల కగ్గముచేసిపాఱిపోవునా? ఈమెపాఱిపోవుననుట సంశయము. ఆమెఁ దెలియుకొఱకు నేఁటికిని వేఁగులవాండ్రు తిరుగుచునేయున్నారు కాని వృథా.

ఒకవేళ, ఆమె జీవించియుండునెడల భట్టారకుఁడుండుచోఁ బ్రమాదముకలుగును. ఈతనిఁజంపివైచుచో నామె యేమియుఁ జేయఁజాలదు. సరియ. సీరదేవుని ఈపనికై వినియోగించి పదపడి ఆతనిని గ్రహించెదను.

(అని గంట మ్రోఁగించును)

(ఆయుధపాణియై సీరదేవుఁడు ప్రవేశించును.)

బల్ల—గూఢామాత్యా! కాల మప్రమత్తముగా నున్నదా?

సీర—(తనలో, నిర్వేదముతో) ఔరా! మంత్రిత్వమనఁగాఁ గష్టము. ఏలన,

మ. సిరిచేకూరిన రాజుశక్తియనుచుం జేసైనచో మంత్రి దు
ర్భర ధీదోషమటంచు నెంచును జనవ్రాతంబు రాజుల్ శ్రవః
పరమానందముగా 'నమాత్యుల'నుచున్ వాకొండ్రు దారంబుగా
సిరిచేకూఱిన నాదరింత్రు చెడుచో శిక్షింత్రు ఘోరంబుగాన్.

(పైకి) అప్రమత్తముగానె యున్నది.

బల్ల — నేనిచటఁ గాఁపుకాయుచుందును. నీవు అడుగవలయు ప్రశ్నముల నడిగి నీపని నెఱవేఱుపుము.

సీర—(సంశయముతో లోఁ బ్రవేశించి, మాధవభట్టుం గాంచి)

ఉ. బిక్కమొగంబులేదు పిరువీఁకునఁ జంచలతానుగాములా
దృక్కులులేవు మోమునను దేజము రూపము తాల్చి శాంతతం
గ్రక్కుచునుండె నెట్టులఁ గరాచురిచేతఁ గసాయివోలె నే
నక్కట! బ్రహ్మహత్య నరుదార నొనర్తు? నశంకితుండనై.

ప్రత్యక్షక్రోధముచే మొదట నీతనికి సాయపడుటయే తప్పైనది.

బల్ల—(తొంగిచూచి, కత్తి యదలించుచు) ఏమంటివి?

సీర—(ధైర్యముతో) నే నీ హత్య యొనర్ప నసమర్థుఁడను.

బల్ల —(తనలో) ఈతని నిపుడేమియు ననఁగూడదు. కార్యము ముగించి యీతని నిగ్రహింపఁదగు. (ప్రకాశముగ) ఓయీ! అటులగుచో వెలికివచ్చి కాచుచుండుము. ఏమని యెదవు?

సీర—(తనలో) తప్పించికొని వెక్కిరింపవలయును. (ప్రకాశము) అటు లొనర్తును. (అని వెలుపలికి వచ్చును. బల్లహుఁడు లోనికిఁ జనును.)

(చూచి) గీ. ప్రాతరాయాతసూర్యబింబంబువోలె
యజ్ఞతృప్తానలత్రితయంబువోలెఁ
దేజముల వెల్లు తా నెల్లదిక్కులందుఁ
గ్రక్కు నీతనిమోము నేఁ గాంచఁజాల.

(అని మొగమున నొకగుడ్డవైచి) భట్టారకా! లెమ్ము. ఇఁక నీ యిష్టదైవమును స్మరించుకొనుము.

[మాధవభట్టు సమాధిస్థుఁడై మాటాడకుండును]

బల్ల—కత్తిమొనతోఁ బొడిచి) ఏమియిది ? మాటాడఁడేమి ?
(అని యాలోచనాపరుఁడగును)

సీర—(తనలో) ఈ బ్రహ్మహత్యను నే చూడఁజాలను. ఈ దురాత్ముఁడు నన్నుఁగూడ నిఁకఁ జంపునటు లీతని వెనుక చేఁతలు తోఁపించుచున్నవి. ఈ సమయమున నె మెల్లగా నేనావలికి దాఁటి యీతనిమరణోపాయమును వెదకెదను.
(అని నిష్క్రమించును)

బల్ల—(చూచి) ఇంతరక్తము కాఱుచున్నను లేవఁడేమి ? ఇఁక నాలస్యము కాఁగూడదు. ఓరీ బ్రహ్మబంధూ! లెమ్మ [అని మఱలఁగ్రుచ్చి] పలుకవోటు [అని కత్తికి విసము పూసి మఱలఁగ్రుచ్చి]

ఉ. ఆఁగుడిగుండెలార ! యిఁక నంతగనుంబనిలేద మీరుఁ బే
రీఁగఱుఁ దోమలున్ముసిరి యీతని మేనినిఁ జుట్టువారు నీ
వేఁగుము స్వర్గమే నరకమేనినిఁ గర్మఫలంబెటుండె నా
లాగున మాధవుండ ! విఫలంబిఁక నీవొనరించుపూనికల్.

[అని యాలోచించుచు, తనలో]

క. 'జననాథుడు తనగూఢపుఁ
బనులను నెవ్వారలకును వచియింపంగా
డునో యవ్వారలకును నా
పనిఁజేసి యవశ్యముగను పశ్యుండయుగుఁడా'.

అని పరాశరుఁడు చెప్పినటు లీ సీరదేవునకు నేను లొంగి యుండవలసివచ్చును. ఇంతియకాక యీతఁడు విఘటించి

ప్రజలలోఁ గలవరముపుట్టించి రాజ్యమునకుఁగూడ నప
కారి కాఁగలఁడు. కావున నిఁక నీతనిఁ జంపితీరుదును.
[అని క్రోధముఖుండై బయటికివచ్చి చూచి] ఏమిది ?
తప్పించుకొని వెక్కిరించినాఁడే ! [అని తలుపుమూసి]

శా. అంభోరాసులు బాడబానలముచే నట్టే ద్యుమార్గంబునన్
జృంభింపంగనులేద సూర్యులును బన్నిద్దర్ ప్రకాశింపలే
దంభోజాసను జీవితంబు తుటితో నంతంబు కాలేద యా
లంభంబుం బొనరింపకే నినుఁ బెల్చం బోవఁగానిత్తునే ?

ఓరీ ! సీరదేవా !

గీ. కుతలగర్భంబునందు డాఁగుదువుగాక
లింగదేహంబుతోడఁ బొల్చెదవుగాక
చెదిరి మఱియొకచోటఁ బుట్టెదవుగాక
మృత్యుదేవత నగుదు నీ కిప్పుడేని.

చ. నడువుఁడి ! గాలులార ! పరిణాహఫణంబుల మింటికెత్తుచున్
గడఁగుఁడి ! దుర్విషాచితవికారతమఃపటలంబులార ! పెం
బడుఁడి ! చలత్కరాసిపరివారితదంతురకాంతులార ! నే
నుడిపెద సీరదేవునిదె యూఁదినిలుండు ! కడిందిలావునన్.

[ఆలోచించి]

గీ. అకట ! ‘ యింతకు నా సిరియాలదేవి
యుండెనా ?’ యని మదిలోన నూహసేయు
క్షణమునందున గుండెలు జలదరించు
నాపె పుత్రునె కన్నచో నోపనగునె ?

[అని క్రోధముఖుఁడై పరిక్రమించి పరుగిడును]

తృతీయాంకము.

---

## చతుర్థాంకము.

---

(శార్ఙ్గరవుఁడు సుబ్రహ్మణ్యుఁడు ప్రవేశింతురు.)

సు—శార్ఙ్గరవా! మాధవవర్మ మనస్సునకుఁ జీమకుట్టినట్లుగాయి నఁగనుపట్టదేమో? బల్లహునిమీఁది నా కసియెటులు పోవును? గురువు తరువాత గురువంతవాఁడగు విధుశేఖరుఁడు పితృవధ తెలిసినతోడనే మరణించెననియుఁ దన తల్లికూడ మృతిచెందెననియుఁ దెలిసికూడ మాధవవర్మ విరక్తునిపోల్కి నడవులఁబట్టి తిరుగునేమో! ఈబ్రహ్మహత్యకుఁదగు ఫలము బల్లహుఁడనుభవింపనిచో నిఁక శాస్త్రములేల? అందఱు చూచుచుండఁగా శాస్త్రములఁ దగులఁబెట్టుదును.

శా—(నవ్వి) కర్మఫలమును మనము ప్రతివ్యక్తియెడనులగించి సమన్వయము చేయఁజాలము. 'కర్మణోగహనాగతిః' కదా! అదియటుండె. సోమదేవభూపాలుని పాలనము విరామము చెంది పెక్కు శతాబ్దులు దాఁటిపోయినటులున్నది. మాధవ భట్టారకుని మృతియు విధుశేఖరు మరణమును నత్యాహితము.

మాధవవర్మ యెల్లపుడును జింతాక్రాంతుఁడై యడవులఁ బుట్టలఁబట్టి తిరుగుచున్నాఁడు. ఎంతయో ప్రయత్నము చేసి యీపేరుసిని చేతిని సంపాదించితిని. దీని నాతనికిఁ జూపి తనజీవితము సఫలీకరించికొనుమని యిచ్చివైతము. (చేతినిఁ పైకెత్తి)

గీ. పయిశరీరము క్రమముగాఁ బాసిపోని
లోని యెముకలు తెల్లగాఁ గానుపించె
వానకాలున నల్లని వారిదములు
పోకడంగఁగఁ దెలిచందురేకవోలె.

సు — మంచిదియె. ఔర. కర్మఫలమునకు మంచిత్రోవ తెలిపితివి.

(ఇరువురు నిష్క్రమింతురు)

శుద్ధవిష్కంభము.

---

(అడవిలో పులితోలుకట్టుకొని మాధవవర్మ ప్రవేశించును)

మాధ — తండ్రి పినతండ్రులు మడియుటకాక, నాకొఱకు గురువు గురు పుత్రుఁడును మడిసినారు. పవిత్రుఁడగు మా తండ్రి దైనందినమును దనకుఁ గలలోఁగానుపించుచున్నటులు సుబ్రహ్మణ్యుఁడు చెప్పుచున్నాఁడు. మహావీరుఁడగు పేర్నిఁడు విబాహుఁడై కలలలోఁగానుపించుచున్నటులు శార్జరవుఁడు చెప్పుచున్నాఁడు. కోరికలుతీరనిది పునర్జన్మము గ్రహింప వీలులేదని లోకవాదముకదా!

అడవులలో నొంటరిగాఁ దిరుగు నపుడు నాకు దూర దూరముగా నొకవ్యక్తి శీఘ్రగమనము చేయుచున్నటులు కానఁబడుచున్నది. వడిగా నచటికిఁబోయిచూడఁగాఁ గానఁబడక మాయమై పోవుచున్నది. వెనుదిరిగి చూడఁగా విబాహువగు మఱొకవ్యక్తి కాననగుచున్నది. అచటికిఁ బోయి పరికింపఁగా నాపరిసరంబుల నదియుఁగానరాక

మాయమైపోవుచున్నది. ఇది యేమిమాయ! ఎవరితోనైన నీవిషయముఁగూర్చి చెప్పఁదలంచుచుందును గాని పరిహాస పాత్రమ నగుదునని మానుచుంటిని.

శత్రుల నిర్జించుమాటయటుండె. నాహృదయమునే నేను నిర్జించుకొనలేకున్నాను. ఏమిగతి! ఈరెండు వ్యక్తులును వెన్నుముందాడి నన్ను భీతియుక్తునిగాఁ జేయుచున్నవి. నాచేతనున్న ఖడ్గముకూడ శిథిలమయి జాఱిపోవుచున్నది. నాహృదయమును నీఱయిపోవుచున్నది. చిత్తమునుజయించి యెటులీ యాపద దాఁటఁగలుగుదును? (ఆలోచించి) ఆరెండువ్యక్తులును నా తండ్రిబినతండ్రులగుదురేని ఏల మాటాడకుందురు?

ఇది బల్లహామాయాకల్పితమా? లేక తద్వినాశకయంత్రమా? లేక శార్జరవ సుబ్రహ్మణ్య హృదయావేశ బలజనితవిలాసమా? లేక మఱల దేహముస్వీకరించుటకుఁ గల్లోలములగువారి దేహాంతరములా? లేక పిఱికియైన నా హృదయము సృష్టించిన మిథ్యాసృష్టియా?

(ఆలోచించి) ఇదియేదియునగునని నిర్ధారింప నాధార మిసుమంతయుఁగానరాదు. కాదనరాదును.

ఔరా! ఈ ప్రకృతియందు మనము సాక్షాత్తుగాఁ జూచునవియేకాక తెలియఁబడనివి అనేకములు కలవు. ప్రకృతిజుష్టమయిన జీవినేత్రము ఎంతని చూడఁగలదు? కంటికిఁ గానఁబడు బాహ్యాకారమునే చూడఁగలదుకాని

దానిని దాసిమనస్సును అమనస్సును నియమించు శక్తిని జూడఁజాలునా ?

శా. ఆకాశంబునయందు మేఘములగుం పాలోకనంజేయఁగా
నాకారంబులు వెక్కు-కానఁబడున ట్లాయాయికాలంబులం
దేకీభూతమనోంతరాళములలో నేర్పాటునుంబొంది యా
లోకింపంబడు నేనారూపములు మేలుంగీడులం దెల్పుచున్.

కేవల మనోనేత్రమునకే కాక బాహ్యనేత్రమునకును దఱుచుగా నాకు ఆ రెండురూపములును గానవచ్చుచున్నవి. తండ్రినిఁగాని పేరునినిఁగాని నే నెఱుఁగనుగదా ! వారేవీరని యేర్పఱింపను నే నశక్తుఁడను.

మ. కలలోఁగాంచినరూపు కొండొకఁడు వర్ణింపఁగా దానిఁదాఁ
గలలోఁగాంచియు విస్మృతిం గనియు నాకారంబు డెందాన ని
శ్చలతన్ భావనఁజేసి యెట్లెటులొ తచ్ఛాయన్ వడిం జూచు న
ట్లెలమిన్ వారలరూపముల్ మనుఁగులో వీక్షింపఁగానయ్యెడిన్.

వారు నాకిటులు కానఁబడియు నిలుకడగా నుండరు.

ఉ. దయ్యమువోలె నుండొకఁడు తాఁగనుపట్టును దూరమందు నొ
య్యొయ్యఁ బరిభ్రమించి చని యోలములందున దాఁగినట్లుగా
భ్రమయ్యఁబడున్ మఱొక్కఁడును గొంచెముకానఁగఁబట్టి పిమ్మటన్
బయ్యెర దూదివైె చనును బాహులవిచాలన లేకపోయినన్.

ఇవి యరణ్యములందు సంచరించుచుండు దయ్యములయి యుండునా ? దయ్యములేయగుచో నాకుఁ గానఁబడియు నిసుమంతయు నపకారము చేయకుండుటెటులు ? లేక వనదేవతలయియుండునా ? వనదేవతలే యయినచో ము

సుఁగు లేలయుండును ? అందొకఁడు విశాహుఁడై యుండ నేమిటికి? ఇవినిక్కవముగా సోమదేవభూపాల పేరునీఁడుల దేహము లే కావలయును. (ధ్యానమునటించి) ఓపితృచరణు లారా! నాకుఁ బ్రసన్నులుకండు! అనుగ్రహము నింపుఁడు. ఆదేహములు మీవేయగుచో మఱలనాకుఁ గానఁబడుఁడు. నేనేమి మీకొనరింపవలయునో యాదేశింపుఁడు!

(కొంచెముకాలము నిశ్శబ్దత)

(మాధవవర్మ దృష్టిప్రసరింపఁజేయును. ముసుఁగిడికొని

యొకవ్యక్తి దూరముగాఁ బోవుచుండును.)

(ఎలుఁగెత్తి) అయ్యో పోకుము! పోకుము! నాకేమి యైన నాదేశింపవలసియున్న నాదేశింపుము.

(వ్యక్తిమాయమైపోవును)

(వెనుకకుఁజూచి) ఇదియేమిమాయ! ఈవెనుకప్రక్క నుండి విశాహుఁడై యావ్యక్తిపోవుచున్నది!

(ముసుఁగులో నొకవ్యక్తిపోవును)

ఎలుఁగెత్తి) ఓసూక్ష్మదేహమా! పోవకుము, పోవకుము! నాకేమయిన నాదేశింపవలసియున్నచో నాదేశింపుము. ప్రసన్నుఁడవుకమ్ము.

(వ్యక్తి యంతర్ధానము చెందును)

(నిర్వేదముతో) ఔరా! ఇదియుమాయమైపోయినది. ఈరూపులిటులు కనుపట్టి మాయమైపోవుటకు నాహృదయ మెండమావి కావలయును. ఇటులు నిక్కవముగాఁ

గానఁబడుచుండఁగా నెండమావియని యెటులు తలపోయ నగును? (ఆలోచించి) ఎండమావులలో మాత్రము నీరు ప్రత్యక్షముగానున్నటులు కానఁబడదా? కావున నిదియు భ్రమయే కాఁదగియున్నది.

ఉ. ఒరగనోరఁగాఁ గనులనూఁది కనుంగొన నప్డు మెల్లఁగా
వారలుపోవుచుండుదురు ప్రాంతములందునఁ జేరిచూడఁగా
దూరతలంబులందుననుదోఁచి రయంబు గమించి శ్వేతిమా
కారముతాల్చి గాలియుఁగాఁ బరువెత్తుదురోర భీతిలన్.

ఈవ్యక్తులు వారి వేయగుచో నాకు వారి వివక్షితములఁ జెప్పరాదా? లేక యివి వీరి యాతనాదేహములా? అటులగుచో నీవ్యక్తులయందు దుఃఖము కానఁబడదే! అటులు సుఖమును గానఁబడదే? కావున యాతనాదేహము లని చెప్పను వీలులేను.

ఉ. కాకులపిండు పిండమును గైనిడి వైచెడు వేళ నెంతయున్
సాకతమిచ్చి సాకడెదనంగను జెప్పఁగ వింటి స్వప్నమం
దాకలనంబుసేయ రెదురై యొకకోరికనేని నెమ్మియిన్
నాకును గానుపింపఁగ దొణంగియుఁ జెప్పర వారిభావమున్.

కావునను యాతనాదేహములుగాని కోర్కెచెల్లక ధరించు కొండొక దేహములుఁగాని యివి యెటులగును? కావున నివి నిక్కముగా నెవో దయ్యములు. (యోజించి) నా హృదయమున నన్యసంకల్పమును బిఱికితనమును బాపి కొందును. ఇఁక నీమాటీ ఆరూపములకుఁ దావు ఉండఁ బోవదు.

క. భావం బేకముఖంబుం
గావించుకొనియు సమగ్రగాంభీర్యముచే
నే విహరించెద నటవీ
భూవలయంబునను సింగపుంగొదమగతిన్.

జనాకీర్ణంబులగు జనపదంబులును బత్తనంబులును బాపనిలయంబులు. సాధుద్వధ్యస్థానంబులు. ఛీ. వాని దెసఁ బోవఁగూడదు. ఈ యరణ్యమునకు నేను ప్రభుఁడనై వర్తింతుఁగాక. ఈ ప్రభుత్వము తనంతఁ దానే వచ్చితీఱును.

మ. ఎవరా యిచ్చినవారు సింగమున కస్లే నిండుజాబిల్లికిన్
బవలింజేయు వలంతికిన్ గరుడికిన్ రాజత్వముల్ సర్వజం
తువ్రా[illegible] తిక్క్రుల గాములం బులుఁగులం? దోడ్తోడ వారితిఁ బ్రా
భవముఁ బూనెద నియ్యటవ్యఖిల భూభాగంబునం బేర్చుచున్.

(అని చిత్తైకాగ్ర్యమునటించి) ఇఁక నేను కుశలిని. (దృష్టి ప్రసరింపఁజేయును)

[ఒకవ్యక్తి ముసుఁగిడికొని పోవుచుండును]

ఔరా! మఱలఁగానవచ్చుచున్నదే! ఈకత్తిచే దీనిఁ దుత్తునియలు గావించెదను.

ఉ. కంపములేదు తొంటివలెఁ గైనిడు కత్తియు జాఱిపోదు చా
లింపవు గుండియల్ కడుబలిష్ఠతఁ జేకొనుపూన్కిసొమ్మలో
దింపవు భీరుతల్ మదినిఁ దెంపునఁజేసి పరాక్రమించుచుం
జంపెదఁజంపెదన్ మిముఁ బిశాచములార! కరాసిధారచేన్.

[అసి కత్తివిసరివైచును, వ్యక్తి మాయమయిపోవును]

ఇది యేమి? ఇది కానరాకుండఁ బోయినదే! [అని వెనుకఁజూచి] ఔరా! ఈవైపున నీదయ్యము కానవచ్చుచున్నది. దీనిఁదుత్తునియలు కావించెదను.

[అని కత్తినివిసరును, వ్యక్తిమాయమైపోవును]

[విషాదముతో] ఔరా! మీాముందు నాశక్తియంతయు వమ్మైపోయినదే! [దగ్గుత్తికవడిన గొంతెత్తి ఆకసమువంకఁజూచి]

ఉ. ఓ భగవానుఁడా! కరుణనూని కనుంగొనుమయ్య నన్ను నే
లోభముచేత నా కనులలోఁ గనుపట్టుచునున్నవారలో
క్షోభము వొందనయ్యెడిని గోరికయున్నదఁ జెప్పఁజేయుమ
య్యా! భవదేకపుత్రుఁడను నాతురమూర్తి కరణ్యవర్తికిన్.

[అనికూలఁబడి చూచి, దగ్గుత్తికతో] ఔరా! మఱల నాముందర వారిరువురును గానఁబడుచున్నారే!

[రెండువ్యక్తులు విడివిడిగా ముసుఁగిడికొని పోవుచుండును]

[దగ్గుత్తికవడిన గొంతెత్తి] ఓపితృచరణులారా! మీారు నాపితృచరణులు కారనుకొనుచు సాహసించితిని. నాసాహసమును క్షమింపుఁడు. మీారెవరో యెఱుక లేక కత్తివిసరితిని. మీారు మఱలఁ గనుపట్టుటఁ జేసి నాయెడ మీారనుగ్రహము తాల్చియున్నారని తలంచుచున్నాను. మీారే నా పితృచరణులగునెడల దయయూని వినుఁడు.

ఉ. ఎల్లి నిశాంతరాశమున నేపుదలిర్పఁ బరాక్రమించుచున్
బల్లవ బల్లవాత్మజులఁబట్టి పలార్తు వెలార్తు మిమ్ములన్

జల్లఁగ బంధమోచనముసల్పెద నిల్పెదఁ జేయనీని శా
వాల్లన సింహపీఠమున నయ్య పతాక జగాన నెత్తెదన్.

వీరల నాచేతితోఁ జంపక జీవించువాఁడఁ గాను. ఇదియె నా ప్రతిజ్ఞ. ఇదియే మీకోరికయేని గుఱుతుకొఱకు నాకుఁ గానరాకుందురుగాక.

[వ్యక్తులు అంతర్ధానము చెందును]

[చూచి] ఆహా ! వీరికోరికెలు తెలిసినవి. [దెసలఁ గల యంగనుంగొని] ఎక్కడను గానరారయ్యెదరు. ఆహా ! నాకు ఉత్సాహము పొంగి పొరలుచున్నది. మఱలఁ గాన వత్తురేమో ! [చూచి] కానరారు. దిక్కులు శూన్యములుగా నున్నవి. నేను కృతార్థుఁడను.

చ. తిన నిదురింప మేల్కనఁగఁ దిరెను నట్టిది కాదు జన్మమె
త్తినపని లోన నెవ్వఁడో కదిల్చినరీతిఁ జలించు రేకులన్
మునుకొను చిత్తపద్మమునఁ బుట్టు వికారము లార్పఁబోక తీ
ఱనిదికదయ్య జీవునితెఱంగు శరీరము మాసె నేసియున్.

కావున నేనిఁక ముముక్షుఁడనయ్యెద. నాకుఁ బయివారు జయము పలుకుదురా? అజయము పలుకుదురా? ఇదియేమిప్రశ్న? [కొంచెము పరిక్రమించి ఆలోచించును]

[తెరలో] మహారాజునకుజయము జయము.

మాధ—[సంతోషముతో] ఎవరా జయముపలుకువారు.?
[అని తరళితుఁడగును]

[శార్ఙ్గదేవుఁడు సుబ్రహ్మణ్యుఁడును ప్రవేశింతురు]

శార్ఙ్గ } మహారాజునకు జయము.
సుబ్ర }

మాధ—మా పినతండ్రిచేతినిఁ దీసికొని వచ్చితిరా ?

శార్ఙ్గ—[చూచి తనలో] దైనందినమును ఆలోచనాగ్రస్తముగాను నిర్వేదోపహతముగాను గానఁబట్టు మాధవవర్మ ముఖము తేజస్సు గ్రక్కుచున్నయది. ఏమి హేతువయి యుండును?

సుబ్ర—ఏలతీసికొని రాకుందుము? కర్మఫలము స్ఫుటముగాఁ గానరానియెడల శాస్త్రములకుఁ జావుమూఁడినది.

మాధ—అది యేమి?

సుబ్ర—

మ. 'అదియేమీ' యని పల్కరించెదవు కర్మార్థంబు గూఢంబటం
చదుకంజూచిన నూరకుండుదువె? వేదాంతంపు శాస్త్రంబులన్
గుదిగా గూరిచి మంటలోఁగలిపెదం గోసెత్తగా నెల్లరున్
మదిలోనున్న మహానలం బది యెటుల్ మాయింతుఁ గాకున్న చోన్.

మీ తండ్రినిఁ బినతండ్రిని నకారణంబుగాఁ జంపిన బల్లహుఁడు తగిన కర్మముకుడవనిచో నిఁక వేదాంతములు కర్మము నెటులు సమన్వయము చేయఁగలవు?

శార్ఙ్గ—[నవ్వి] ఈ జన్మ మొకటియేనా అనుభవించుటకు ? ఉత్తరజన్మము లన్నియు నెందులకు ?

సుబ్ర—ఇది వెఱ్ఱివేదాంతము. పూర్వపుజన్మములలో వారు బల్లహునకు అపకారము కలిగించిరనియు దాన నీతఁడు వారల మడియించెననియు నను కొన్నచోఁ దీరిపోవును.

శార్ఙ్గ—అటులుమాత్ర మేల కాఁగూడదు ?

సుబ్ర—ఆఁ. కావుననే వెఱ్ఱివేదాంతము. ఇటులగుచో లోకమున దుష్కృతియన్న మాటకే తావులేదు. ప్రతి దుష్కృతియకును ఈ విధము ముడిపెట్టుచోఁ గర్మఫలమునకు మంచి సమన్వయము! బలే ! బలే !

శా. వేదాంతంబున కట్టిపాటు లకటా! వచ్చె, నీపాట్లకై
యేదోరీతిఁ బఠింపఁగూడదు సదా యివ్విద్య, వచ్చినచోఁ
బ్రోదింగూర్చెడు జీవివేగములు భోక్తృత్వయుక్తై, కర్మమ
ర్యాదల్ తాము సమన్వయంబునకునై రావే దెసం జూచినన్.

శార్ఙ్గ—[తనలో] ఈతఁ డింత విశృంఖలతగా మాటలాడుట చిత్రముగా నున్నది. [ప్రకాశము] సహాశ్రోతా ! నీకేమ యినఁ గొంచెము పిచ్చియెత్తినటులు గోచరించుటలేదా ?

సుబ్ర—[కోపముతో] ఎవరిపిచ్చి వారికి గోచరింపదు. నీకు మాంద్యము ప్రవేశించినదని నాకు గోచరించుచున్నది.

శా. వేదాంతఁబున మాంద్యరోగమటు లావేదాంతముం గారణ
ప్రాదుర్భూతిగ వీఁడఁ బిచ్చియగు నారా! రాజరోగంబులీ
మాద్రిన్ మాధవరాజవైద్యునికడన్ మందుంగ్రహింపంగఁబో
కీదౌర్భాగ్యము వీఁడిపోవదుచుమీ యెన్నేళ్లు చింతించినన్.

మిత్రమా ! ఏమి మందు చెప్పెదవు ?

మాధ—మీ రేల కల్లోలపడియెదరు? ఇటురండు.

[ఇరువురును సమీపింతురు. మాధవవర్మ రహస్యముగా తండ్రి పినతండ్రులయుఁ దనప్రతినయు విషయము చెప్పును]

శార్ఙ—ఆశ్చర్యమాశ్చర్యము.

సుబ్ర—ఆశ్చర్యము. కర్మఫలమునకు ఇది సమన్వయము కాని వేఱొండు కాదు. బలే! బలే!

మాధ—చేతి నిత్తురా?

శార్ఙ—[తీసియిచ్చును]

మాధ—[చేతిని మెడకుఁగట్టికొని] అయ్యా! మీరేఁగి తేపు నడిరేయి బల్లహామందిరంబుకడ నన్నుఁ గనుఁగొనుఁడు. నేను కార్యవ్యగ్రతమై పోవఁగలను.

కం. ఈసేపాటికి బల్లహ
భూపతి తత్సుతుఁడు నాదు భుజమున కెరగా
నోపుదురు సింహపీఠము
మాపినతండిరి భుజం బహూంతం బెక్కన్

శార్ఙ } సుబ్ర } జయము జయము.

నిష్క్రమణము.

---

## పంచమాంకము.

---

[సూర్యదేవుఁడు చేతఁ గత్తిఁ దాల్చి ప్రవేశించును]

సూర్య—మాయమ్మ సిరియాలదేవి యెటులో తప్పించుకొని పాఱిపోయినదని గూఢముగా వ్యాహరింపఁబడుచున్నది. భట్టారకుఁ డామెను దప్పించెనని యాతఁడు కారానిబద్ధుఁ డాయెను. సిన్నరేయి నాతఁడు కొండొకచోటికి మార్పఁ బడెనని తెలియుచున్నది. ఇందుఁగూడ నేమేని మోసము కలదేమో !

బల్లహుఁడు నేఁటిప్రొద్దున 'నీవు నాయాత్మజుఁడవు' అని తెలిపినాఁడు. 'దండపాణి' ఆసంగతి యసంగతమని చెవినిల్లుగట్టుకొని పోరుచున్నాఁడు. నాస్థితి యెంత విషమముగా నున్నది ! మొదటినుండి విద్యాబుద్ధులఁ గఱపిన యాచార్యుఁడా ! కారాగృహంబుననున్నాఁడు. కన్నతల్లి తెఱఁగు ఎఱుఁగరాదు. తండ్రి పినతండ్రు లంతకుముందె విశసింపఁబడిరి. అదియటుండ బల్లహుఁడు 'నీవు నాకొడుకవు' అని చెప్పుచున్నాఁడు ; కాని నాకు నేనపైఁ గొంచెమేనియు స్వాతంత్ర్యము చూపఁడు. ఔరా!

ఉ. కోకిల గ్రుడ్డునుం బొదివికో నసమర్థతఁ జెందె దానినిం
గాకులగూఁటి గ్రుడ్లనడఁగాఁ దనగ్రుడ్డని కాకిసాఁకఁ దా
కోకిల పంచమస్వరము గ్రోల్చిన దానినిఁ దన్ని పైటికిన్
జోకడఁబెట్టురీతిని ననుం ద్యజియించెను బల్లహుండహా!

నాపని 'రెంటికిం జెడిన రేవఁడ'యినది. విధివిధానమెట్టులు న్నదో! బల్లహునిఁ దెగఁజూచుమని 'దండపాణి' నూటిపోయుచున్నాఁడు. బల్లహునిఁజూచిన నాకనురాగమే యుదయించునుగాని ద్వేషము జనింపదు. అతనిభార్య మంజుమతీదేవియు బల్లహునివద్ద నున్న నన్నుఁ గాంచ నరుగుదెంచుచుండును. నే నన్యపురుషుఁడనే యగుచో రాజమహిషి నన్నుఁగాంచ నరుగుదెంచునా?

చ. కొడుకును దండ్రి యెట్లు కనుఁగొనఁ దగునో యటు బల్లహుండు నన్
గడుకొని పూర్ణవత్సలతఁ గాంచుచునుండును మాటిమాటికా
బిడదయును గన్న కానుపును బిల్చెడు కిటు నన్నుఁ బిల్చి యె
ప్పుడు తన మేల్మినుంగడల మోమును జూపును బ్రేమ చిప్పిలన్.

నాకును వారికిని జన్యజనకభావమే కానఁబడుచున్నది. వ్యవహారసందర్భములన్నియుఁ గృత్రిమములుగా నున్నవి. లోకమున నెక్కుఁడయినను నన్ను బల్లహాత్మజునిఁగాఁదలంపఁడు. ఇపుడు నేను చేయఁదగినదేమి? ఓ! దైవమా! ఏమి చేయుదును?

దండపాణి నన్ను మోసములో దింపునని తలపోయుదునా! దాని కాధారము లేదు. నేను బల్లహాత్మజుఁడ నేయగు నెడల బల్లహునిఁ జంపినను జంపకున్నను నాకే రాజ్యము వచ్చితీరవలయును గదా! నేను బల్లహాత్మజుఁడ నేయగు నెడల రాజ్యము సంపాదించుకొనుటకు బల్లహుని నిర్జింపవలసినదని యేల బోధచేయును? కావున దండపాణిది

మోసము కాదు. ఇట్లని బల్లహుని ప్రేమయు మంజుమతీ దేవి వాత్సల్యమును కృత్రిమములని తలఁపఁజాలను. అది యటుండె. దండపాణి యింకను రాలేదేమి ?

[దండపాణి ప్రవేశించును]

దండ—[చూచి తనలో] నేను నా వేషము మార్చికొనిననాఁటనుండియు సీరదేవుఁడు బల్లహునిచేఁ జంపఁబడియె నని ప్రవాదము మాఱుమ్రోఁగిపోయినది. నేఁడీతని యాలోచనాయుక్తమగు మోముచూడఁగా 'నన్ను సీరదేవునిఁగా గని రైనా'? యని తోఁచుచున్నది. ఇస్సీ! భీరులు తమ నీడ తాము చూచుకొని పాఱుదురు అటులేల తలఁపవలయును? నా యొనర్చినబోధ యీతని నిటు లుడికింపనోపు. పలుకరించి చూతును. [అని మాటలాడ నుద్యమించును]

సూర్య—అయ్యా ! [అను నర్థోక్తి—

దండ—ఏమి చేయఁదలఁచితివి ?

సూర్య—అయ్యా ! నామనస్సు మల్లామడి యగుచున్నది. నా యెడ నింత ప్రేమ చూపించు బల్లహుని మడియింప నాకు సందియ మినుమడించుచున్నది.

దండ—వ్యర్థుల కిటులే కలుగును. నీవు యుద్ధభీతయగు సిరియాలదేవికి జనించితివి కావున నీమనస్సు పిఱికియైపోయినది.

సూర్య—[తనలో] శాంతించుట మంచిది. [పైకి] అయ్యా ! అట్లనకుఁడు. బల్లహుని ప్రేమకంటె మంజుమతీవాత్సల్యము నన్ను అవశునిఁ జేయుచున్నది.

ఆ. అమ్మ సిరియాలదేవి గన్నారఁ జూడ
నోఁచుకొననైతిఁగాక యందులకు వగవఁ
దల్లికంటెను బ్రేమగైన బల్లహుపతి
మంజుమతి యామె నిండుప్రేమకును వగతు.

దండ—అగును. మాయాకార్యములన్నియు నిటులే కదా యుండును.

సీ. తెలిత్రాఁచుఁబాము చూపుల నెల్లఁబులకింపఁ
జేయుఁ దద్విషము వంచించి చంపు
అగ్నిహోత్రుఁడు చూపు నాకర్షణ మొసర్చుఁ
జెంతఁగునఁ బట్ట భస్మీకరించు
మునిఁడిపండును జూడ మోదంబుఁ జేకూర్చుఁ
దినినచోఁ వాల్కునెంతేనిఁ బీఁకు
మున్నీరిఁ జూడంగ ముచ్చట యొనరించు
మునుఁగుచోఁ బాతాళమునకు నీడ్చు
అవధరింపంగ జగతి చోద్యంబు కాదె
సవతితల్లికి ప్రేమపాసంగకున్న
వైరిభూపాలమహిషికిఁ బ్రబలమైన
ప్రేమ యెటనుండివచ్చెరా? జేల! చెపుమ!

సూర్య—[గోపముతోఁ గత్తితడవి] సరియ. ఆమె వాత్సల్యమునకుఁ బ్రత్యుత్తరమా యిది?

దండ—నాకేమి? [ఆలోచించి] ఐననాకేమి? ఆమె పుత్రనిర్విశేషునిఁగా నిన్నుఁ జూచికొనుఁగాక. నీవు మాతృనిర్విశేషగా నామెను జూచికొందువుగాక! తుదకుఁ జక్కసి

సమన్వయము కుదిరించితివి. కానిమ్ము. ఇంక నీత్రిప్పాలు నీవుపడుము. నే నరిగెదను. [నిష్క్రమించును]

సూర్య—ఏమిచేయుదును? ఓ భగవానుండా! ఏమిచేయుమని యందువు? ఈ దండపాణికూడం దొలంగి పోవుచున్నాఁడు. నాగతి యేమి?

ఆ. ఏల సిరియాలదేవి గర్భాలవాల
మునను బడ్డది యీపిండము వితగాఁగ
సేద్య మొనరించుచుండు నే సేద్యగాని
యాలికడుపునఁబడ్డ సౌఖ్యంబునందు.

ఈయనను మఱలఁ దీసికొని వత్తును [అనినిష్క్రమించును]

[అపటీక్షేపముగా మాధవవర్మ ప్రవేశించును]

మాధ—బలే! ఇది సమయము. సమయముఇది.

శా. అంతర్వ్యాహినులౌచుఁ గోపపుఁబ్రవాహంబుల్ మనోగర్భసీ
మాంతఃప్రాంతములందుఁ బాఱినవి నేఁడత్యంతచింతాగ్ని దు
ర్దాంతంబై యెదుబికింపఁ బొంగి పలుమ్రోఁతల్ వెట్టుచున్ బాఱుచున్
గంతుల్ వై చెడి బల్లహా! యింకను వీఁకం గామకోఁగాఁదగున్.

[అని దూరదూరముగా నడుగులు పెట్టుచు నిష్క్రమించును].

[దండపాణి వీరదేవులు ప్రవేశింతురు]

దండ—నాకత్తిని బిఱికివాఁడవగు నీకిచ్చితిని. నాకత్తి నాకిచ్చివేయుము.

సూర్య—[ఆలోచించి] ఈయను.

దండ—ఇసీ భీరుఁడా!

చ. ఎలుకలఁ దొండలం గ్రిముల నెజ్జల నత్తల నూరఁబందులం
జిలుకలఁ గొంకనక్కలను జిమ్మటలన్ నలికండ్లపాములం
జలగల మీల జెల్లలను జంపెడువానికి వాఁడి వాదరన్
దలతలలాడు కత్తిఁ గయిఁ దాల్పఁగ నేటికి నీవు భీరుఁడా!
నాకత్తి నాకిచ్చివేయుము.

సూర్య—అబ్బా! మర్మముల భేదించితివి. నీవు బల్లహాత్మజుఁడవు అనినపుడును ఇంత వ్యథ కలుగలేదు. [కోపముతో] వినుము. అకారణంబుగ నీవు నన్ను మోసగింపవని నమ్మెదను.

శా. గుర్వాజ్ఞాపరిపాలనంబునకు నా కోదండ మెల్లప్పుడున్
దుర్వారంబయియుండు నందులను ముందుం దీక్షకాత్రేయ మం
తర్వాణీశుఁడ వీవ యిచ్చితి వికేంతం జూడుమా వీఁకునన్
బర్వ గ్రంథుల నన్ని కోయుదు నొగిన్ భ్రష్టానురాగుండనై.

[అని కత్తిఁ జేతికిఁ దెచ్చుకొనును]

దండ—ఏమీ! నీపరాక్రమము! నీకొకరి యాజ్ఞకూడ వలయునా?

ఆ. ఇంటికిం బిల్చి కల్లు విందిచ్చి తెచ్చి
పటకుటీరంబునందున బండఁబెట్టి
గూఢరీతిని గొంతును గోసినాఁడు
అట్టి బల్లహు వధియింప నాజ్ఞయేల?

ఇదియంతయు నెందులకు ? మీతల్లి వెడలిపోవుము నాత నిపైఁ బగఁదీర్చికొమ్మని యెవరిచేతినో వార్తనంపెనని నీకు నీవ తెలిపితివికదా ! ఇపుడది మఱవుము.

చ. గురువులయాన లేదనను కూలపుఁగోరికి కోరి నేను నీ
కరమునఁ గత్తిపెట్టితిని గాదది నీయది నాది నిమ్ముకా
ధరణిపుఁ బల్లహుం గెడపఁదగ్గది కాదు నిరంతరంబునుఁ
వరవుడముం బొనర్చికొని ప్రాణము ధారణసేయు మింపుమై.

సూర్య—అయ్యా ! కోపము చెందకుము. వినుము.

చ. గురువులయాన యున్న దనుకూలపుఁగోరికి కోరి నీవు నా
కరమునఁ గత్తిఁబెట్టితిఁకఁ గాదది నీయది నీది నీయ నా
ధరణిపుబల్లహుఁ గెడపఁదగ్గది; కాదు నిరంతరంబునుఁ
వరవుడముం బొనర్చికొని ప్రాణము ధారణచేయు టింపుమై.

దండ—చేయఁదగినదేదియో యాలోచించికొని నీయంతట నీవ యనుష్ఠింపుము. నాకత్తి నాకిమ్ము నేనేఁగెదను.

సూర్య—నాపయి దయనింపుము. నాకింక వారియెడ నన్నృత భావము పుట్టలేదు. పుట్టకపోవను లేదు. నిర్ధారణమొనర్ప లేకున్నాను.

దండ—తలిదండ్రుల నేర్పఱించుకొనలేనివానితో నేనిఁక మాటలాడఁ దలఁపను. ఇంతవఱకు బోధించితిని ఇఁక బోధింపను. నీవె నిర్ధారణ చేసికొని చేయఁదగినది చేయుము.

సూర్య—అయ్యా !

ఆ. కార్తెయందు విత్తి మూర్తీభవించిన
మొక కింతజలము పోసిపోసి
పెంచి పెద్దఁజేసి పెన్నువైచినతోన
విడిచిపోవువాఁడు వెడఁగుకాఁడె.

దండ—అయెన్ను పొల్లుగుచో విషవకెందులకు ?

సూర్య—ఎన్నటికిఁ బొల్లుకాదు. నిర్ధారింపుము.

దండ—భట్టారకుఁడేమాయెనో నీకుఁదెలియునా ?

సూర్య—కొండొకటకు మార్పఁబడియెనని మాత్రము వింటిని.

దండ—కొండొకటకనఁగాఁ గొండొకలోకమునకు. తెలిసినదా ?

సూర్య—అక్కటా ! వారివలన నా సంశయము వీడిపోవు ననుకొంటిని. ఔరా ! [దుఃఖముతో] వారి నాకుఁ జూపఁగలవా ?

దండ—నీ సంశయమంతయు నటఁ దీరిపోవును. రమ్ము.
[ఇరువురును గొంచెము పరిక్రమింతురు. ఒక తలుపుతీసి దండపాశి చనిపోయిన మాధవభట్టారకునిఁ జూపును.

సూర్య—[చూచి దుఃఖముతో]

ఉ. తండ్రి లేఁడు తల్లియును దా మరణించెనొ పాటిపోయెనో
తండ్రి తల్లి దేశికుఁడు దైవము సర్వము నీవటంచు నే
నుండితి నిన్ని నాళులును నోపికఁబట్టి, గతించితయ్య! నా
గుండెలుఁ వ్రీలిపోయెడిని గోమలమా హృదయంబు మాఁడెడిన్.

కట్టా ! బల్లహా ! ఎన్ని పాశము లొనర్చెదవు ? తుదికివచ్చినది. [ఉన్మాదముతో భట్టారకుని పాదములకు నమస్కరించి]

సీ. అల పార్థునిచేతఁ దనిఁ బ్రవ్వఁబడి విను
    అందు ద్రోణుఁడు చన్న లోకములకు
అల్ల శిఖండిచేనొల్లఁబోయిన ఖళ
    అందు భీష్ముఁడు చన్న లోకములకు
అల పరీక్షితునిచే నలసటఁగని సర
    ఘం డుదంకుఁడు చన్న లోకములకు
అల్లసాత్యకిచేత హ_స్తంబుకొడసి యా
    ల్గు భగదత్తుఁడు చన్న లోకములకు
శరణుఁజొచ్చినబోయకు జాయ యిచ్చి
నాత్మదేహార్పణముఁ గాంచి యాత్మ నగ్ని
లోనిడి పులుంగు చన్నట్టిలోకములకుఁ
దలిసియుండుము మాధవతాతపాద.

దండ—చూచితివా ! ఈగతియె బల్లహుని నమ్మువానికి.

సూర్య—ఔరా ! సత్యమెంతదిక్కుమాలినది ?

దండ—ఇటురమ్ము.

మాధ—[వికారముగాఁ బ్రవేశించుచు తనలో] ఎటుదారి ! ఎటుదారి ? నేను వత్తునని గ్రహించి వేఱొకటఁ బఱుండి నటులున్నాఁడు. పసిపట్టుదును. [అని యున్మాదముగా నిష్క్రమించును].

[ఇరువురుఁ గొంచెము పరిక్రమింతురు. దండపాణి తలుపు మూసి, తలుపుమీఁద వ్రాసిన యక్షరములఁ జూపును].

సూర్య.—[చూచి] ఏమియిది ?

దండ—పైనిఁ జదువుము.

సూర్య—[చూచుచు]

శా. "లోకుల్ కాకులు చేలుమాటలను వీలుంబాలునున్ లేక ప
ల్గాకుల్ కూసినఁగూసికొండ్రు వితగాఁ గంఠంబుగోస్త్రిఁగా
వాక్పుంబోవరించు యత్నములఁ గూర్పంబోవఁగా నేలాకో
మాకీబాలుఁడు సాక్షియై చనఁ బరామర్శింపుఁడా! యందఱున్.

ఉ. కాలముమాఱి యుద్ధమునఁ గాడ్పడిపోయిన సోమదేవభూ
పాలుని సంస్మరించుమను బట్టముఁగట్టెద సూర్యదేవభూ
పాలున కీనిఋంగునకుఁ బార్థివులెల్లరు కాన్కలీయఁగా
నేలఁగఁజేయుదున్ జలధి యెల్లఁగఁగల్గిన యెల్ల నేలయున్."

[అని చదివి] ఏమీ! ఇంత నేల యేలఁజేయువాఁడు భట్టారకు నేల పోరిమాల్పవలయును? ఔరా! నన్నుఁ దన కొడుకనియు సోమదేవభూపాలునికొడుకనియు నిరుఁదలగా వ్యవహరించుచున్నాఁడా? ఛీ! బల్లహా! నీవు చచ్చితివి!

దండ—లేదు. ఇంకను జీవించియేయున్నాఁడు.

సూర్య—ఛీ.

గీ. ఆవులంబోలె నపకారి మరయఁజాల
నట్టి పేర్మిని సోమదేవావనీశు
మాధవాచార్యుఁ జంపిన మానిసీఁడు
బ్రతికియున్నను వాఁడు జీవచ్ఛవంబు.

[కోపముతో] ఇంతియకాక యిఁక నీతఁడు బ్రదుకఁజాలఁడు. బ్రదుకఁడు. సాధువులకింత యపకారమొనర్చిన యీతఁడు సగము చచ్చియేయున్నాఁడు. నా కనులకు ఆతఁడొక శవముపోల్కి—కాదు; కాఁట సగముకాలిన—తలనుండి సగమువఱకు కాలినశవముపోలికి కానఁబడుచున్నాఁడు.

దండ—ఐనను జీవించియే యున్నాఁడు.

సూర్య—[కోపముతో మోముపైకెత్తి] ఇంకను జీవించి యున్నాఁడా ?

ఉ. ఈనిముసంబుదాఁక గడియించినవాఁ డెటులెట్లొ జీవమీ
పై నిముసంబునన్ నిజము పాసినవాఁ డిదె చూడుమీ! సమీ
చీన భుజంగమంబువలెఁ జిందులుద్రొక్కెడు నాదుకత్తిచే
లూనగళోద్గళద్రుధిరలోహితతల్పకలాకలాపుఁడై.

ఇదె సమాప్తము చేసివచ్చెదను. [పరిక్రమించుచు] ఎవరయినఁ జూతురేమోయని సంకోచము కలుగుచున్నది.

ఆ. తొంగితొంగిచనఁ గడంగు నక్షత్రాల
మోము మబ్బులార! మూయఁబొండు!
కన్నుకన్ను గొంచె కానంగఁబడకుండఁ
గటికచీఁకటులు! వేగఁ గదలిరండు.

దండ—ఓయీ! ఇటులు సంకోచించువాఁడవు నీవేమి చేయంగలవు? అయినను నీకట్టి ప్రతిభయము ఇసుమంతయు లేకుండుఁగాక. నేఁ డందఱు ఉద్దాలకపుష్పభంజిక యాడుకొని కొబ్బరికల్లులోనగు నాసవములు త్రావి మత్తుగొని నిదురించినారు. ఒకరు చూతురను భయము నీకు అక్కఱలేదు.

సీ. నీకత్తియాకని యాకారముం జూచి
భ్రమించి యాపోక మఱచుఁగాక
నీమాడ్కి యాతని మేఁ జూచి ఖేదించి
మగిడినంతనె యాదమఱచుఁగాక

నీబాహువాతని నెమ్మెడపట్టు ఛే
దించి దానిని విస్మరింపఁగాక
నీయెదయతని హృన్నీరేజముం ద్రెంచి
ధారణాబల మేట దాఁచుఁగాక
నీదు వెనుకత్తి వాదర నిఖిలలోక
పాలకుల జిగిఁజెందఁ జొప్పడునుగాక
అదియు బల్లహుదేహంబునఁ దొనర్చు
గాయమును జూడకుండెడుఁగాక యింక.

సూర్య—[కోపములో]

మ. ఎవరా వచ్చెడువారు నాకెదురుగా నేతెంచ వేగంబుగా
శివుఁడా! విష్ణువ! బ్రహ్మదేవుఁడ! యిసీసీ! వారలేలా? పుర
గ్భవుఁడా! బల్లహుఁడా! దురాత్మకుఁడ! ఘోరవ్రాత్యుఁడా! పాపుఁడా!
అధముండా! యిదె చచ్చినాఁడవుర! బాహాఖడ్గధారాహతిన్.

[అని వడిగా నిష్క్రమించును]

[తెరలో]

ఎవఁడో రాక్షసుఁడు! ఎవఁడో రాక్షసుఁడు!

దండ—[ఈవలికివచ్చి] ఆ! ప్రారంభమయినది! దురాత్ముఁడగు బల్లహుఁడు తానొనర్చిన దుష్కర్మముల ఫలిత మనుభవించును.

[తెరలో]

ఔరా! లేవరేమి? లేవరేమి? కాగడాలు తెండు.

దండ—ఈసరికిఁ జాలఁగార్యమయియుండును.

[తెరలో]

ఔరా! ఎధ.

చ. గళమున నొక్కవ్రేటు పరిగాఁ గుడిశొక్కను నొక్కవ్రేటు గ
క్కిలియెదు బొమ్మపైని నొక్కవ్రేటు పదంపడి మస్తకంబు భే
దిల నొక్కవ్రేటువైచి కడతేర్చెను బల్లహభూమిపాలు నీ
పాలకులదిండి యెవ్వఁడొకో పొంచుఁడి! పట్టుఁడి! నిగ్రహింపుఁడీ!

దండ—ప్రారంభము అంతము ఒకతూఱినే యయినవి.

[తెరలో]

గీ. కానుపింపక విసుమానమైన చంపు
చంపి పరువెత్తుచుండె రాక్షసుఁడువోలె
నోరి మీ రేమిచేయుచు నుంటిరోరి!
కాలుఁగొంటిరె కొబ్బరికల్లుత్రావి.

దండ—కాఁదగినపని జరిగినది. [తొంగిచూచి] ఈ పులితోలువాఁడెవఁడు? ఇదియేమి? ఈతఁడు ఎంతచక్కగానున్నాఁడు!

ఉ. సామునఁదేరి విర్వియయి సాగిలు మింటిమొగంపు మూఁపులున్
గామిడి వారిదెబ్బలకుఁ గాయలు కాచిన ముందుచేయియున్
మోమును జేరెడఁదయును బూర్ణలలాటము దీర్ఘబాహువుల్
శ్రీమహితుం డటంచివియెచెప్పక చెప్పను వీనిఁ జూచినన్.

[మాధవవర్మయు సూర్యదేవుఁడును బల్లహునిఁ బట్టికొని యీఁడ్దొండ లాగికొనుచు వడిగాఁ బ్రవేశింతురు]

మాధవవర్మ—ఓయీ!

చ. గళముననొక్కవ్రేటు సరిగాఁ గుడిడొక్కను నొక్కవ్రేటు గ
జ్జిలి యెదుఱొమ్మపైని నొకవ్రేటు పదంపడి మస్తకంబు భే
దిల నొకవ్రేటు వైచి కడతేర్చితి బల్లహభూమిపాలు నూ
జ్జిలు తల నేలపాలొనరించితి సర్వము నాదుపాలుగన్.

సూర్యదేవా ! ఇఁక నీవు మిగిలియున్నావు.

దండ—[తనలో] ఎవరితఁడు ? [అని మూలకొదుగును]

సూర్య—[బల్లహుని క్రిందఁ బాఱవైచి] ఇది యేమి ? నడుమ నీవెవడవు ?

ఉ. కంపమొకింత లేక వెనుకంబడిపోవక త్రోసివచ్చి యీ
చంపిన చంపు జాడి,
(నిర్దేశించుచు) యిట శత్రుకకాటులు నావి, నావి యీ
దుంపతెగుళ్ళవోలె నిటఁదోఁచుచునున్నవి తుళ్ళగింపు లో
డింపుము నన్ను నెట్టెదుట డీకొని యేరుజయింత్రో తేలెడిన్.

[అని మాధవవర్మపైకిఁ బోయి]

చ. గళముననొక్కవ్రేటు సరిగాఁగుడిడొక్కనునొక్కవ్రేటు గ
జ్జిలి యెదుఱొమ్మపైని నొకవ్రేటు పదంపడిమస్తకంబు భే
దిల నొకవ్రేటు వైచి కడతేర్చితి బల్లహభూమిపాలు నూ
జ్జిలు తల నేలపాలు పొనరించితి రాజ్యము నాదుపాలుగన్.

[అపటీక్షేపముగా మంజుమతి దుఃఖించుచుఁ జేత నొక గిన్నెఁగొని ప్రవేశించును]

మంజు—[సూర్యదేవుని డాయంజని] నాయనా ! నీకుఁ బాలే లేవోయి !

ఉ. పుట్టిననాఁటఁగోలె నొకపూఁటను బాలను నీయఁబోనినా
పొట్టఁబగిల్చి పాలొ మఱి పుక్కిఁట నెత్తురొ క్రోల కక్కటా !
యెట్టులు తండ్రినెత్తుటిని నేమరియుండెఁగ నీవు పీల్చితో
వట్టి యభాగ్యుఁడా! నను బట్టి వధింపుము తీరు నంతతోన్.

[అని కంఠము కౌఁగిలించికొని యేడ్చును. సూర్యదేవుఁ డధోముఖుఁ డగును.]

దండ—[తనలో] నే నిటనుండి తప్పించుకొనిపోయిన బాగుగానుండును. [పోవ ప్రయత్నించును]

మాధ—[దండపాణినిఁజూచి] ఓయీ ! నీవెవఁడవు ?

దండ—నేనా [అను సగ్ధోక్తి—

సూర్య—మాయమ్మ సిరియాలదేవి పంపినవాఁడు. ఆ ప్రశ్న నీకేల ?

మాధ—[విస్మితుఁడగును]

మంజు—నాయనా ! మీయమ్మ యీ యభాగ్యురాలేకాని యామెకాదు. నాయనా ! నన్నుఁగూడఁ జంపుము. చంపకముం దొక్కసారి కౌఁగిలించికొననిమ్ము. [అని కౌఁగిలిఁ గొనును] [దండపాణి తప్పించుకొనఁబోవును. మాధవవర్మ పోనీయకుండ బంధించును]

మంజు—నా కేకపుత్రుఁడవగు నీదరికి మీయయ్య రాజ్యకాంక్షచేతఁ దఱుచుగాఁ జేరనిచ్చి మాటాడనిచ్చినాఁడు కాఁడు. ఔరా !

ఉ. తొమ్మిదిమాసముల్ కడుపుతో నినుఁబెంచితి నంతెకాని బా
ల్యమ్మున నొక్కనాఁడొడిని లాలనఁజేసిన భాగ్యమేది? నా

యీసమ్మలికమ్ముఁ బాపికొన నూఅట యెట్టులు? కాఁగిలింతతో
నమ్మకుఁ జెల్లెరా ఋణము లార్పతి దీపము గర్భశత్రువా?

నీయందంతగా నీతప్పులేదు. అంతయు దండపాణివేషము
తోనున్న యీ సీరదేవుఁ డొనర్చినాఁడు. ఛీ! ఈ రాజ
ద్రోహి మోము చూడరాదు. నాయనా! ఇఁక నన్నుఁ
జంపుము. నీ వెటులు చంపఁగలవు? నీవె చచ్చితివి. అ
క్కటా! అమంగళము శాంతించుఁగాక. నేనె చచ్చెదను.
[అని గిన్నెలోని విసము త్రావి కూలును].

సూర్య—[విభ్రాంతిపడును]

మాధ—[తనలో] అక్కటా! ఎంత దయనీయముగానున్నది!

దండ—[తనలో] ఔరా! తుదకెటులుమాఱినదో? నాగతి
యేమి?

సూర్య—అనాత్మజ్ఞుఁడను. ఛీ, దండపాణిచే ననాత్మజ్ఞుఁడగాఁ
జేయఁబడితిని. తలిదండ్రులఁ జంపికొంటిని. [దండపాణికై
తిరిగి]

సీ. నాకుఁ దేజము నీరు నాకసంబును గాలి
మన్ను నీద్వైదింటి మయముగాఁగ
నెసఁగు నీతొడుగును సృజియించి ప్రత్యేక
మగునట్లు సుఖముల ననుభవింపఁ
దావలంబుగఁ జేయు తల్లిదండ్రులను జం
పించితివయ్యా, నీ వేత్రితకును
దగు నభాగ్యుఁడువీఁడె తనరారె సూర్యదే
వుండనాత్మజ్ఞతా పండితుండు

వచ్చు పాపంబు లవి రానెవచ్చు నింక
నిన్నుఁగూడనుజంపి యీనిముసమందు
దానివలనఁ బాపంబుఁగాఁదగినపాప
మనుభవింపఁగఁ దాల్చితిఁ బ్రాణములను.

ఇట్టివాఁడవు నీవాచార్యుఁడవా ? ఛీ.

శా. ఆచార్యుండవె నీవు పాతకివిగా నత్యంతపాపంబులన్
నాచేతం బొనరింపఁజేసితివి నన్గన్నట్టి మాతాపితల్
నాచేఁ జావనెచచ్చినార లిఁకనుండన్ గాదు క్షేమంబులో
నీచా! చావుము చావు చచ్చితివినూ నిర్యత్కృపాణంబుచేన్.

[అని నఱుకఁబోవును. మాధవవర్మ పట్టికొని]

మాధ— ఓయీ ! ఆఁగుము.

సూర్య—[విదిలించికొని] సీరదేవా !

చ. పితృవధపాతకంబున నుపేక్షవహించెద, నిప్డు మాతృకా
మృతికగు పాతకంబున నుపేక్షవహింపను సీరదేవుఁడా!
బ్రతుకఁదలంచి తేని యిటువంటి పనుల్ బొనరించువాఁడవే?
వెతకుము నారకంబునను విశ్రమసీమల నెప్పుడుండఁగన్.

[అని మీఁది కుఱుకును. మాధవవర్మ సీరదేవునివదలి సూర్యదేవుని చేయిపట్టుకొనును. సూర్యదేవుఁడు విదిల్చికొనును. మాధవవర్మ గట్టిగాఁ బట్టికొని]

మాధ— ఓయీ !

ఉ. లోకులఁబోలె నన్ను మదిలోఁ దలపోసెదవేమొ చూడు భ
ల్లూకపుఁబట్టువాఁడ యిదె లూనభుజుండవు కాఁదలంపు, మం
దూకము పట్టి రక్తమును నోఁ గ్రమంబుగఁ బీల్చుచుండు ద
ర్వీకరుభంగి నెత్తుటిని బీల్చును నాచెయి కత్తి వీఁడుమా!

[అని యెత్తును]

సూర్య—[బుజమునుండి నెత్తురు కాఱంగాఁ జూచికొని, తన లో] ఔరా! పలువురు మనుజులు వీనిలోఁ జేరి యొత్తుచున్నట్టులున్నది. అక్కటా! [బాధ నభినయించి] ఇఁక నిలువలేను. [అని కత్తినిఁ జార్చును]

[దండపాణి వేసముతోనున్న సీరదేవుఁడు పాఱిపోవును]

మాధ—ఓరీ! పాఱకుము. పాఱకుము. [మెడలోని చేతినిఁ జూపుచు]

శా. నేనెంతేని దయార్ద్రచిత్తమునఁ 'బోనీ' యంచుఁ బోనిచ్చినం
గానీ, యిల్లిదె పేరునీనికర శాఖాశల్యముం జూడు మి
య్యానన్ వచ్చితి నేను నీహ్యాదయుశల్యంబో యనం బొల్చు నీ
తానేరీతిని నిన్నుఁ బ్రాణములతోఁ దక్కించి పోనిచ్చురా?

ఇదె వచ్చితిని. నిలుము. సూర్యదేవా! తాళుకొనుము.

ఉ. పాలనుఁడైన బల్లహునిఁ బాపఁగఁగోరిన సోమదేవభూ
పాలుని యుగ్రశక్తి యిది పాపిని బల్లహు వానియాత్మజున్
ప్రాలఁగఁ జేయఁగాఁగ నడుమన్ గనుపట్టితి సీరదేవ! నీ
కూలుట పేరునీనికిని గొప్పముదం బొడగూర్చఁగావుతన్.

[అని పరువిడును]

సూర్య—ఔరా! ఈతఁడు సోమదేవభూపాలుని యౌరసపుత్రుఁడని తేలినది. ఈ చండాలుఁడు సీరదేవుఁడు మా తండ్రి బ-ల్ల-హునితో విఘటించి తన్మారణమునకు నన్నుఁ బురికొల్పినాఁడు. కట్టా! కానిమ్ము. ఆతఁడు కర్మఫలమును గుడిచి తీరవలసినదే. నే నీలోవుగా నా కత్తిని విషదిగ్ధము చేసెదను. [అని చేతి నెత్తఁబోయి] అబ్బా!

ఎంత భల్లూకపుఁ బట్టుపట్టినాఁడు! [అని సర్దుకొని] మా యమ్మ మొగ మెటులు చూతును? కట్టా! కానిమ్ము. ఇది దుఃఖింప సమయముకాదు. కాదా?

ఆ. ఒక్క మూలతండ్రి యొక్క మూలనుదల్లి
యొక్క మూల వీరి కెక్కుడయిన
దేశికోత్తముండు తెగిపడిపోయిరి
వల్లకాఁడు వట్టి వల్లకాఁడు.

అయినను నేను దుఃఖింపను. [మెల్లఁగాఁ బరిక్రమించి] విసపుగిన్నెయిది. [పట్టికొని చేయి కెత్తి]

శా. నీవే కత్తికిఁబూనికొమ్ము విసమా! నే ముట్టఁజాలన్ నినున్
జావుంగూర్చితి నాదుతల్లికిఁ గటా! చర్మావిహీనంబుగాఁ
ద్రావన్ నిన్నును నాదుకత్తియును వేసం దాఁజచ్చునో యేమొకో!
ప్రోవన్ జాడుమి యెట్టులేనియును నన్నుం బూర్ణ ప్రభావంబునన్.

[అని విసము కత్తి వాదర పైఁబోసి]

మ. ప్రళయాభీలతరాతివల్గిత మహావాతంబు ఖండించెదన్
దళదంభోభృదదభ్రగర్భకుహరీ దావాగ్ని మండించెదన్
గులధారాధరగండశైలపటలిం గోసెత్తఁగాఁ గోసెదన్
వలమానేంద్రకరాంగుళీతటనటద్వజ్రంబువారించెదన్.

[అని కొంచెము పరిక్రమించుచుండును. మాధవవర్మ సీర దేవుని కాయమును లాగికొనివచ్చి పడవైచును]

మాధ—

ఉ. విందునకంచుఁబిల్చి కడు వేడబముం బొనరించి పేరునీ
నిం దగు సోమదేవధరణీపతినిన్ వధియించినట్టి మీ

చందము లెల్ల లోకులకుఁ జాటెద నింక సముద్ర నందునై
యుందుఁడు 'ఘోరపాపపరిహారము ప్రేతములార వెల్వనన్.
ఔరా! మాధవభట్టారకునిఁ జంపిన మీకు నిష్కృతికూ
డఁ గలదా ?

సూర్య—ఓయీ!

శా. న్యాయాన్యాయము లేర్పఱింప నిను మంతన్ శక్తిలే కిందు న
న్యాయంబిట్టులఁ దండ్రికిన్ జననికిన్ గావించియున్నాఁడ దుర్
జ్ఞేయంబైన విధాన మీగతిఁ బొసంగన్, నీవో నేనో యిఁకన్
జేయంగావలె రాజ్య, మిర్వురకు రాజీ యిట్టులూహించితిన్.

మాధ—మంచిది. ఇది క్షాత్రధర్మము.

వ. మదురంబొాటిన వాఁడుఁ దీవలను నున్మూలించురీతిన్ దెసల్
చెదరన్ బల్లహసీరదేవుల నొగిన్ ఛేదించియున్నాఁడ జె
ట్టిదమైనట్టి ప్రతిజ్ఞఁ బూని యిఁకఁ జెట్టీవైనచో నిల్వు! నిన్
దురమిట్టిం చెదఁ జీల్చివై చెదను దోర్దండోఁ గ్రొచ్చిపాతించెదన్.

సూర్య—ఏమంటివి ? ఇదిగోఁ గనుము.

ఉ. దేవాపుఁడి త్తియందుఁ గడుదీవర పుణ్ సెకఁ గ్రాఁగి వీఁకమై
నోహారిసాహరించెనఁగి యుయ్యెలలూఁగెడు ప్రాణనీరముల్
బాహిరపోవఁ జిల్లి నొకపాటిది చేసెద నేఁడు నీకుఁ బు
ణ్యాహము దీనినుఁడిచను మావలిలోకమునన్ వసింపఁగన్.

[అని గ్రుచ్చును]

మాధ—[పోటును జేతితోఁ బట్టికొని] ఓరీ! ఇట్టి యన్యా
యము తగదు.

మ. విసముంబూసిన కత్తిఁ గ్రుచ్చెదవె? నీ విక్రాంతి పోకాలు! ని
స్సిసీ! తండ్రికిఁ దగ్గపుత్రుఁడవు నిన్నింకేల నిందింప? నీ

రసమూజంబులు మాచి మెచ్చికొన దర్పవ్యగ్రసన్నాహామిం
త సమాప్తింబొనరింతు నిన్నును గరాంతర్వర్తి ఘోరాసిచేన్.

[అని నెట్టికొని తెరలోపలికిఁ బోవును; శార్ఙ్గరవుఁడొక పెడనుండియు సుబ్రహ్మణ్యుఁడు మఱొకపెడనుండియుఁ బ్రవేశింతురు]

శార్ఙ్గ—అక్కటా! ఇదియేమి శ్మశానమా? మాధవవర్మ యేఁడి?

సుబ్ర—బలే బలే! కర్మఫలమున కిది సమన్వయము. [అని నాట్యముచేయును]

శార్ఙ్గ—ఈతనికిఁ బిచ్చి యెక్కుడైపోయినది.

సుబ్ర—నీకుపిచ్చి. నీఅబ్బకుపిచ్చి. నీఅమ్మకుపిచ్చి. నీమామకు పిచ్చి నేనుతప్ప జగత్తంథాపిచ్చి. మాధవవర్మా! సమన్వయము ఐపోయింది. రా! ఇహా రా!

[సూర్యదేవుని తలచేఁగొని మాధవవర్మ ప్రవేశించును]

సుబ్ర—[మాధవవర్మను వెఱ్ఱిగాఁ గాఁగిలిఁగొని నాట్యమొనరించును]

మాధ—[తనలో] ఇతనికి నిజముగా నున్మాదమా యేమి? [అని రోఁజుచుఁ గూలఁబడును]

శార్ఙ్గ—మాధవవర్మకు జయము!

మాధ—[రోఁజుచు] అయ్యా! సూర్యదేవుని మాయాఖడ్గముచే నా శరీరము విషజుష్టమయినది. ఇదిగో మా పేరుసీని హస్తము. ఈ రెండురాజ్యములకు ఈ హస్తమును సింహాసనమున నిలుపుఁడు. [అని కనులు మోడ్చును]

శార్ఙ్గ — అక్కటా ! ఎంతఅత్యాహితము !

సుబ్ర — ఛీఛీ ! వెధవశాస్త్రిల్లారా ! మాధవవర్మకూడా చావాలిసిందేనా ! మీ మూక తెగింది. వెన్నతుక్కుతోటాకుల్లారా ! తగలఁబడండి తగలఁబడండి.

మాధ — [కనువెత్తి లేచి] అయ్యో ! ఈ చేతిని నానోడనుండి తీయుము.

[శార్ఙ్గరవుండు తీయును]

మాధ — ఈచేతికిఁ బట్టాభిషేకము చేయుము.

తెరు. అమరలోకముమందర దెద్వారయుగళి
యాలవాలకవిడివడ్డ దదిగోఁ గనుండు
కౌమరార జనకుండు కులగురుణాడురుఁడు
కులధరాధరస్థైర్యగుఁడు పేరుగీఁడు
జములుగానిలుచుండి జలజాప్తసములు
పరవిరమ్మనినన్ను పడిఁబిల్చువారు
క్రమముగాఁ బరువెత్తికలయంగఁదలఁతుఁ
గయికిఁబట్టముగట్టఁగఁ జనుండుమీరు.

[అని పడిపోవును]

శార్ఙ్గ — ఔరా ! తుదికీలాగునఁ గావలసియున్నది కాఁబోలు! ఈ హస్తమునకు అభిషేకము చేయఁబోవుదము.

సుబ్ర — [తాటాకులకు నిప్పంటించి] ఉఫ్ ! ఉఫ్ ! తగలఁబడండి !

[నిష్క్రమింతురు].

శతావధాని శివరామకవి ప్రణీతంబయిన మాధవవర్మ యను నాటకము సర్వము సమాప్తము.

---

బెజవాడ వాణీముద్రాక్షరశాలయందు బి. కే. స్వామిచే ముద్రితము. 1920

శ్రీ

# కృతకసూత్రము.



క. తనవచ్చిరానిమాటల
కు నుపాధ్యాయుండు మెచ్చికొనఁ జూచెడివా
రును వ్రేలఁ జూపి ముదముం
బనుపడఁగఁ గుఱంగియ నెడు బాలికయలపున్.

సీ. తనతోడి పాటుగ 'నోనమాల' తెలివొందఁజాలి, 'అఆల' ది
ను, 'కాఖాల' గడింపఁగా మఱియు, 'తాథాల్ యారంభాలన్న పా
ల' ను నేర్వన్ జెలికారముం బెనుపఁజాలం జాలు సిపిల్లవాఁ
డనఁగాఁ బోల్చు శరత్కుమారుఁ డనువాఁడా బాలతో నాడుచున్

ఆ. ఈ సెఱుంగదు దుఃఖమ్ము నెఱుఁగఁబోదు
పాపమెఱుఁగదు తెలియదు ప్రాకృతంబు
పెరిమె చెలికారములమాత్రఁ బెనిచికొనును
ఎంచఁగా బాల్య మదియెంత మంచిదోకొ.

ఆ. వాలుకాపులినమ్ముల వాగులందు
పొన్నమ్రాఁకుల నునుపారు తిన్నెలందు
బండిగురివెందతీవెల పాదులందు
ఆడుకొందురు మలుసంజలందువారు.

క. ఎడఁబాయని ప్రేముడిచే
నడుగడుగున కుబుసుపోక, అట్టే చెవిలో
గుసుగుసలాడుదురు ముదం
బడుదురు వారిద్దఱార బాల్యంబందున్.

క. బడియాడఁ సడలిపోయెన్
బుడిబుడి చెలికాండ్రతోడి బుజ్జగముడిగెన్
వడిఁ బెండ్లినయసు వచ్చెన్
నడయాడం దొడఁగె జవ్వనము చెలిమేనన్.

మ. ఒకనాఁడించుకభూషితాంగియయిసూర్యుండస్తముం బొందఁగ
వ్వికచాంభోరుహనేత్రయం దెలగొదల్ విశ్రాంతిఁ జెందంగ దే
లికగాఁ బాదములుంచుచున్ జనియెఁ దాలీలానికుంజంబుచెం
తకమందానిలమూఁచిపుల్చినపువ్వుల్ తాఁపుల్ దెసల్ గ్రమ్మఁగన్

గీ. పోయికూర్చుండునంతటఁ బోరువెట్టి
కూయఁదొడఁగెడు పెనుగండుఁ గోయిలలకు
రోసమీసును గెడఁగొని మోసులెత్త
నొసఁగ లేదు కురంగి ప్రత్యుత్తరంబు.

ఉ. నించినపూలయందు శయనించికపోలతలంబు నంటఁగా
వంచి కరాంబుజం బెడమవైపుగ నెత్తిలి కాలివ్రేలి నా
డించుచు నూర్పుగాలి ఖురుడింపఁగ మోవియు వాడిపోవఁ జిం
తాంచితమూర్తియై యాచుజవరాలసియుండెను శూన్యభావయై

చ. తలఁపునఁబట్టనంత పరితాపము, కన్నులుచాలనంత పె
ద్దలు కనునీటిబొట్లు మదిఁ దాపఁగఁజాలనియంతయాసు కొం
దలమును నాపెమోము నెడుదర్పణమందుఁ బృథక్ పృథక్ స్థితిన్
గళలధరించి రూపములుగాఁ గనఁబట్టఁదొడంగె వింతగన్.

గీ. ప్రక్కఁగాఁబోవుచుండె శరత్కుమారు
డప్పు డత్యరుణాంబుజాతాయతాక్షి
గువ్వకుత్తుకతోడను గొణుఁగుకొనుచు
వడిగ లేచెను పాదముల్ వడఁకుచుండ.

ఉ. చూచుచు శరత్కుమారునకుఁ జోద్యముగాఁ గనఁబట్టె నాకురం
గీచకితైణలోచన వికీర్ణమునౌకబరీభరంబుతో
సూచితకోపరోష పరిశోషకషాయితమైన మోముతో
నాచిత బాష్పబిందువుల నంతట నానినకన్నుదోయితోన్.

క. ఒకపాదునందుఁ బెరిఁగిన
యకళంకపుఁదీఁగ మోక లగుటనతం డా
సకియుఁ గనుంగొనినంతట
వికలుండై మొగమొకింత వెనుకకుఁ ద్రిప్పెన్.

ఉ. ఆఁగుచునాతఁ డాపెహృదయంబున నేమికళంకమున్నదో
నేఁ గనుగొందునంచుఁ దరుణీమణి డగ్గఱి పల్కరింపఁగా
మూఁగదివోలె నప్పుడొకముచ్చటయాడదు తేఱిచూడదున్
దీఁగవలెం జలించుఁ బరిదేవనముం బొనరించు మించుగన్.

ఆ. ఆమెకంటెనుమిగుల నత్యార్ద్రచిత్తుఁ
డగుటఁ జూడంగ లేక మాఱ్మొగము వెట్టి
యెఱుఁగమిన్ వెక్కి వెక్కి తానేడ్చెనపుడు
ప్రకృతికింగూడ గుండెలు పగులువాఱ.

ఆ. తుదకు నామెయె మనమును గుదుటఁబఱిచి
కాఱుకన్నీరు కొనగోటఁ గడకుఁజిమ్మి
ఊర్పు నిట్టూర్పులను సరి నొందఁజేసి
అల్లనల్లన 'నేమోయి' యంచుఁబలికె.

ఆ. అటులు పలికెడు చెలికార మాత్మఁదలఁచి
అందు 'నేమోయి' యనియెడు నందమెంచి
గండుమీఱి శరత్కుమారుండు చూచె
సారశారదచంద్రికా సారదృష్టి.

గీ. "వెన్నెలబయళ్ళకొంటిగా వెడలనగునె?
బొంగుపొదరిండ్లయందు నుండంగఁదగునె?
మహిళకలటంచును శరత్కుమారుఁడనినఁ
దలనువంచికురంగి శాంతంబుపొంది.

గీ. వచ్చిరానట్టిమాటల వరుసతోడ
తెలిసి తెలియని ప్రేమ శృంఖలలతోడ
మఱచిమఱువనియనుభావ మహిమతోడ
మరగు శైశవమది యెంత మంచిదోయి!

క. నావుడు నెమ్మనమునఁ ద
ద్భావము ప్రేమానుబంధ పరమా యెనటం
చావిజ్ఞుఁడు తెలిసికొనెన్
బోవంగాఁదలఁచెవీఁడి పొలతుకనంతన్.

ఉ. కానిస్వకీయమైన చెలికారము చిన్నతనంబునుండి, యా
మానిని చేసియుంట నొకమాదరిగాఁగను జిన్నఁబుచ్చి యె
ట్లేనిఁ జనంగ లేక యతఁడించుకమాఱు మొగంబు వెట్టి వే
ఱైనప్రసంగమా మెహృదయంబునబొన్పఁగ నెంచియిట్లనెన్.

గీ. ధరణికోటపురీవరాంతరమునందు
స్థాపితంబగు పెను పరిషత్తునందు
విద్య నభ్యసన మొనర్ప నెడలువాఁడ
నీదుతండ్రియె ప్రేరేచె నిన్ను నన్ను.

గీ. అనుచుఁబల్కిన నిస్పృహ యగుచునంత
బిక్కమొగమును వైచి విభీతనయన
తలనుబంకించి నిట్టూర్చి దళితహృదయ
యగుచుఁబొడకట్ట నతని కయ్యవసరమున.

మ. ఁనెలఁతా! యీడునఁ జోడు వారమయి యున్నన్ నీకంటెఁబుం ధర్మతా
కలనన్ గొంచెము పెచ్చు నాకనుభవగ్రంథంబు, మీయింటి పె
ద్దలు చూపించిన త్రోవ నెక్కురు నివిద్యావాసనావాసితున్
బాలుపారన్ వరియింపుమంచు నతఁడప్పా బోఁడితోఁ బల్కినన్

గీ. పులుకుపులుకునఁ జూచు చూపుంగములను
బోఁడితనమును వైరాగ్యమును విశేష
నిస్పృహాత్వంబుతోఁప నా నీరజాక్షి
మొగముఁదన రెండుచేతుల మూసికొనియె.

గీ. తఱుఁగుకొనిపోయెహృదయ మాతనికిమిగుల
నప్పుడాజాణ నిముసమే నాఁగలేక
చిన్నతనమునుండియుఁ జేసినట్టి
కడిఁది చెలిమికిఁ దగినట్లు కౌఁగిలించె.

ఉ. చేరలకెక్కుడౌకనులఁ జేరిన వెచ్చని నీరెడల్చి చె
న్నారెడు కేశపాశమున యందుఁ దగుల్కొని చిక్కువడ్డ మం
దారపు లేఁతపూఁతను నిదానముగాఁ దెమలించి పొన్నపూఁ
గోరల నోసరించి సుమకోమలికిన్ ముదమారఁ గూర్చుచున్.

ఉ. పూలను గొన్ని ద్రుంచి తృణముల్ మఱికొన్నిటి గోసి వానినిన్
మాలికగా నమర్చుకొని మంగళసూత్రముఁ బోలినట్టి పూ
మాల కురంగి నెమ్మెడను మల్చితగిల్చెఁ జెలంగ సౌరభో
ద్వేలసమాగతాళిరుతి దీపితమంగళవాద్య ఘోషముల్

క. సంతోషభరస్వాంతులు
నంతేవాసులు నటాక్కయాచార్యునకున్
గాంతస్వరూపులగువా
రంతట వేర్వేఱు బాట నరిగిరి పెలుచన్.

ఉ. ఆమఱునాఁటిపొద్దున రయంబున వెల్వడి బ్రహ్మచర్యదీ
క్షామహితంపు వేసమునఁ గానఁగఁ బట్టెను, భాగవిత్తి వి
ద్యామహిళాధినాథునకు నచ్చెరుపాటు ఘటించి తన్నునున్
జేరిముడిశిష్యమండలిఁ బరిగ్రహణం బొనరింపనింపుగన్.

క. గురుపాదసేవఁ బట్టుచు
నురుతరవిద్యామహామహోదధినీఁదన్
బుర్కొనె శిరత్కుమారుఁడు
పరులకుఁ జూప్పడని భయము భక్తియునిండన్.

ఉ. దోసము లేని వేసము శ్రుతుల్ పచరించె సురీతిసీతి ద
ర్శాసనమే యలంకృతిగ సల్లిన నొజ్జ యుపన్యసింప వి
శ్వాసముగల్గి పచ్చికలపట్టున నిక్కమొనర్చి బూదె కై
సేసి పఠించు నెల్లపుడు శిష్యులలోపల శీఘ్రబుద్ధియై.

ఉ. సారము చాలఁ దేర్చి జగజంపనుమాట యెఱుంగఁ బోక వి
ద్యారసపారవశ్యుఁడయి తాల్మివహించుచు శిష్యకోటిపై
గారముకల్గి కూర్మిసుతుకన్న ననుగ్రహమూని దుష్టకృ
త్యారభటింగలంచినయమారఁగఁ జెప్పెను, భాగవిత్తియున్

ఉ. జీతము బత్తెమాటలకుఁ జేష్టలకున్ రుసు మొట్టుముత్తులున్
గైతవమైనడంబముల కల్పన గూర్చు గురుప్రసక్తిపై
పూఁతలు మేఁతలున్ పొసగు పోడిమికూడనికృత్యముల్ సమా
నీతము కావొకప్పునను నిర్మలమైన తదాశ్రమస్థలిన్.

చ. ఎనయుగుబల్ల లేదు, కొఱయేయది? పచ్చికపట్టులుండఁ; బిం
పెనసెడు మెస్తు లేదు, కొదయేయది? నారలచీరలుండఁ; బొం
తనమగు కుర్చి లేదు, కొఱఁతాయది? దర్భకటంబులుండఁ; దం
ధనములు కైతవంబులివి తగ్గునకాదె నిసర్గసృష్టికిన్

ఉ. ప్రాణముఁబోయినన్ గురుని పల్కునకున్ జవదాఁటరాద తా
మానముఁబోయినన్ మృషను మందునకైనను బల్కరాద వి
జ్ఞానముమాసిపోయినను గట్టడికిందొలఁగంగరాద ప్రా
మాణికమేదుపల్కరుదుమమ్మరె! యాతనియాశ్రమంబునన్.

సీ. సాహిత్యసాహిత్య సందర్భముఁ గ్రహించె
న్యాయవేదాంతంబు లభ్యసించె
వైయాకరణ సమన్వయ సంప్రదాయంబు
లెఱిఁగె సాంఖ్యంబున నెఱుకఁ జెందె
యోగశాస్త్రమునందు యోగ్యతనుగమించె
గాణాదమం దధికారమొనసెఁ
గవితావిలాసినీ కాముకుండయిమించె
ధర్మశాస్త్రముల సందర్భమెఱిఁగెఁ

తే. బెండిలిం జేసికొన భార్గవి త్రికడను
దానను జ్ఞాతుఁడై సముదారగతిఁ గు
రంగిఁజూడంగఁ గుతుకతరంగితుఁడయి
వెడలెనుశరత్కుమారుండు విన్ననువుగ.

ఉ. తల్లినిగాంచుటొండెఁ దనతండ్రినిఁజూచుటయొండెఁదమ్ములన్
బిల్లలఁజూచుటొండె మఱివృద్ధులఁజూచుటయొండె లేకయా
హల్లకపాణిపై నయిదుప్రాణములుంచి తదేకదృష్టిచే
నల్లయతండుమార్గమున నాతురుఁడై చనుఁబేర్మిబర్వగన్.

శా. మధ్యేమార్గమువచ్చె నెత్తిపయికిన్ మార్తాండబింబంబటఁగా
మధ్యాహ్నంబునడగ్గఱం గొలుచుగ్రామంబందుదానాగియా
రాధ్యంబైతగుదేవతాసమితినారాధించి వేదంబునన్
నిధ్యానంబుననుండి కొంతవడికిన్ జేరెన్ గృహంబొక్కఁడున్

గీ. అందునివసించువారల కతిథియగుచు
నారగించెను శుభ్రింపు టన్నరసము
ప్రకృతిగాఁబండు పండులు పాలులోను
నైనయాహారములను మధ్యాహ్నవేళ.

క. అలుపముగఁ బాడుకొనియతఁ
డలవారలకడనుసెలవు నందిజిగమిషా
కలితుఁడయి బయలుదేరెన్
లలనాసందర్శనాభి లషితుండగుచున్.

గీ. తానుబట్టినమార్గమా ధరణిదేవు
దీసికొనిపోయెనొక్క- కృత్రిమవనంపుఁ
బజ్జకెటులఁగ కయెక్కిన పడవ సాగి
పాలమున్నీటినడుమకుఁ బట్టినటులు.

గీ. జీడిమామిడిచెట్లుకం చెలనుదాఁటి
లోనికింబోవదారిఁదెల్పు చునునుండెఁ
గొన్ని చోటులనట్టికో ర్కులకుఁదావు
కొలుపకెంతయుగొడ్డంటఁగొట్టఁబడియె.

క. చనియెడు శరత్కుమారుఁడు
తనముందటఁగాంచె నొక్కతరుణీమణిఁ జ
క్కనిపండు తలఁపివెన్నెల
యనసౌందర్యంబు వెల్లియై పాఁటగన్.

సీ. చెమరుఁజిత్తడిచేతఁ జెలువారుమోముపై
ముంగురులొకవింత మురువుసూప
గొనవ్రేళ్లపై లేచి చనుటచేఁ బొడవగు
పొడవుందనంబున బెడఁగెలర్పఁ

గదలుబింకంపు టంగకములు చూచువా
రలకెల్ల నేత్రపారణమొనర్పఁ
గాటుకదీర్చిన క్రాల్గన్నుదోయి వి
చ్చిన నల్లఁదమ్మిపూ తీరుతోఁప
గీ. నొడసిపట్టిన కుచ్చెల లుజ్వలింప
మృదులకురువిందమాలికల్ కదలియాడ
నెత్తి యరకాలుసూచుచుఁ దత్తరిలుచుఁ
గంచెనుందాఁటి వచ్చుట కాననాయె.
క. ఇదినఱకెపుడో చూచిన
యదియనుభావంబు తలఁపునందుఁ దలిర్పన్
మృదితమృణాళీశోభా
స్పదయగు నలదానిఁ గాంచె సందేహముతోన్.
గీ. పొంచిపరికింప దానిచూపుననుబడక
యుండఁ దనసందియంబును నోసరిల్ల
ద్రాక్షపందిలిక్రిందికిఁ దారె నతఁడు;
అతఁడుకనకుండదాఁగె నయ్యతివమిన్న.
గీ. కానలేకుంటనతఁడు తత్కాంచనాంగి
తొల్లివ్రాసినలేఖను నల్లనల్లఁ
దాళపత్త్రాలఁబొల్పు గ్రంథంబునుండి
తెఱచెఁ గొంచెముమూసి పెంపఱినదాని.
క. ఎవరును లేకుండఁగఁ దా
నవలోకించుచు దిశాంతరాంతరముల ని
క్కువపుంబ్రేముడిఁ జదువఁగ
నవునని యిటుసదివె నేలనాసీనుండై.

« గురుజనానురోధమా? నాబుద్ధిని బరీక్షించుటయా? గృహనివాసమునలదను ఎత్తిపొడుపా? ప్రేమవిచ్ఛేదాభిలాషమా భక్తజనపరిత్యాగోపాయమా? ప్రకోపమా? లేకయివన్నియు నా? సఖుఁడా నీపయనమునకు అర్థము నెఱుంగనయ్యెద.

అతిప్రియుఁడవందునా! పౌనరుక్త్యము; నీకు నేను ప్రియానన్నచో జడప్రశ్నము; నీయెడ నాకు వలపుచాలఁగలదనిన వేశ్యాలాపము; నీవులేనిది బ్రతుకఁ జాలననిన, అనుభవవిరోధము; నన్నుఁ బూవిలుకాఁడు పరిభవించుచున్నాఁడనినచో, ఆత్మదోషోపాలంభము; మన్మథుఁడు నన్ను నీకిచ్చెనన్న ఉపసర్పణోపాయము; నాచేఁదప్పక వరింపఁబడితివనిన బంధకీధార్ష్ట్యము; తప్పకరమ్మనిన సౌభాగ్యగర్వము; నేనేవచ్చెదననిన స్త్రీచాపలము; ఇదియనన్యయనినఁ గొదవ; నీవు కైకొనవే మోయసిన లేవనివానిని లేపుట; చావుచే నావలపు నెఱుంగుదువనిన నమంగళంబు: కావున నీకేమివ్రాయుదు?

* * * * * * కురంగి.

గీ. అనుచునాపిక మిక్కిలి యనుగమించి
వర్ణవిన్యాసములను బ్రభ్రష్టపత్రి
భాగములఁగూడఁ బూరించి భావభరిత
మైన యాలేఖసదివెఁ బేరాసతోడ.

క. చదువుచు మఱలం జదువున్
జదివి తదీయాంతరార్థ సందర్భము నె
మ్మది విస్తరించికొను మో
హదశా దందహ్యమానుఁడయి కడుఁబొగులున్.

గీ. సర్వవర్ణస్ఖలిత సముచ్చారణంబు
గాఢగాద్గద్య సంరుద్ధ కంఠనాద
మూర్జితాశావ శానుకంపోదయంబు
తత్స్వనంబు వినంబడెఁ దగులఁదరుల.

గీ. అప్పురప్పుర! కాలపు వ్విపర్యాసమహిమ
బాల్యకౌమారములకు యౌవనమునకును
భావభేదప్రకార సంభరితలీల
వాస్తవంబుగ నెవనికవాచ్యమకట!

గీ. తలఁపునకువచ్చు సంకల్పితంబులైన
చేష్టలెల్లప్డు వానిలోఁ జిక్కుకొనిన
మనము బాహ్యేంద్రియ నిరుద్ధము నపార
మైనయానందమందు లయంబుఁజెందు.

గీ. బాఁగుగాఁ బఠియించిన పాఠములను
నేని నీ కవిరాకున్న నేనుగూడ
రానివానివిధాన కురంగనేత్రి!
చెలఁగితిని, ఒజ్జ శిక్షచేసినను గాని.

గీ. సహజసర్వావయవ సువిస్తారలక్ష్మి
కనులఁగట్టినయట్టులఁ గానఁబడుట
నెత్తికట్టిన జెప్పుల నెల్లరేలఁ
గాచుకొనియుంటిఁ జదువున కన్నశ్రద్ధ.

గీ. కలలనైననునీరూపుఁ గాంచవచ్చు
నంచు నిదిరింపఁబో, సహాధ్యాయులెల్ల
చేయుచింతనయలికిడి చేతలేచి
తెప్పిటిలి నన్ను నేనె నిందించుకొందు.

చ. కనులకు నిద్ర రాక సరిగా నొక పాత్రము పట్టి దేనినై
నను జదువంగఁ బోవఁగ మనంబున నీదగు రూప మేర్పడన్
మననము చేయుచుంట నొక మాదిరిగాఁ బుటలన్ని విప్పి కో
లునుగడు నేర్చిహస్తములు లోలనఖారుణితోజ్జ్వలాంగుళుల్

గీ. కేల మిగిలిన నాలవ జాలులందు
మూసి తెఱచిన కన్ను దమ్ములు చలింపఁ
జాన! యేఁగెదె చటి'కంచ సత్యకంఠ
నాళవిన్యస్త బాహు బాధనుఁడనగుదు.

ఆ. „తెల్లవాఱె మోము నుల్లంబు కృశియించె
నందమైన దేహ యస్థిడస్సె
నెట్లు చదువుచుంటి వేమోయి" యనినన్ను
సరసమాడు చంద్రుఁడు సంగడీంద్రుఁడు.

గీ. సయుముగా వచ్చు నా యనధ్యయనదినము
లందుఁ గనరాక యుంసహాధ్యాయులకును
గొండ వాగుల కడ కేఁగి కూర్తు నీదు
చేష్టలనుగూర్చి కవితావిశేషములను.

గీ. చేసిన సమస్తచేష్టలఁ జెప్పుచుండు
నాడు నాటలనుం దెలిఁగుంగఁ జేయు
నాడు పలుకుల నెల్లరా పాడుచుండు
శైశవగ్రంథి కఠిన పాషాణసంధి.

మ. చెలియా! శైశవబాల్యభావములు చేసెన్నీకునున్ నాకు న
చ్ఛలమా స్నేహదశానుబంధమును సాక్షాద్భావనంబిప్డుని
ర్మలమా ప్రేమను దానఁగూర్చి స్థిరసంబంధంబుఁ గల్పించునో
బలవద్దైవ నియోగదార్ఢ్యమున వేర్పాటుం బడం జేయునో!

క. కుపితా! వియోగ దుఃఖ
గ్లపితుఁడనై జీవ మూడ్వఁగా నెంచను నా
స పడుచు 'జీవన్ భద్రా
ణి పశ్యతి' యనంగ నొప్పు నీతి యెఱుక చేన్.

ఆ. ఆకురాలు కాలమందున పడెడు కా
రాకులనఁగ నాసయట్లెపడును!
తఱినిగట్టిపడెడు తరువుల చేవనాఁ
బెఱిఁగి పెఱిఁగి చాల బెనిచికొనును!

గీ. మొదలనద్దాననాకుఁ బ్రేముడియె లేద
యొండమావిని నాపె యొక్కింతనాఁట
నాట ననలెత్తె; ఔను. కొండదఱకు పేర్మి
తమ్ములనెడారినైన స్ఫుటమ్మొనర్చు

ఉ. వీనులవిందుగాఁగను సవిస్తరమాత్మ దశానుభావ సం
ధానముగాఁగఁ జెల్మికి నిదానముగాఁగ లతాకుటీరసం
తానన దత్ప్రతిధ్వని విధానముగాఁగ శరత్కుమార దీ
నానన సీమ నిర్గళితమైన వియోగపు సూక్తులాఁగినన్.

మ. అవలగ్నంబసియాడ మోముదరహాసాంకూరమైపొల్వఁగ
న్నవ లజ్జాపిహితాతిసాధ్వసమునై కాన్పింప ధమ్మిల్ల మా
యవటూదేశమునందుఁ బ్రోవుపడ దివ్యంబైన రూపంబుతో
నవలామానిక మేగుదెంచెను కవోష్ణంబైన నిట్టూర్పుతోన్.

గీ. వచ్చియును రాకముందె యౌవనరుహాక్షి
మఱచినాఁడవె? నన్నునో మానధనుఁడ!
యంచుఁజిఱ్ఱముగాఁ బ్రశంసించెనపుడు
నగవు మోమున మేలిరత్నాలురాల.

శా. ఆనారీమణిపల్కుపల్కులు శ్రవోవ్యాసక్తినాఁబొంది బ్రి
హ్మానందంబుసుఖంబుకంటె నితమామానందసాంద్రోదయ
శ్రీనిర్వాణవిధాచమత్కలితుఁడై శీర్యజ్జగజ్జ్ఞాన సం
ఖ్యానుండాయెశరత్కుమారుఁడదివో! గాఢానురాగంబనన్

మ. పయిపైఁబర్వెడు సిబ్బితిన్ విడిచి యాప్రాజ్ఞుండిటుల్ వల్కెనీ
పయిఁబ్రేమంబుననిన్ని నాళ్ళమగువా! ప్రాణంబులన్ జిక్కఁబ
ట్టియెటో కాయముమోవఁగాఁగలిగియుంటిన్ నేఁటికిందావకా
భయహస్తంబునుబొందఁగల్గుటకు నాభాగ్యంబుసాయంపడెన్

క. అనవుఁడు గురంగి తన పెద
విని గట్టిచికొనెన్ విరుద్ధవిస్మితచేష్టన్
కనఁబడియెమోమునందున
ననుమానము తేరికొనియె నంతస్సనమున్.

క. తదనంతరమున నాతఁడు
పదిలమె నాకట్టినట్టిబల్బజపుష్పా
స్పదమగు మంగళసూత్రం ?
బదిమఱచితె? యనియెఁబ్రేమ మన్నినమదిఁదోఁన్.

మ. అనినన్ సంకుచవోష్ఠి క్రొమ్మెడయెడన్ హస్తాంగుళుల్ సేర్చియా
వనజాతాయతనేత్ర సాధ్వస భరభ్రాంతాత్మయై పైట చెం
గునొకింతన్ దెమలించితీసెమిగులన్ గ్రొవ్వాఁడుపూమాలయం
దనుసంధించినతాళిబొట్టును మహీయఃకాన్తికాన్పింపఁగాన్

క. అప్పుడు శరత్కుమారుని
ముప్పిరిగాఁబెట్టఁగినట్టి మోహపుఁబాశం
బొప్పరికించుచుఁ బిదిలెక
దప్పకదా! తనదటంచుఁ దత్క్షణమాత్రన్.

ఉ. మంగళసూత్రదర్శనమిమంక్షిత మృత్యుసముద్రుఁడైయతిం
డంగనమీఁదఁ బ్రేమవిడనాఁడఁగలేక తదీయసుందరా
పాంగవినర్దళద్ధృదయపంకజుఁడై ధృతిదూలియున్ వితా
కుంగడుబాంధేందా మొదలుగొట్టిన చెట్టునుబోలె వ్రేల్మిడిన్.

క. ఎక్కడనుంటివి? కురంగీ!
యెక్కడనెక్కడ? నటంచు నింపొలసెడు మేల్
వాక్కులతోఁ గొందఱు చెలు
లక్కడ కేతెంచి రొయ్య నాసమయమునన్

గీ. ఆస్వరంబది వినఁ బడునంతమాత్ర
వెడలిపోయెఁగురంగి సోద్వేగయగుచుఁ
గడఁగి వీతెంచుచున్న పెన్గాలిదెబ్బ
కోసరిలి పాఱునొక చిన్న యోడ వోలె.

గీ. పోవు వెంటనె యాతఁడా పుష్పుఁబోఁడి
సంకువుంబోని మెడయందె సంగుచున్న
తానుగట్టిన కృతకసూత్రంబు తోడ
వఱలు నాతాళిబొట్టుఁపైఁ బఱపిమనసు.

ఉ. ,,వంచన చేసె నన్నుతివ వాంఛ రు దెల్పియు నాదుజీవితం
బెంచఁగవ్యర్థ మెవ్వనినొ యింపుగఁబెండిలియాడినట్టి యా
చంచలనేత్రపై వలపుసల్పుటయుంగడుఁ బాతకంబ యూ''
నంచుశరత్తుమూరుఁడురయంబున మోము నొకింత యెత్తినన్.

గీ. తనను గోరిన ప్రాగ్దిశాంగన కడంకఁ
జందురుం గోరుటది మదియందెఱింగి
పశ్చిమాంభోధిలోఁబడి ప్రాణమూడ్చు
వాఁడు వలెఁగానఁగాఁబడె వేఁడివేల్పు

గీ. వెంటనే లేచి యతఁడు వెన్వెంటనున్న
దీర్ఘికాసీర మందున దిగియు మెల్ల
వార్చి తొడిడి డిల్లవడిన హృత్పద్మ మందు
నెక్కొనిన చింతశోకాగ్నిఁ గాంచె నొక్కమత్తి.

శా. చూడా పాశములూఁగులాడఁగఁగఁ దుఃక్షోభించుభూతంబనా
నూడల్ పెక్కుపృథక్ పృథక్స్థితినిసంయుక్తస్థితింగూడవే
లాడన్ నిచ్చలు గొల్చుచుండు నటనాన్యగ్రోధ వృక్షంబటా
నీడన్ జేరె శరత్కుమారుఁడు వికుంఠభ్రాంత చేతస్కుఁడై.

గీ. ,,కాలమా! యెంత యడియాస కనఁబఱిచితి
మెడను విఱిచి యొనర్చు నీ బహుగు పెండ్లి
నొప్పికొనకింత వట్టు నేనుంటి'' నంచుఁ
బరిమిత స్వరముగ వినఁ బడఁదొడంగె.

ఆ. చెవుల మూసికొంచుఁ జింతించె నిట్టుల
నతఁడు ,,నేను జగతిఁ బ్రతికియున్న
గోలుపోవు ధృతియు నీలువు యోగ్యత
కాన బ్రతికియుంట కాదునీతి.''

మ. అనియూహించిశరత్కుమారుఁడెలమిన్ న్యగ్రోధదీవ్యచ్ఛిపా
ప్రవివేష్టికృత కంఠ నాళుఁడగుచుం బ్రాణంబులం బాసి యొ
య్యనవాకాశ మహాంతరాళమున ద్వేలాడెం ద్వరం బొందియు
వ్వనజాతాయతనేత్ర వచ్చియపుడే వల్దంచువారింపఁబోన్.



# శుద్ధపత్రము.



| పుట. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 2 | 6 | జెందంగదే | జెందంగఁ దే |
| ... | 8 | తక | తకు |
| ... | 21 | కుమారు | కుమారుఁ |
| 4 | 3 | మహిళకల | మహిళలక |
| 5 | 16 | సుమకోమలికిన్ | సుమకోమలకున్ |
| 6 | 6 | దాసగుపోడిమి | దాసఁగుపోఁడిమి |
| 7 | 9 | గమించె | గమించెఁ |
| ... | 20 | బర్వగన్ | బర్వఁగన్ |
| ... | 22 | ఆగి | ఆఁగి |
| ... | 24 | ఒక్కడున్ | ఒక్కఁడున్ |
| 8 | 20 | సౌందర్యబు | సౌందర్యంబు |
| ... | ... | పాంటిగన్ | పాటింగన్ |
| 9 | 4 | తీరుత్రోఁప | చెన్నుడంప |
| ... | 19 | పతాళిలబొల్చు | పతాళిలఁబొల్చు |
| 10 | 9 | మన్మథుము | మన్మథుఁడు |
|  | 11 | ధార్ష్ట్యము | దార్ష్ట్యము |
| 11 | 11 | మునపార | మునునపార |

| | | | |
|---|---|---|---|
| 13 | 8 | పెటిఁగి పెటిఁగి | పెరిఁగి పెరిఁగి |
| | 14 | సంథానము | సంధానము |
| | 15 | విథానము | విధానము |
| 14 | 1 | నాబొంది | నింబొంది |
| | 3 | విథా | విధా |
| | 3 | జగజ్ఞాన | జగజ్జ్ఞాన |
| | 6 | పయిఁప్రే | పయిఁ బ్రే |
| | 9 | అనవృఁడుకు | అనవుడుఁగు |
| | 10 | చేష్టన్ | చేష్టల్ |
| 15 | 2 | నాఁడఁగ | నాడఁగ |
| | 18 | వ్యర్ధ | వ్యర్థ |
| 16 | 7 | నిచ్చలుబొల్చు | నిచ్చలుఁబొల్చు |
| | 17 | దీవ్యచ్ఛిపా | దీవ్యచ్ఛిఫా |

హితకారిణీ కార్యాలయమునను, ఏలూరు.

# పీఠిక.

---

పాఠకమహాశయులారా !

శ్రీయుతములగు భారతీయకుటుంబముల పెండ్లిండ్లలోఁ గూడ విద్యావినోదములు అనూచానాచారములని తెలిసి మా శ్రీశ్రీశ్రీ వెంకటరామలక్ష్మీనరసింహారావుగారి వివాహమహోత్సవంబున శతావధాని శివరామకవిగారి శతావధానము జరిపింపఁబడినది. ఈ సందర్భమునందలి కవితల నేకీకృతమొనరించి ముద్రింపించి కవితారసగ్రాహులకు నివేదించుచున్నాఁడను.

శ్రీ యినుగంటి వెంకటరంగ సీతారామారావు,

చాట్రాయి.

---

అచలాయతనము:—శ్రీరవీంద్రనాథుని వంగభాషలోని మాతృక.
వే. చంద్రశేఖరం బి. ఏ. చే తెలిఁగింపఁ
బడ్డది. నాటకము. 0—12—0

శతావధాని శివరామకవి గ్రంథములు.

| | |
|---|---|
| ఉత్తర హరివంశ విమర్శనము. | 1—0—0 |
| తాలు కట్టనము. | 0—4—0 |
| మాధవవర్మ-(నాటకము) మేలుప్రతి. | 0—14—0 |
| మామూలు ప్రతి. | 0—12—0 |
| ముక్తాలత-(ప్రబంధము) | 0—12—0 |

## శతావధానములు.

| | |
|---|---|
| కొవ్వూరు. | 0—3—0 |
| బెజవాడ. | 0—2—0 |
| తెనాలి. | 0—2—0 |
| లక్ష్మీనరసాపురము. | 0—2—0 |
| గుంటూరు- (అచ్చులోనున్నది) | 0—5—0 |
| ధాటీ(?)యి. | 0—4—0 |

వేలూరి ప్రచురణాలయము.
Velury Publishing House.
చిరివాడ-తేలప్రోలు పోస్టు,
కృష్ణాజిల్లా.



# చాట్రాయి శతావధానము.

శ్రోతలుఁ జెప్పిన పద్యములు.

**మ.** జనసంచారము శూన్యమై దెసలఁ గాంచన్ జెట్టుచేమల్ ప్రభం
జన ధూళింబడి యాకసంబు తుదిదాఁకం బోవు నేప్రాంతమం
దునుఁ దూఱఁగ బుద్ధిఁ గొల్పు పొదరిండ్లన్ మెండుగున్ నీదుద
ర్శనసౌభాగ్యము నేఁడు చేకుఱెనో చాట్రాయి! శోభామయీ!

**మ.** పొరుగూరుల్ బడి బండ్లనెక్కి పయనంబుల్ సేసి యైదాఱువ
త్సరముల్ దాఁటను నేఁటికిన్ మఱల సందర్శించె నిమ్మోన్నతో
ర్వర దుర్వారరయంబునం జనెను నీబండ్లందు బోల్తాలనున్
జరగం జేయుచు చూచుచుండఁగదవే చాట్రాయి! శోభామయీ

శ్రీ శ్రీ శ్రీ ఇనుగంటి లక్ష్మీనరసింహారావుగారు.

**శా.** శ్రీలావణ్యవిలాసవైభవములం గ్రేఁగంటఁ దత్సర్వగు
ర్వావళిన్ వేఁడొకకంటఁ దన్మహితగాథార్థంబులోఁ గంటఁ దా
శీలింపం గను దంట శ్రీవిభుఁడు మాసీతాంబికావేంకట
శ్రీలక్ష్మీనరసి హరాయుల కభీష్టప్రాప్తిఁ జేకూర్చుతన్.

**క.** ఇనుగంటివారి నింపలఁ
గనుఁగొంటిం దేజులఁ దెనుగంటి తెలంగం

టెని బీరమునన్ ముక్కం
టెని ముక్కంటెన ప్రతాప సిరుపములంటెన్.

మ. ఇనుఁగంటిం గడుఁ గన్నుదోయికిని జేజేలం తేని జేకొంటి నో
మునిఁ గంటిన్ వెనఁ గొంతసేపటికి నంభోజాక్షునిం గంటి నీ
యినుగంటిం గనుఁగొంటి సంతసము నేనీరీతిగాఁ గొంటిఁ బై
నినుగంటిన్ నరసింహరాయ! యిటుపై నిందింతు నేగంటినిన్

సీ. 'అర్థోహ వా ఏష ఆత్మన' యన్న శ్రు
త్యర్థంబుఁ జక్కగా నరయుమయ్య
'పుత్త్రకామనయా సముద్వహేత్త' న్నస్మృ
త్యర్థంబు లోపల నలఁదుమయ్య
'ఊర్ధ్వబాహు ర్విరౌమ్యేష్య' యటను బురా
ణార్థంబు మనమున నదుకుమయ్య
'త్యాగాయ సంభృతార్థానామ' టన్న కా
వ్యార్థంబుఁ దెలిసి యట్లలరుమయ్య
తేర కాలి తనానకు మేర మీఱి
చెప్పినాఁడె నటంచు యోజింపఁబోక
వీని నన్నిఁటిఁ దగ గౌరవింపుమయ్య
శిష్ట జనగేయ! లక్ష్మీనృసింహరాయ!

అవధానప్రారంభము.

నారాయణః. ౧

శ్రీలక్ష్మీ కుచకుంభ సంభృత లసద్గంధాప్త వక్షస్స్థలం
గంధోద్యద్వన మాలికా పరిమళ వ్యామోహితేలాతలం

చాతుర్వైద్య కలా కలాప కలిత వ్యాపార పారాయణం
కల్యాణైక నికేతనం గుణగణం వందేయ నారాయణం.

ప్రోషిత భర్తృక. ౨

చ. అలరులువిచ్చెఁదావులు దిశాంతరమందున హెచ్చెఁదుంటకో
ల్విలుతుని కాఁక రెచ్చెఁ గలవింకము కోయిల లాదియైన పి
ట్టల రవమెచ్చెఁగాలుల యడావడి భావము గ్రొచ్చెనాప్రియుం
డెలమిని రాఁడ టంచొకత యేఁకరియెఁ విరహజ్వరార్తయై.

వెలమవారు. 3

సీ. పులుల మీసముల నుయ్యెలలుగాఁ జేపట్టి
పొలుపార నూఁగిరీవెలమవారు
కొదమ సింగపు సటా కోటీర కూటంబు
వెలుఁగఁగాఁదాఁచిరీవెలమవారు
ముదురు ఏనిక కుంభములఁగల్గు ముత్తియం
బులగుత్తిఁ దెచ్చిరీవెలమవారు
మృత్యు ముఖోత్థ కర్మీరితం బొకోర
బెకలించి వైచిరీవెలమవారు
గీ. విజయ లీలలఁ దేలిరీ వెలమవారు
విమల కవితల వ్రాసిరీ వెలమవారు
విపుల విపులను నేలిరీ వెలమవారు
వెలమ వారల నెవ్వారు గెలుచువారు?

వేంకటేశ్వరస్వామి. ౪

ఉ. శ్రీలు వెలుంగు క్షేత్రములఁ జెన్నెసలారెడు కందుకూరిలోఁ
గ్రాలెడు వేంకటేశ్వరుఁడు కంటికి తెప్పయునంగఁదోఁచుచున్

మాలిమిమీఁలు గ్రుడ్డులకు మావియనం బొలుపారుచుండితా
నేలెడుఁగాక యెల్లపుడు నీయినుగంటి కొలంబువారల౯.

వియ్యాలవారు. ౫

ఉ. తిండికి రెండు యామములు దేఁకె డికాతఁ నెసంగుకాఫినీ
ఖ్యుండకపోయె దేహమున కొప్పమి పుట్టె నటంచు బావలై
యుండెడువారు వియ్యముననుండెడివారలఁబల్కుదుర్ వియం
కుండు సమస్తసౌఖ్యములఁగూర్చినయేనియు నవ్వుటాలకై.

తమోఽభిసారిక. ౬

గీ. మాలతీపత్రములు గండమండలమున
నీలికోకయు రైకయు నీటుమేనఁ
దనరఁగా నభిసారికాంగన యొకర్తు
క్రాలె గాఢేయ స్పృష్టయా రతియనంగ.

ఇరువురు పెండ్లములఁ జేకొనువాఁడు ౭

సీ. రెండునావలయందు రెండుకాళ్ళనుబెట్టి
నదియందుఁబోవు చందంబు నంది
రెండు గుఱ్ఱములపై రెండుకాళ్ళనుబెట్టి
స్వారి చేయంగ భావంబుఁ బొంది
రెండు విద్యలయందు రెండు బుద్ధులనుంచి
సాధింపఁ జాలు వైశద్య మొంది
రెండు యోజనలందు రెండు భావనలుంచి
గ్రహియింపఁ జాలు శక్తత్వమొంది
రెండు పంటల నొక్కసారిగను నొక్క
పాటి కేదారమునయందుఁ బండఁజేయు

శక్తి వైపుల్యములఁ బొందఁ జాలుదేని
యిరువు రిల్లాండ్రఁజేకొని యేలుమయ్య!

రాజ భటుఁడు. ౮

మ. అగురా!ఁపోకుముపోకుమంచు'భటుఁడాద్వారంబునందుండి కెం
పగు చూడ్కిం దిలకించి పై నిఁగొరడా నాడింపఁ జేదస్త్రమా?
మగ పుట్టుం దగఁబుట్టవా? జిలమఃకంపంబోలు నారాజునే
ర్పుగ వీఁడందగు ముష్టియెత్తుకొనుమిా!రొక్కంబులేకుండినన్

విద్య. ౯

ఇలపయిఁ బు ట్టి ... ... నెందు మనుష్యులకుంబశూత్కరం
బులకును భేదభావములు బోధనముం బొనరింపఁజాలు చా
యల సముదాయమెల్ల సముపార్జనఁ జేయఁగఁజేసి తత్త్వముం
దెలిపెడి విద్య విద్యయని ధీరులు పల్కుదురూహపెంపునన్.

దంపతులు. ౧౦

చ. పతిపచరించుమాట సతి పల్కఁగ నా సతిమాట లెంతయున్
బతి పచరింప నొండొరుల భావము లేకతమై చెలంగఁగా
నతిథి సపర్య చేయుచును నాదట నీశ్వరభక్తి కల్గు దం
పతులను నెల్ల వేళ భగవంతుఁడు ప్రోచుతఁ బ్రేమదృష్టులన్

ఈ సభ. ౧౧

శా. రాజుల్ పల్వురు వచ్చినారు కవితారాజుల్ సుధీరాజుల
వ్యాజ భ్రాజితపాండితీ పరిచితీ పారంగతుల్ వచ్చి నా
రోజన్ వెంకటరామలక్ష్మినరసింహాహ్లాదావహాపూర్ణశాలకున్
రా జద్రామ వివాహమందిర సభారంగానకుం బోలుచున్.

## పుష్పలావికా నర్మోక్తి. ౧౨

సీ. నీవీ ధనంబట్లు నీవేల దాఁచెదే
పూల మాలికల నమ్ముటకుఁ జూపు
కలి గొట్టు పూవు నాకలి గొట్ట! విలువవే
కోరిన దిత్తు సంకోచపడకు
నీ దండ వెలయెంత? నిజము చెప్పంగదే
మైన నేమామె నీ యాన తెమ్మ
గోరంట నీ యవే కొమరాగ నొకసారి
కులుకుఁ బెఱగుబ్బల కుదురులాఁడి
గీ. అంచు నొక్కట నొక్క సయ్యాట కాఁడు
పుష్ప లావిక తోడను బ్రొద్దుపుచ్చ
నీ సరికి నీ సరికి వెల లేర లీయ
లేరు లేరని పల్కెఁ బువ్వారుఁ బోఁడి.

## దశావతారములు. ౧౩

సీ. మత్స్యావతారమై మడఁచెనా సోమకుఁ
గూర్మావతారమై కుతల మెత్తె
నల పందియై హిరణ్యాక్షుని వధియించె
నరసింహుఁడై హిరణ్యకునిఁ ద్రుంచె
వామన రూపియై బలిరాజు బలిఁ గోరెఁ
బరశురామతఁ బ్రభు వ్రజముఁ దునిమె
రామావతారమై రావణాసురు రాచె
బలరాముఁడై ప్రలంబకునిఁ గెడపె
గీ. బుద్ధుఁడై మేలి బుద్ధుల బోధ చేసెఁ
గల్కి రూపంబు తానెల్లిఁ గాంచబోవు

నట్టి యీశ్వరుఁ డాది నారాయణుండు
శ్రీకరుఁడు ప్రోచుఁగావుత లోకములను.

కాకవులు + కాకవులు. ౧౪

మ. పదముల్ తొట్రిలు డేఁగ నాఁగవులతోఁ బాటించి పోట్లాడు న
య్యదనందుం గ్రమమైన వేగములతో నల్లల్లనుం బోవు న
య్యదనం బక్షుబలంబు పాడఱుట నౌరా కాకవుల్ కాకవుల్
గద లక్ష్మీనరసింహరాయ! కవితాకాంతాకటాక్షోదయా!

రాజనీతి. ౧౫

శా. లోకంబుల్ సరియైన రీతిఁ గనుటల్ లోపంబు లేకుండ న
స్తోక ప్రక్రియ శాంతి తేజముల నేచో హెచ్చునో కూర్మిమై
నే కర్తల్ లగియించుచుం గ్రమత నెంతేనేలు భూపాలు సు
శ్లోకుల్ మెత్తురు కానినాఁడు జనముల్ దూషింతు రెక్కాలమున్.

బ్రహ్మానందానుభోక్త. ౧౬

మ. వనమందుం బొదరిండ్లయందుమివ్వులల్ వాలాయమస్సైకతం
బున యందుల్ శవమో యనంగఁ బడుచుం బూర్ణంపు
యోగంబునం
దనయంబుల్ మనముల్ లగించుకొని బ్రహ్మానందముం జెందువా
నిని వర్ణింతు నమస్కరింతు నెద ధ్యానింతుల్ భజింతుల్ సదా

బండిపైఁ బోరుగూరేఁగుట. ౧౭

ఉ. ఓరిమి బండి నెక్కి పోరు గూరికిఁ బోయెడు పట్ల లోయలన్
దారుల మిట్టుపల్లముల దాఁటెడు వేళలయందు నెందు బో
ల్తారచియింపఁ జేయకయ లక్షణశిక్షితమైన యెద్దులం
గూరిచి తోలుమెప్పు సెలగోల యదల్చుచు నోయి సారథీ!

సుకవిత్వము. ౧౮

శా. పద్యంబుల్ సరసార్థ పద్యములుగా భావింపఁగాఁబోలు సా
హృద్యంబౌ యతితోడఁ బ్రాసములతో నింతేని పోరాద గం
గోద్యత్స్వచ్ఛ మహాప్రవాహములతో నుద్ధాయనంజాలుసం
పద్వ్యక్తంబగు ధార కల్గినఁ గవిత్వంబుల్ సభం జెప్పుమీ.

రతాంతము. ౧౯

మ. కులుకుంగొప్పును గావిమోవితళుకుల్ క్రొవ్వారు పాలిండుల
చ్చలమౌ మాటలు కట్టుకోకకళుకుల్ సంపూర్ణచంద్రుండనన్
వెలయం జాలెడుగోముమోము బెళుకుల్ విజ్జోడు కానేల? యో
లలనా! చెప్పుమటన్న నాథునకుఁ బెల్చంజూపె సద్దంబొగిన్.

వసంతము. ౨౦

మ. మదిరాపానవిజృంభితంబులగు నా మత్తేభముల్ వోని తు
మ్మెద పిండుల్ రొదచేసెఁ జిల్కలును సామీచీన్యమై మ్రోసెన
మ్మదనుండమ్ముల నెక్కువెట్టుఁగొని భామాస్వాంతలక్ష్యంబులం
జెదరంజేసె వసంతకాలమునఁ దాఁ జేదోడుగాఁ జైత్రుఁడున్.

ఉత్పలమాల. ౨౧

ఉ. కాటుకపిట్టలోయనఁగఁగ్రాలె సరస్సుల కన్నులోయనం
దీటయి చెన్నుమీఱె నలదివ్యకళామయుఁడైన మారుశృం
గాటకమందుఁ గ్రందుకొను గాజుల కుప్పెలనం జెలంగె నో
పాటలగంధి! చూడు! కనుబాటగు నుత్పలమాలికావళిన్.

ప్రణయకలహము. ౨౨

మత్తకోకిల.

మత్తకోకిల సుస్వరంబుల మానె మానిని మానినీ
కృత్తుఁడై యలనాయకుండును గేరి కేరడమాడ నా

యత్తుఁడాయెను గాలి కొంచెగ నప్డుపీవఁగఁ జీరలున్
హత్తుకోఁ బొలయల్క నొండొరులాదృతిం గొనిరెంతయున్

ఒక కల్పన. ౨౩

చ. కుదురుగ గుజ్జుమావి నెలకొన్న కపోతము పోతరించి కూ
యఁ దొడఁగెనంచు జోడరసి యాదటనీడకు రాకలెక్క దో
మదవతి! యేడనుండినను మాటటగా నిటుగూడ మందునన్
వెదకఁగనేల? ముంచులవి పీఁపులురావులోనర్చెఁ జూడుమీ.

ఱేఁడెవఁడు. ౨౪

శా. ఱేఁడంచుం దగనొప్ప నీపదము పూరేడందునంబొల్చు మా
రేడందుం డెగఁబొల్చు నియ్యదియె నేరేడందునంబొల్చు నీ
రేమల్ ఱేఁడులుగావు తాడులుచుమీ వ్రేఱేఁడు రేఱేలతో
నీడుంజోడగు ఱేండ్లు ఱేఁడులుకదా యీరేడు లోకంబులన్.

శ్రీతిరుపతిశాస్త్రిగారి నిర్యాణము. ౨౫

సీ. ఆంధ్ర కవిత్వ పుణ్యాంగనా తిలకంబు
నుదుటి పెందలకంబు చెదరి పోయె
వేంకటేశ్వర మహా విద్వత్కవీశ్వరు
కుడి బుజంబది నేలఁ గూలిపోయె
శివరామ కవి సర్వ శేముషీ సంపోషి
నికషోపలంబది నీటఁ గలసె
ఆంధ్ర గీర్వాణ భాషాభిజ్ఞరసిక లో
క గణామృత ఝరంబు లిగిరి పోయె
గీ. నల్ల యవధాని యాదిగా నైన పండ్లఁ
గాచి పండించు చున్నట్టి కల్ప శాఖి

విఱిగి పోయెను గూఁకటి వ్రేళ్ళ తోడ
నయ్య తిరుపతి శాస్త్రి! మీరరుగు కతన.

ఆశీర్వచనము. ౨౬

సీ. ఆదికవీశ్వరుం డైన బృహస్పతి
సంతాన ములను నొసంగుఁగాక
ఆది కవీశ్వరి యైన సరస్వతి
శబ్దార్థ మెఱిఁగించి సాకుఁ గాక
ఆది దేవుం డైన యల బ్రహ్మణస్పతి
ప్రౌఢ సత్త్వంబు చొప్పడచుఁగాక
ఆది దేవతయైన యల్లపరాంబిక
ప్రథిత సంపత్తి నేర్పఱచుఁగాక

గీ. శ్రిత గుణాలంబయైన శ్రీ సీత యాంబి
కా వధూటిక కెందు సంగాతి యగుచు
శిష్ట జన గేయుఁ డైన లక్ష్మీ నృసింహ
రాయలకు నెల్ల కాలంబు బ్రాఁతిమీఱ.

ఆకాశపురాణము సరిగానుండవలయుననుట. ౨౭

క. ఆకాశ పురాణంబల
వోకం జెప్పంగ వలయుఁ బొంపిరి వోవక
లేకున్నం జెప్పంగా
నూఁకొట్టక రాదు కవుల కుర్వీ తిలకా

రాజులు కవిరాజులు ౨౮

సీ. నడిపించె నేదేవి నవరాజ రాజుల
రథములకును మనో రథములెదురు

పరఁగించె నేదేవి వరమహీపాళుగ
ధారల కాళుగ ధార లెదురు
సృజియించె నేదేవి పృథుల రాజ్యముల కూ
రక కవితా మహీరాజ్య మెదురు
రచియించె నేదేవి రమణీయ మహనీయ
రాజులకును గవిరాజు లెదురు

గీ. అట్టి వాగ్దేవి జేసి రాజాధిరాజు
లకును గవిరాజరాజ తల్లజులు దీటు
కాంత కవితాతి గేయ ! సత్కవి విధేయ !
శిష్ట జనగేయ ! లక్ష్మి నృసింహరాయ !

అప్పులఁబడువాఁడు. శ్లేష. ౧౯

సీ. అప్పులఁ బడువాని యాకార మెల్ల దు
స్తర వారిగ మిత్రమై క్షితి వహించు
అప్పులఁ బడువాని యాకార మెల్ల దు
ర్భరముగాఁగ నుపద్రవమ్ము నొందు
అప్పులఁ బడువాని యాకార మెల్లను
శఫరీతిఁ బొంది త్యాజ్యతను జెందు
అప్పులఁబడువాని యాకారమెల్లఁ బం
కజరూపరీతిగాఁ గ్రాలుచుందు

అప్పులను బడ్డవానిని నప్పులందుఁ
బడ్డవానిఁగఁ జెప్పంగ వచ్చుఁగాదె
కాంత కవితాతిగేయ! సత్కవి విధేయ!
శిష్టజనగేయ! లక్ష్మినృసింహరాయ!

## జ్యోతిషమ్. ౩౦

చక్షుర్మార్గ మతీత్య దుర్గ పదవీ సింహాసనాధ్యాసితం
తారాజాల మనేక మప్యనుదితం విజ్ఞప్య విజ్ఞానతః
సర్వేషాం సకలాత్మనోప కురుతే జ్యోతిర్మయీ సత్కళా
యాతాంనిత్యముపాసిషీమహిమహామోహాద్రుహాం సత్సు
హామ్.

దశావతారములు తలక్రిందుగాఁ జెప్పవలయును (వచనము) ౩౧

వ. కల్కివై చెట్లఁ గొట్టుచు బుద్ధుఁడవై యద్వైతంబు నకు దారిఁ జూపితి శేషునకు మాఱటగా నూఱటఁ గాంచితి రాముఁడవై రావణు రాచితి పరశురాముఁడవై క్షత్రియులఁ బొఱద్రోలితి వామనుండవై బలి బలిఁ గోరితి నరసింహుఁడవై హిరణ్యాక్షు నాశమొనరించితి వరాహమవై హిరణ్యాక్షు హింసించితి కూర్మమవై కుతలమెత్తితి మత్స్యమవై సోముకు మడఁచితి నారాయణా! నీప్రోపుప్రాపులకు దాపు జూపుము.

{ పర్వతము చిందము బిసనాళము సౌదామిని కుటిలత
నల్లందనము మృదుత్వము ఇవి వచ్చునటులు }

స్త్రీవర్ణనము. ౩౨

సీ. కుదురుమీఱిన మేలి గుబ్బపాలిండ్లలోఁ
బర్వతంబులప్రౌఢి పాదుకొల్పి
కరమక్కజంబునౌ కంఠంబునందునఁ
జిందంబునందంబు పొందుపఱిచి
పదనుగాఁదోఁచిన బాహుయుగ్మంబులో
బిసనాళసౌభాగ్య మెసఁగఁజేసి

అస్తినాస్తి విచికిత్సాస్తమధ్యంబులో
సౌదామినీరీతి సంతరించి
కుంతలంబులయందున కుటిలతలును
లవణి వేసలియందు నల్లందనంబు
తనువునందెల్లెడల మృదుత్వంబునించి
నలువ నిర్మింపఁబోలు నీ నాతి మిన్న

లక్ష్మీ సరస్వతుల సంవాదము. 33

మత్త-ఎద్దునెక్కును నీమగండని హేలచేసెడి లక్ష్మినిం
గ్రద్దనెక్కును నీమగండని గారిపల్కఁగ లక్ష్మియుళ్
మొద్దునీ మగఁడంచుఁబల్కిన మూరిబోవుచు గౌరియుళ్
మద్దికృష్ణుఁడు నీమగండను మాట లెల్లరఁ బ్రోవుతళ్.

కన్యాపరిదానము. 34

మ. పిరిదులం బాఱని సౌరునీరు నదిలో రెండోడ్డులం దట్టి రెం
డుదెసల్ పూతముచేయుచందమునను బూతంబుగావించు రెం
డు దెసల్ బాల్పుకోలంబువారలకు నెంచుంబుణ్యదంబౌను భో
గదమౌ యోగదమౌను రాగదము నౌఁగన్యాప్రదానంబిలళ్

టెంకాయ పిచ్చికొండ. 35

గీ. ఒకఁడు రారాజు నింపువే రోలగంబు
ముందఱికుఁబోయి టెంకాయ పుచ్చికొండ
టంచుఁ బల్కంగఁ బోయి భయంబుచెంది
యనియెఁ 'టెంకాయపిచ్చికొండా' యటంచు.

దారిద్ర్యము దారిద్ర్యము పోఁగొట్టుననుట. 36

క. దారిద్ర్యంబను భాగ్యము
దారంగా దుష్టపాప దారిద్ర్యంబుల్

తాటియును తాటాకిని జగ
ద్ధారా విద్యావిశేష దారిద్ర్యంబుల్.

అవధానములఁ గవి మనస్సు 38

ఉ. కత్తిమొనల్ వలెం గను నిగారములన్ వెలుఁగున్ శరంబులన్
జొత్తిలు వేగముల్ గలుగు సుందరిచూపులకోపుత్తైక్ష్ణ్యముల్
హత్తు శతావధానముల యందుఁ గవిత్వము లల్లువారి స్వా
యత్త మనోమనంబు లగురా యుపించును వేరికేనియున్.

స్త్రీముఖమును పద్మమనుట. 39

కవి. రజనికరానన ! నీదగు మోమున రాజిలు తుమ్మెద లోయన న
క్కజమగు నక్కనుబొమ్మలయందము గాత్రి యటనెంతయుఁదావులుది
గ్గజమున వాంతర దిగ్గజముందునఁ బర్వు మనుండఁగఁ జేయుటచేఁ
బ్రజలనుకొందురు నీదగుమోమును బద్మమటంచును సద్మతులై.

సంజ కెంజాయ. 39

క. సంజలఁ గెంజాయలు దివి
కెం జీవర మూర్గనెచు రీతిగను రజః
పుంజంబు పర్వు రీతిగ
నుం జిక్కని నక్క నెత్తునుం బోలుచునున్.

నీచస్త్రీ. 40

ఉ. ప్రాచితనంబు నెంతయును భావమునం దలపోయుచుండు సం
కోచము లేక పున్నెములఁ గోఁచపడం బొనరించు దారులం
దోఁచు జనుం గటాక్షములతోఁ బ్రహరింపక మానఁబోవదా
నీచపుటాఁడు దానినిట నీవడుగన్ గతమేమి పృచ్ఛకా !

ఒకకల్పన. 'సాలగ్రామ' అనుపాదమును జేర్పవలయును. ౭౧

శా. మేలౌ రాత్రిని యష్టకన్య విధునిం బ్రేమించి తానవ్యమా
మూలం బాపద ద్వితీయవట్టునెసుకన్ సూర్యున్ వచ్చినేఁ బోమె నా
లీలంగాంచుచుఁ గాఱుచీఁకటిని చల్ దీపింప నిట్లాడె నా
"సాలగ్రామ ఖనిన్ జనించునెకదా జాత్యల్పపాషాణముల్.

సమస్య ౭౨

క. గిరివరుఁడగు హిమవంతుకొ
మరె యీశ్వరు సామిమేని సోకొను శక్తి
స్ఫురణం జెలువారెడు నా
సరసీరుహనేత్రి కొక్క స్తనమే కనుమా!

అవధానాంత పద్యములు.

మ. ఒకపాదంబని కందుకూరుననుదా నొప్పారె నెవ్వారి యి
చ్చకు నచ్చెంగఁ బ్రసాదవైభూతి యొదవెం జాత్రాయిఁకో నేఁటిమే
రకు సంపూర్ణసుఖాతిరేకము పొనర్చెంగాఁ జతుష్పాద్వైభూ
తికిఁ దానైతి శతావధానమ! కళాదివ్యాను సంధానమా!

బహూకరించినపుడు చెప్పినవి.

సీ. చైత్రుఁడియ్యెడలేఁడు సహకారమంజరీ
పుంజరీతి సుగంధములు జనించె
చంద్రుఁ డియ్యెడలేఁడు చంద్రకాంతోపలో
త్పద్యమానోపద్రవమ్ము లెసఁగె
పికములియ్యెడలేవు ప్రీతనానాలోక
సంచారి పంచమస్వరములలరె

అతులితపాండితీయుతులలో నొకనిఁ గాఁ
దలఁచి మన్ననఁ జేయుఁ దలఁపుమయ్య
అసమానవితరణాభ్యసనంబుచేఁ గర్ణు
మించినాఁడని యనిపించుమయ్య
బలితంపుదారిద్ర్యముల భ్రమంపుబీదలఁ
గాంచుచు మాటదక్కించుమయ్య

గీ. శ్రీలవెంకటరామ లక్ష్మీనృసింహ
రాయ! సీతాంబతోడఁ జిరాయువెసఁగ
నవ్యయ సుఖాంబునిధి నోలలాడుమయ్య
పేరుఁగొనుమయ్య యాచంద్రతారకముగ.

సీ. దారిద్ర్యఘర్మ సంతప్తార్థిచాతక
ములకు నూతోన్నదయాజలదుఁ డితఁడు
సతతదుర్నయసక్త శాత్రవనీహార
పటలంబునకుఁ జండభానుఁ డితఁడు
రామామణీచిత్త రాగసంవర్ధన
కరణదక్షత నూత్న కాముఁ డితఁడు
రసభావసద్వృత్తరత కృతికన్యల
కోర్కెఁదీర్చెడి పెండ్లికొమరుఁ డితఁడు

గీ. తమ్మిగద్దియకొమపట్టుఁ గొమ్మయితఁడు
దీనజనములపాలిఁటి దిక్కితండ
టంచు కవికోటినీకీర్తి యభినుతించు
మాదిరిగఁ జేయుమిా వేయుమాటలేల.

మేడవరపు రామబ్రహ్మశాస్త్రి

ఉ. శ్రీనిధి సంపదల్ శివుండు శ్రేయములన్ విధియాయురున్నతుల్
గానుకలిచ్చుచున్ సకలకాలములన్ గనుసన్నలందు నెం
తేనిమెలంగుచుం గావుతను ఘనుత వెంకటరామ పూర్వ ల
క్ష్మీ నరసింహరాయనికి సీతమతల్లికి నాదరమ్మునన్

సీ. దానధర్మజ్ఞాన ధౌరేయ మూర్తినై
పెద్దలౌ వారి సేవింపుమయ్య
ప్రథిత సత్కీర్తి ప్రభాసుధా కలన ది
గ్భిత్తి పంక్తుల వెల్ల వేయుమయ్య
ముఖచంద్రమః కళాభూత కటాక్షముల్
విబుధ కైరవములం బెంపుమయ్య
శాంతితేజంబుల సరఘూసమాశ్రిత
మధుకోశమట్టుల మలయుమయ్య

గీ. సీతయమ్మతో పాటు లక్ష్మీనృసింహ
రాయమాకవితాకన్య చేయిపట్టి
సవతిపోరును రానీక సవదరించి
యందఱకు సంతసంబుచే యంగదయ్య.

శా. వాచామాధురిం గార్యభారవహనప్రౌఢత్వమందున్ స్వవం
శాచారంబున సత్ప్రవర్తనమునన్ న్యాయైక వాచార్భటిన్
ధీచాతుర్యము నందు నీకుసములౌ ధీరాగ్రగణ్యుల్ దరి
త్రీచక్రంబున లేరులేగనెను కీర్తింజెంద యత్నింపుమా.

శా. సీతాదేవివి నీవు రాముఁడు యశస్స్థేమాభిరాముండు ని
య్యాతండే మరికందుకూర్మిథి లయోధ్యభూత చాట్రాయి స
ద్భావంతంబుల్ రసికుల్ వశిష్టముఖులీ భాగ్యంబుమైనొప్పనో
సీతయ్యమ్మ! యయోధ్యకున్ మిథిలకున్ శ్రీకీర్తులందింపుమా.

ఉ. వెలమలటన్నచోఁ బరుల బిట్టువడంకఁగఁ జేయఁజాలున
వ్వెలమలలో! యకించనులపాలిటి దైవము జూపినట్టి య
వ్వెలమలలో! యశోధవళవీచి పరంపరలందనర్చు న
వ్వెలమలలో! సురాద్రి జళిపించుమహాబలులో! తలంపఁగ౯

సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి.

మంజువాణీ ముద్రాక్షరశాల, ఏలూరు.